శ్రీ వేదాన్త దేశిక విరచిత

# శ్రీస్తుతి

## హిరణ్మయా వాఖ్య

వ్యాఖ్యాత:- శ్రీమాన్ కె.వి. రాఘవాచార్యులు

ప్రకాశకులు : శ్రీయుత మాదాడి కృష్ణారెడ్డి గారు



తిరుమల చారిటబుల్ ట్రస్టు - హైదరాబాదు

శ్రీ వేదాన్త దేశిక విరచిత

# శ్రీస్తుతి

## హిరణ్మయీ వ్యాఖ్య



వ్యాఖ్యాత : కె.వి. రాఘవాచార్యులు

ప్రకాశకులు : శ్రీయుత మాదాడి కృష్ణారెడ్డి గారు
న్యాయవాదులు కరీంనగర్

తిరుమల చారిటబుల్ ట్రస్టు, హైదరాబాదు

శ్రీస్తుతి - హిరణ్మయీ వ్యాఖ్య

వ్యాఖ్యాత : కె.వి. రాఘవాచార్యులు



ప్రథమ ముద్రణ : సర్వజిత్ ఫాల్గుణం
27 మార్చి 2008

ప్రతులు : 1000

వెల : రూ. 60/-

ప్రకాశకులు : శ్రీయుత మాదాడి కృష్ణారెడ్డి గారు (అడ్వకేట్)

ప్రతులకు :

1. శ్రీ నిలయం ఇం.నెం.2-10-1181
జ్యోతినగర్, కరీంనగర్ - 505 002
ఫోన్ : 0878-22620 6

2. శ్రీ మాలోల గ్రంథమాల
శ్రీ అహోబిల మఠం
2-2-20/బి, దుర్గాబాయి దేశముఖ్ కాలనీ,
హైదరాబాదు - 500 013.
ఫోన్ : 040-27423043

ముద్రణ :
వాగ్దేవి ప్రింటర్స్
నల్లకుంట, హైదరాబాద్-44
ఫోన్ : 27673772



**శ్రీ మాదాడి జగన్మోహన రెడ్డి - సౌభాగ్యమ్మ**

మోహమదాది శాత్రవ సమూహమునెప్పుడు విష్ణునామ సం
దోహమహత్వ భావనల దూరము చేయుటెకాక **శ్రీజగన్**
**మోహనరెడ్డి** ధర్మపథమున్ విడనాడక, సల్పి సత్క్రియల్,
దేహమువీడి శ్రీధరుని దివ్యపదమ్మును పొందె, తత్కృపన్ ॥

పతిని మదిలోనె తలచు సౌభాగ్యదేవి
తండ్రి కీర్తిని నిల్పు నాత్మజుడు, స్నుషయు
కృష్ణరెడ్డి, సులోచన, 'శ్రీస్తుతి' కగు
ముద్రణద్రవ్య మొసగిరి ముదముతోడ ॥

పాలకడలిని వెలసిన పద్మనిలయ
పరమ కరుణతో మాదాడి వంశకీర్తి
కలశజలధి పొంగెత్త వెన్నెలల సిరుల
చిల్కుచును సంతతిని కటాక్షించుగాత!

SRIMANNARAYANA RAMANUJA YATHIBHYO NAMAHA



Tridandi Chinna Srimannarayana
Ramanuja Jeeyar Swamy
JEEYAR EDUCATIONAL TRUST
SITANAGARAM - 522 501
GUNTUR DISTRICT. A.P.
✆ (08645) 272929, 272353

[illegible]!
శ్రీమతే నారాయణాయ నమః
అనేక మంగళాశాసనములు!

Dt.

శ్రీమతే నారాయణాయ నమః

# అనేక మంగళాశాసనములు

మన పూర్వాచార్యులు భగవద్విషయకంగా తాము పొందిన హార్దమైన దివ్యానుభూతిని శ్రుతిసుభగంగా, రసస్యందిలంగా హృద్యంగా స్తుతిప్రబంధాల ద్వారా ఎంతో ఔదార్యంతో తరువాతి తరాలవారికి తరగని సంపదగా అనుగ్రహించినారు.

నిత్యానుసంధేయమైన ఈ స్తుతి వాఙ్మయాన్ని దివ్యదంపతుల స్వరూపరూపగుణ విభూతులను చూడముచ్చటగా మన కనులముందు నిలిపి ఆ చూచినదానిని హృదయాలలో రసార్ద్రంగా పదిలపరచుకోగల తీరున ప్రసాదించి మహోపకారకులైనారు.

అమ్మను పురుషకారంగా స్వీకరించి దివ్యదంపతుల శ్రీచరణకైంకర్యాన్నే ప్రాప్యంగా భావించినందువల్ల పురుషకారంగా వాత్సల్యసీమాభూమి మాతృమూర్తిగా తన వల్లభునితో కలిసి ప్రాప్యంగా ఆ జగన్మాతను కీర్తిస్తూ స్తుతులను కావించినారు.

శ్రీ శ్రియఃపతులు సుమసౌరభాలవంటివారు కావటాన తావి ముందుగా పూవు, పూవును తాకగా తావి అనుభవానికి రాక తప్పదు. అయినా దేని రుచి దానిది. దేని గరిమ దానిది. దేని తీరు దానిది. దేని మ్రదిమ దానిది. దేని అతిశయం దానిది. అయితే ఇవన్నీ నిత్యానపాయాలు. అన్యోన్యోపస్కారకాలూను.

ఆళవందారు చవిచూపిన శ్రీతత్త్వపు నిరతిశయ మాధురీరుచులు విశదమధురంగా రసఘనంగా కూరేశ భట్టారకులు కొనియాడగా ఏర్పడిన హృదయ సంవాదంతో శ్రీమద్వేదాంతదేశికులు శ్రీస్తుతి ప్రబంధాన్ని మధుకలశంగా మనకనుగ్రహించినారు.

ఈ స్తుతి ప్రబంధాలన్నీ సంస్కృత భాషలో ఏర్పడినవి. అవి కావ్య గుణశోభితాలు మాత్రమే కాక సిద్ధాంత విషయ గర్భితాలూను. సంస్కృత భాషకు సంప్రదాయ వాసనలకు రానురాను మరీ దూరమవుతున్న మనవారికి పెద్దలనుగ్రహించిన వ్యాఖ్యానాలు అవశ్య

సమాశ్రయణీయాలు. అవి సంస్కృతంలోనో తమిళంలోనో ఉన్నాయి. వాటిని తెలుగు కావిస్తేకాని, సామాన్యులకీ ప్రబంధాలు అందుబాటుకు రావు.

ప్రస్తుతం ఆ లోటును తీరుస్తూ శ్రీ దేశికుల శ్రీస్తుతి ప్రబంధానికి ఉ.వే. శ్రీమాన్ కె.వి. రాఘవాచార్యస్వామివారు తెలుగులో చక్కటి వ్యాఖ్యానాన్ని సమకూర్చి ఆస్తికుల కృతజ్ఞతకు పాత్రులైనారు.

ఉ.వే. శ్రీమాన్ రాఘవాచార్య స్వామివారు ఉభయవేదాంత పరిజ్ఞానం కలిగి మృదుమధురమైన రచనకూడా కావింపగలవారు. మంచి భావుకులు. ఆళ్వారుల దివ్యప్రబంధాలను సంస్కృతాంధ్రకవుల కావ్యాలను చక్కగా అవగాహించినవారు. అభీతిస్తవము, యతిరాజ సప్తతి వంటి దేశిక ప్రబంధాలకు కొన్నిటికి ఇంతకుముందే కూర్చినవారు. 5 సంపుటాలుగా వెలసిన వారి పాదుకాసహస్రవ్యాఖ్య నిజంగా రమణీయం.

ప్రస్తుతం శ్రీ స్తుతిని తమ హిరణ్మయీ వ్యాఖ్య ద్వారా తెలుగువారికి పరిచయం కావిస్తున్నారు. వీరి వ్యాఖ్యానం పాఠకులకు అర్థతాత్పర్యాలను బోధించడంతోపాటు అనేక సంప్రదాయ రహస్యాలను ప్రామాణికంగా వివరిస్తోంది.

శ్రీ దేశికుల స్తోత్రారంభంలో తల్లి లక్ష్మీదేవిని మధువిజయి వక్షఃపీఠ భూషగా నిలిపి స్తుతిపరిసమాప్తిలో మధువిజయి దివ్యసంపదగా పేర్కొంటారు. శ్రీస్తుతిలో ఆద్యంత మధుసూదన స్మరణానుబంధం ఆ దివ్యదంపతుల నిత్యానపాయానుబంధానికి దేశికులు పట్టిన నిలువుటద్దం.

విష్ణుసహస్రనామాలలో "మాధవోమధుసూదనః" అని మాధవ మధుసూదన శబ్దాలు సహపఠితాలు. ఆయన శ్రియఃపతి "భవతీ" సంబంధ దృష్ట్యా మనకు అభిగమ్యుడు. ఆయన మధుసూదనుడు. అసుర నిరసనాదులచేత నిష్ప్రతిపక్ష లక్ష్మీకుడు. ఆయన లక్ష్మీవైశిష్ట్యం అవిచాల్యం. విరోధినిరసనదక్షుడు కనక మనకు ఫలదాత. ఇట్లా దివ్యదంపతీ శ్రీచరణ కైంకర్యమే స్పృహణీయమన్న విషయాన్ని తమ ప్రబంధం ద్వారా దేశికులనుగ్రహిస్తారు.

సర్వులకు నిత్యానుసంధేయమైన ఈ స్తుతి ప్రబంధవ్యాఖ్యానాన్ని తెలుగు వారికి అందుబాటుకు తెచ్చిన శ్రీమాన్ రాఘవాచార్య స్వామివారు కృతార్థులు.

శ్రీమాన్ రాఘవాచార్యస్వామివారు ఇంకా అనేక సంప్రదాయ ప్రబంధాలకు మధురమైన వ్యాఖ్యలు కూర్చి తెలుగువారికి అందించగలిగేటట్లు ఆయురారోగ్యాలను ఆ దివ్యదంపతులు అనుగ్రహించాలని అనేక మంగళాశాసనములు కావిస్తున్నాం.

జై శ్రీమన్నారాయణ!

మహావిద్వాంసులు, సువచః శ్రీవల్లభులు
**ఉ.వే. శ్రీమాన్ ఆచార్య టి.పి. శ్రీరామచంద్రాచార్య స్వామివారు**
సంపాదకులు : భక్తి నివేదన,
సింహాచలం.

# గ్రైవేయకమ్

సత్సంప్రదాయ స్తోత్ర వాఙ్మయంలో భగవద్ గుణాభివర్ణన పరాలుగా కొన్ని స్తుతులు వెలయగా భగవతీ గుణకీర్తన ప్రవణాలుగా కొన్ని స్తుతులు అవిర్భవించినవి.

నిజానికి రెండూ భిన్నాలు కావు. అయ్య పొగడికోలులో అమ్మ కైవారముల సవ్వడులూ వినవస్తాయి. అమ్మకు కావించే కైమోడ్పులలో అయ్య గొప్పతనాలు కత పబ్బాలూ కనవస్తాయి. పూవు లేక తావి, వెలుగు లేక పొద్దూ వుండవు కదా!

అయినా స్వామి మహిమను శ్లాఘించటం ఒక తీరు, మాతృగరిమను కొండాడటం ఒక తీరును. దేని రుచి దానిది. స్తోత అభిరుచిని బట్టి యిది సాగుతుంది. ప్రప్రథమంగా సత్సంప్రదాయ స్తోత్రవాఙ్మయ నందనవనంలో శ్రీ వైభవ కల్పవల్లికను 'చతుఃశ్లోకి'గా నెలకొల్పిన మహోదారులు శ్రీయామున మునులు – తరువాతి వారికి ఆ కల్పవల్లిక కొనలు వేసి తీగలు పాకిననలు దొడిగి విరిజల్లులు కురిసి ఎదలలో పూలపందిళ్ళు నెలకొల్పుకోను తోడ్పడినది.

ఈ క్రమాన వెలసిన స్తుతి ప్రబంధాలు శ్రీ కూరేశ మిశ్రుల 'శ్రీస్తవం', శ్రీపరాశర భట్టారకుల 'శ్రీగుణరత్నకోశం' శ్రీమన్నిగమాంత దేశికుల 'శ్రీస్తుతి' వేంకటాధ్వరి 'లక్ష్మీసహస్ర'మూను.

అమ్మను పురుషకారంగా, లక్ష్మీనారాయణ మిథునాన్ని ప్రాప్యంగా, తన్మిథున కైంకర్యాన్నే స్పృహణీయంగా భావించి, భవతీ సంబంధ దృష్ట్యా హరింపశ్యేమ' ... అన్నట్లుగా తల్లితో తనయులాడిన ముద్దులొలుకు, కల్లకపటములకు తావులేని పలుకు కప్పురపు పెల్లలు. ఎదతమ్ముల జాలువారు ప్రణయరసకుల్యా మధుధారలు నింపిన రస కలశాలు. పురిటి పొత్తిళ్ళ పుప్పొళ్ళు పాదాఘుంతుదాలుగా, పరమ మృదుతా విస్రంభస్థానములుగా వాసిగాంచిన తల్లి చివురుపాదాలకు అవనేజన మొనగూర్పను తలపు వెన్నెల నీరునింపిన పసిడిగిండియలు. ఆజానులంబి వైజయంతీ ప్రస్పర్ధమానర్ధి హృద్యాన వద్య పద్య ప్రసూన మాలికలు ఈ స్తుతిప్రబంధములు.

అట్లా ఆ జగన్మాతకు శ్రీమన్నిగమాన్త మహాదేశికులు సమర్పించిన పద్యప్రసూన మాలిక ఈ శ్రీస్తుతి.

కవితార్కిక సింహులు శతాధిక గ్రంథకర్తలు 'సాహిత్యే సుకుమారవస్తుని దృఢన్యాయగ్రహ గ్రంథిలే తర్కేవామయి సంవిధాతరి సమం లోలాయతే భారతీ' – అన్న శ్రీ హర్షుని మాటవారిపట్ల అక్షర సత్యం. – శాస్త్రారణ్యానీ విహార వ్రతుల యీ పలుకుతొయ్యలికి మృదుశయ్యలు కూర్పగల మెత్తటి నిద్దపు తలపుల భావుక చూడామణులువారు.

స్తుతిసాహిత్య సరస్వతికి వారు పరికల్పించిన చామీకర శతపత్ర భద్రపీఠి 'దయాశతకం'. రంగనాథుని జగదేక పతిత్వానికి వారు పట్టిన వేయి వెలుగుల ముత్యాల వెల్లగొడుగు 'పాదుక'.

ఎంత లలిత భంగుల, మృదఫణితుల సుకుమార సరణుల వారు స్తుతులు నెరపినా వాటి లోతుపాతులు, సొగసులు, చమత్కృతులు, జాణతనములు అనుభవరసికులు తవ్వితలకెత్త వలసినదే కాని మనముగా చూరగొనలేము.

అందుకు సమర్థులయినవారి వ్యాఖ్యలే శరణ్యాలు. శ్రీస్తుతికే ఏమిటి దేశికుల స్తుతి ప్రబంధాలకన్నిటికీ వ్యాఖ్యలున్నా అవి చాలా వరకు సంస్కృతద్రావిడ భాషలలో ఉండటం వల్ల తెలుగులకు దేశిక ప్రబంధ రసాస్వాదనం కొంచెం దుర్లభంగా ఉంటుంది.

ఆ లోటును తీరుస్తూ మహావిద్వాంసులు, సంస్కృతాంధ్ర ద్రావిడ భాషలలో మంచి పట్టుగల వారు, చక్కని నుడికారపు పలుకు లల్లికల గడి దేరినవారు, ఉభయవేదాన్త సంప్రదాయ ప్రవర్తకాచార్య ప్రవరులూ అయిన శ్రీమాన్ కె.వి. రాఘవాచార్య స్వామివారు 'శ్రీస్తుతి'కి మెరుగులు చిమ్ము 'హిరణ్మయీ' వ్యాఖ్యను వెలయించినారు.

దేశికుల తలపుల నాడిని, పలుకుల వాడిని పట్టి చూచిన పరమభావుకులు వారు. వారి రమణీయమైన పాదుకా వ్యాఖ్య వ్యాఖ్యాతృలోకంలో హిమనగోత్తుంగంగా వారిని నిలిపినది.

అర్థతాత్పర్యాలు సమకూరుస్తూ లలిత విశదంగా, పర్యాప్త విపులంగా, ప్రమాణ పరిమండితంగా సరసమైన వ్యాఖ్యను శ్రీస్తుతికి ఘటించినారు శ్రీమాన్ రాఘవాచార్య స్వామివారు.

భగవచ్ఛాస్త్రాన్ని, వేదాన్తదర్శనాన్ని, పూర్వాచార్య శ్రీ సూక్తులను, దివ్యప్రబంధ వాఙ్మయాన్ని, పురాణ సంహితావ్రాతాన్ని పరామర్శిస్తూ దేశికులు భావించిన శ్రీ తత్త్వాన్ని పరమరమణీయంగా హృద్యానవద్యంగా పాఠకుల మనోవీధుల చిత్తరువులు గీసి నిలిపినారు

శ్రీ స్వామివారు. ప్రతిపదమూ రమణీయమే. ఒక్కొక్కచోట ఒక్కొక్క సొగసు. కాంతా, కమలా, అంబా శబ్దాల నిరుక్తిని నిపుణంగా ప్రదర్శించేరు.

'కుసుమధనుషః కింకరోమేరుధన్వా'

'తవప్రసాదాత్ కుసుమాయుధోఽపి" – అన్న కాళిదాస శ్లోకాన్ని స్మరింపజేసి దేశికుల ఉభయత్రధను శ్శబ్ద ప్రయోగస్వారస్యాన్ని శ్లాఘ్యంగా నిరూపించేరు.

'త్వామేవాహుః కతిచిదపరే త్వత్ప్రియంలోకనాథం' అన్న శ్లోకంలో ఉపనిషదంతరంగము శ్రీరామానుజాభిమతము సరసము, సంప్రదాయానుగతమూ అయిన మిథున ప్రాప్యత్వాన్ని, కైంకర్యాన్ని చక్కగా విశదీకరించినారు.

యామున, కూరనాథ, భట్టారక స్తుతుల క్రమాన శ్రీస్తుతిని సరసంగా అన్వయించి పూర్వాచార్యులతో దేశికులకు గల ఐకరస్యాన్ని మధురంగా నిరూపించినారు శ్రీమదాచార్యులవారు 'హిరణ్మయి'లో

గుణదోషాలున్నవున్నట్టు ప్రకటించుమని నన్నాదేశించినారు ఉ.వే. శ్రీమాన్ రాఘవాచార్యస్వామి వారు. ఉన్నదున్నట్టు వ్రాసే వాణ్ని నేను. దోషాలునాకు గోచరించలేదు.

అయితే ఒక్కమాట. ఇది దోషోద్ఘాటనం మట్టుకు కాదు. విద్వజ్జనులమ్రోల వినమ్రంగా విన్నవించుకొంటున్న నా అల్పజ్ఞతా విలాసవీచికగా ఒక విచికిత్స.

దేశికులు స్తోత్రారంభంలో 'వక్షః పీఠం మధువిజయినో భూషయంతీం స్వకాంత్యా' అంటారు. స్తుతి సమాప్తిలోనూ, 'సంపద్దివ్యా మధు విజయినః సన్నిధత్తాం సదామే' అంటారు.

ఉభయత్ర మధుహనన వృత్తాంతం ప్రస్తుతం. 'మధువిజయి' శబ్దాన్నే స్వీకరిస్తారు ఉభయత్ర. ఆద్యంతం మధుస్యంది స్తుతిగా ఇది సరసం, చమత్కృతి! మధు శబ్దం అహంకారద్యోతకం అని, అఖండగర్వ నిర్వాపణ నిపుణం జగత్కారణం అనీ తొలి శ్లోకం వ్యాఖ్యానంలో ప్రకటించినారు వ్యాఖ్యాతలు.

మధు విజయరహస్యంలో శ్రీసాహిత్యం ఎట్లాంటిదో దేశిక హృదయాభిజ్ఞులు అవతార తత్త్వవేదులు అయిన రసిక శిరోమణులు విశదీకరించాలని వేడికోలు.

సహృదయులకు గ్రైవేయకం కాగలదీ హిరణ్మయీ వ్యాఖ్య అని విశ్వసిస్తున్నాను.

ఇట్లు

విన్నవించు భాగవత విధేయుడు

28-02-2008 **శ్రీరామచంద్రాచార్య**




# సర్వవైదిక సంస్థానము

**SARVA VAIDIKA SAMSTHANAM**

(రి.నెం. 276)

కేంద్రకార్యాలయం : యజ్ఞవరాహక్షేత్రం, బొమ్మకిష్టన్నగర్, కరీంనగర్ - 505 001.

**CENTRAL OFFICE :**
Yagnavaraha Kshetram,
Bomma Kistanna Nagar,
Karimnagar - 505 001.
Phone : 49950

**ADDRASS :**
Sai Sandhya Apartments,
Flat No. 204, Himayathnagar,
Street No. (9), Hyderabad -29.
Phone : 7650181

**ఆచార్య శ్రీ భాష్యం విజయసారధి**
**కులపతి**


श्रीम

తేది 16.02.2008

# అక్షరోపద

వైదుష్యం జనతాప్రబోధనిరతం సౌజన్య బంధోజ్జ్వలం
వ్యాహారో వినయానపేతమధుర స్సంస్కారసారాయితః
ఉక్తిర్ ద్వాదశసూరిసూక్తి సుషమాసౌవస్తికీ [1]శ్రేయసీ
శ్రీమన్! రాఘవ! దేద్యుతీతి భవతో భాగ్యం కిమన్యద్భవేత్ ॥

సత్సమజ్ఞా సమారాధ్యా సమజ్యావైజయంతికా
హిరణ్మయీప్రియా వ్యాఖ్యా సమింధే రాఘవార్య! తే॥
"[1]భేద్యభేదక సార్థక్యం [2]వైశిష్ట్యం విషయస్యచ
[3]ఉపపాదన నైపుణ్యమ్ [4]ఉదాహృతి సమన్వయమ్ ॥

[5]హృద్యం పరమ మాకూతం మహాదేశిక మాస్తుతేః
[6]ప్రజ్ఞాం సర్వం కషాం ప్రాజ్యాం [7]వైదుషీం సర్వతోముఖీమ్॥

[8]వాక్యార్థ జ్ఞానసారళ్యం [9]విశేషార్థ వివేచనామ్
[10]భావకావర్జనీం శైలీం [11]పారార్థ్యార్థ పరిష్క్రియామ్

వివరీవర్తి [12]గంభీరా వ్యాఖ్యా తవహిరణ్మయీ"
రాఘవాచార్య! తత్త్వజ్ఞ! వ్యాఖ్యానచతురానన!॥

శ్రోత్రార్థ్వంతీ చణాగణ్యా పుణ్యశ్లోక శిఖామణే!
వేదాంత దేశిక గ్రంథ వ్యాఖ్యాలబ్ధయశోభర! ॥

---

[1]చ స్ఫిరా.

హిరణ్మయీ పదాంభోజ మకరందమధూకృతా
హిరణ్మయీ జయత్యేషా సూరే! రాఘవ! తావకీ ॥

విశిష్టోభయవేదాంత తత్త్వవిత్కృత లక్షణ!
నమోవాన్ ప్రశాశాస్తి తుభ్యం విజయసారథిః

భృంగీవానుకరోతి రాణ మఖిల ప్రాణిస్థితా యాపరా,
పశ్యంతీంగతి, మధ్యమా పరిణతాఽఽధారాది చక్రేష్వపి,
వర్ణస్థాన ముపేయుషీ సజనుషాంభోగాన్ సదా వైఖరీ
వాగ్ధేను ర్నిఖిలాన్ ప్రయచ్ఛతి మహాలక్ష్మీః ప్రసన్నాఽస్తుసా॥

[12]ద్వాదశలక్షణీలక్షితం వ్యాఖ్యానం భవతో భావకహృదయ మావర్జయతీతితాత్పర్యమ్.

ఉభయ వేదాన్త విద్వాన్ వ్యాఖాతృ శిరోమణి
**డా॥ఈ.ఏ. శింగరాచార్యస్వామివారు**
తిరుపతి.

# సువర్ణమాలిక

పరమవైదికసిద్ధాంతంగా అభిజ్ఞులచేత ప్రశంసింపబడే విశిష్టాద్వైత సిద్ధాంతంలో పరమాత్మఅఖిలహేయ ప్రత్యనీకుడు, అనంతజ్ఞానానందైక స్వరూపుడు, జ్ఞానశక్త్యాది కల్యాణగుణ భూషితుడు, సకలజగత్తుల సృష్టిస్థితి సంహారాలకు కర్త, చతుర్విధ పురుషార్థప్రదాత, విలక్షణవిగ్రహవిశిష్టుడు, లక్ష్మీభూ నీళానాయకుడు. ఈ సర్వేశ్వరుని స్తుతించడానికి ప్రారంభించిన వేదాలనుండి ఈనాటి కవులవరకు ఇంచుమించు అందరూ స్వామి స్తుతిలో భాగంగా దివ్యదేవేరులైన శ్రీభూనీళల స్తుతిని చేస్తున్నారు. పరమాత్మకు శేషభూతలు, విశేషణ స్థానీయలు అయిన దేవేరుల కీర్తనం సర్వశేషి, విశేష్యభూతుడు అయిన స్వామివైభవకీర్తనంలోకే చేరుతుంది తప్ప, **"స్వే మహిమ్ని ప్రతిష్ఠితః"** ఇత్యాదిగా కీర్తింపబడే పరమాత్మ వైభవానికి లోటు కల్గించదనే వాస్తవాన్ని శ్రీ పరాశభట్టర్ శ్రీగుణరత్నకోశంలోని **"స్వతః శ్రీః త్వమ్"** ఇత్యాది శ్లోకంలో రత్నకాంతి న్యాయంద్వారా తెలియజేశారు.

వేదంలోని **"అస్యేశానా జగతో విష్ణుపత్నీ" "హ్రీ శ్చ తే లక్ష్మీ శ్చ పత్న్యౌ"** ఇత్యాది సూక్తులలో శ్రీదేవి విష్ణుపత్నీత్వం, జగన్మాతృత్వం చెప్పబడ్డాయి. కఠవల్లీ గతం అయిన ద్వయంలోని పూర్వవాక్యంలో ఈ జగన్మాతృత్వం, ఉత్తరవాక్యంలో విష్ణుపత్నీత్వం సూచింపబడ్డాయి. శ్రీ పరాశరభట్టర్ సహస్రనామభాష్యంలో **"వేదేషు తావత్ శ్రీసూక్తమ్, శ్రద్ధాసూక్తమ్, మేధాసూక్తమ్, ఉత్తర నారాయణమ్, కౌషీతకీ ఇత్యాదౌ"** అని అంటూ వేదవాఙ్మయంలోగల లక్ష్మీవైభవప్రాచుర్యాన్ని తెలియజేశారు. వేదానికి ప్రతిరూపంగా చెప్పబడే శ్రీరామాయణం **"సీతాయా శ్చరితం మహత్"** అని, **"శ్రీమద్రామాయణ మపి పరం ప్రాణితి త్వచ్చరిత్రే"** అని చెప్పేరీతిలో లక్ష్మీవైభవప్రఖ్యాపకం. ఇందువల్లనే శ్రీపిళ్ళైలోకాచార్యులవారు శ్రీవచనభూషణ ప్రారంభంలో **"ఇతిహాస శ్రేష్ఠమాన శ్రీరామాయణత్తాల్ శిఱైయిరున్దవళ్ ఏత్తమ్**

**శొల్లుకిఅదు"** (ఇతిహాస శ్రేష్ఠం అయిన శ్రీరామాయణంచేత రావణుని చెఱలో ఉన్న సీతాదేవి వైభవం చెప్పబడింది) అని అనుగ్రహించారు. మహాభారతాంతర్గతం అయిన శ్రీ విష్ణుసహస్రనామస్తోత్రంలో **"శ్రీదః శ్రీశః, శ్రీనివాసః, శ్రీనిధిః, శ్రీవిభావనః, శ్రీధరః , శ్రీకరః, శ్రేయః శ్రీమాన్, లోకత్రయాశ్రయః, మాధవః, మధుసూదనః"** ఇత్యాదిగా పలు నామాలలో లక్ష్మీస్వరూపం, వైభవం ప్రస్తుతింపబడినవనే విషయాన్ని భగవద్గుణదర్పణంలో శ్రీ పరాశరభట్టర్ స్పష్టీకరించారు. పురాణరత్నం అయిన శ్రీ విష్ణుపురాణంలో **"నిత్యై వైషా జగన్మాతా విష్ణోః శ్రీ రనపాయినీ"** ఇత్యాదిగా పలుసందర్భాలలో అమ్మ జగన్మాతృత్వాదుల, స్వరూపరూపగుణాదుల కీర్తనం చేయబడింది. పాంచరాత్రశాస్త్రంలో కూడ **"లక్ష్మీ పురుషకారత్వే నిర్దిష్టా పరమర్షిభిః "** అంటూ లక్ష్మీ పురుషకారత్వం తెలుపబడింది. **"వైష్ణవస్మృతి ధర్మేషు చైతద్విషయ మశేషమ్"** అనే భగవద్గుణ దర్పణంలోని శ్రీపరాశరభట్టర్ సూక్తి స్మృతివాఙ్మయం కూడా లక్ష్మీవైభవాన్ని ప్రస్తావించిందని తెలుపుతున్నది.

దివ్యసూరుల దివ్యప్రబంధాల్లోకూడా లక్ష్మీవైభవం విరివిగా కనిపిస్తున్నది. **"మలర్ మకళ్ విరుమ్బుమ్ నమ్ అరుమ్ పెఱలడికళ్"** (తిరువాయ్ 1-3-1), **"తన్నొడుమ్ పిరివిలాద తిరుమకళ్"** (పెరియతిరు - 4-5-5) ఇత్యాది సూక్తుల్లో దివ్యదంపతుల స్వరూపావినాభావం, **"ఎన్ తిరుమకళ్ శేర్ మార్బనే"** (తిరువాయ్ - 7-2-9), **"తిరుమార్బినిల్ శేర్ తిరుమాలే"** (తిరువాయ్ -9-4-1) ఇత్యాదిగా రూపావినాభావం, **"మికుమ్ తిరుమాల్ శీర్ క్కడలై"** (పెరియతిరువన్దాది -69) అని ఇత్యాదిగా గుణాభివృద్ధి అంతర్భావం, **"తిరుమాల్ వైకున్దమ్"** (తిరువాయ్ 10-7-8) ఇత్యాదిగా విభూతి అంతర్భావం చెప్పబడ్డాయి. అట్లే, **"తిరుమాల్ క్కడల్"** (మూన్ఱామ్తిరు -20) ఇత్యాదిగా వ్యూహరూపంలో, **"శీమాదవన్ గోవిన్దన్"** ఇత్యాదిగా విభవరూపాల్లో, **"తిరుమాల్ వన్దు ఎన్ నెఞ్జు నిఱైయ ప్పుకున్దాన్"** (తిరువాయ్ 10-8-1) ఇత్యాదిగా అంతర్యామిరూపంలో, **"వేఙ్గడత్తెన్ తిరుమాల్"** (నాచ్చియార్ తిరు 8-10) ఇత్యాదిగా అర్చారూపంలో లక్ష్మీదేవికి భగవానునితో గల అవినాభావం, **"అల్లిమలర్ పోకమయక్కుక్కళాకియుమ్ నిఱ్కుమమ్మాన్ - ఎల్లాక్కరుమజ్ఙళుమ్ శెయ్"** (తిరువాయ్ - 3-10-8) ఇత్యాదిగా జగత్సృష్ట్యాది లీలలోని ఐకరస్యం చెప్పబడ్డాయి. ఇటువంటి లక్ష్మీవైభవాన్ని తెలిపే అనేక దివ్యప్రబంధ సూక్తులున్నాయి.

ఈవిధంగా శ్రుతి - స్మృతి - ఇతిహాస - పురాణాదులలో, దివ్యప్రబంధ సూక్తులలో విస్తృతంగా ప్రతిపాదింపబడ్డ లక్ష్మీవైభవాన్ని, తత్త్వాన్ని పూర్వాచార్యులు పలువురు తమస్తోత్రాలద్వారా మధురమైనరీతిలో మనకు అందించారు. వాటిలో శ్రీయామునుల కాంతాచతుఃశ్లోకి మొదటిది అని చెప్పవచ్చు. ఇదా చాలా చిన్నస్తోత్రం అయినా లక్ష్మీదేవి గరిమను సమగ్రంగా ప్రతిపాదిస్తున్నది. తరువాత పలువురి ఆచార్యులకు మార్గదర్శకం కూడా అయింది. ప్రత్యేకమైన స్తుతి కాకపోయినా, శరణాగతిగద్యప్రారంభంలో శ్రీరామానుజులు లక్ష్మీదేవిని శరణాగతి చేస్తూ పల్కిన **"భగవన్నారాయణాభిమతాను రూప..."** ఇత్యాది చూర్ణిక శ్రీవైభవాన్ని పూర్ణంగా తెలుపగల్గినది. కూరేశుల శ్రీస్తవం, పరాశర భట్టప్రణీతం అయిన శ్రీ గుణరత్నకోశం కూడా అటువంటి లక్ష్మీస్తుతులే.

శ్రీ పరాశర భట్టర్ శ్రీ గుణరత్న కోశంలోని **"స్వరూపం స్వాతంత్ర్యమ్"** (28), అనే శ్లోకంలో స్వరూపావినాభావ సంబంధాన్ని, **"అనుకల తనుకాండ"** (3) అనే శ్లోకంలో రూపసంబంధాన్ని, **"ప్రశకనబలైః"** (32) మొదలైన శ్లోకాలలో గుణావినాభావాన్ని, **"తత్రస్రక్ స్పర్శగంధమ్"** (25) అనేశ్లోకంలో విభూత్యంతర్భావాన్ని, **"యది మనుజతిరశ్చామ్"** (48) విభవాంతర్భావాన్ని, శ్రీరంగరాజస్తవంలో **"శ్రీస్తనాభరణం తేజః"** (1-8) అనే శ్లోకంలో అర్చాంతర్భావాన్ని, "అనుశిఖిని శిఖీవ" (2-44) ఇత్యాదిగా జగద్వ్యాపారంతర్భావాన్ని తెలిపారు.

పైన ప్రస్తావించిన వేదేతిహాసపురాణాది వాఙ్మయంలోను, దివ్యసూరుల సూక్తులలోను, పూర్వాచార్యస్తుతుల్లోను వినుతింపబడ్డ విష్ణుపత్నీ త్వం, జగన్మాతృత్వం, పురుషకారస్వరూపం, పరమాత్మకు ఈమె విషయంలోగల వాల్లభ్యం, సృష్టిస్థిత్యాదికార్యాలలో వీరిరువురి ఐకరస్యం, స్వరూపరూపగుణాలు, అవతారవైభవం - ఇత్యాదిగా అమ్మవైభవాన్ని తెలిపే అంశాలను అన్నిటినీ ఏర్చి కూర్చి శ్రీదేశికులురత్నాలవంటి 24 శ్లోకాలతో శ్రీస్తుతిని అనుగ్రహించారు. (ఈ వివరాలను అన్నిటినీ హిరణ్మయీవ్యాఖ్యలో అభిజ్ఞులూ, సాహిత్య మర్మజ్ఞులూ అయిన శ్రీవ్యాఖ్యాతృస్వామివారు తెలియజేశారు). ఈ స్తుతిలో శ్రీదేశికులు చూపిన చమత్కారాలు, సంప్రదాయరహస్యాలు, అలంకారాది విశేషాలు సహృదయహృదయైక వేద్యాలు, రసఘనాలూను. విస్తరభీతివల్ల ఒక్క విషయాన్ని మాత్రం ప్రస్తావిస్తాను.

శ్రీ స్తుతిని శ్రీదేశికులు ఆరంభిస్తూ **"వక్షః పీఠీం మధువిజయినో భూషయంతీ స్వకాంత్యా"** అని మధుసూదన వృత్తాంతాన్ని ప్రస్తావించారు. ఈ రీతిలోనే ముగింపులో కూడా **"సంపద్దివ్యా మధు విజయినో సంనిధత్తాం సదా మే"** అని అంటూ ఇదే వృత్తాంతాన్ని మళ్ళీ స్మరించారు. ఈ విధంగా స్తుతి ఆద్యంతాలలో దివ్యదంపతుల నిత్యయోగాన్ని మధు మథన వృత్తాంతో కలిపి కీర్తించడం ఏదో ఒక రహస్యాన్ని సూచించడం కోసమే అయి ఉంటుందనే అభిప్రాయం సాహిత్యమర్మవేత్తలయిన పెద్దలకు కలుగక పోదు. నాకు తోచిన సమాధానాన్ని విన్నవిస్తాను. ఇందులోని గుణదోషాలను విజ్ఞులు నిర్ణయిస్తారు.

శ్రీ విష్ణు సహస్ర నామంలో **"మాధవో మధుసూదనః"** అని లక్ష్మీపతిత్వాన్ని తెలిపే మాధవ నామం తరువాత మధుసూదన నామం అనుసంధింపబడుతున్నది. శ్రీపరాశర భట్టర్ మధుసూధన నామాన్ని **"సర్వనిర్వాహకత్వాత్, అసురనిరసనాదినా నిష్ప్రతిపక్షలక్ష్మీకత్వాచ్చ మధుసూదనః"** అని వ్యాఖ్యానించారు. దీనినిబట్టి సకలజగత్తులను నిర్వహించడంవల్ల, దుష్టులైన అసురులను నిర్మూలించడం వల్ల ఈనామం స్వామికి వచ్చిందని తెలుస్తున్నది. తమోగుణానికి ప్రతీకలైన అసురుల నిరసనం విరోధినిరసనానికి చిహ్నం. రక్షణ క్రియాంతర్గతం. అందువల్ల మధుసూదననామం విరోధినిరసనాన్ని చెబుతున్నది. పరమాత్మ చేసే విరోధినిరసనం వాత్సల్యకారుణ్యాది గుణప్రయుక్తం. స్వామికి ఈ గుణాలు సహజంగా ఉన్నా, అతడు హితపరుడు కనుక, నిరంకుశస్వతంత్రుడు కనుక, అనాదిగా జీవుడు చేసే ప్రబలపాప సంచయాన్ని చూచి **"క్షిపామి, న క్షమామి"** అని అన్నప్పుడు అవి మఱుగుపడిపోతాయి. అపుడు వాటిని శ్రీదేవి తన పురుషకారంద్వారా తల ఎత్తేటట్లుచేసి, జీవుని స్వామి రక్షించేటట్లుగా చేస్తుంది. కాబట్టి విరోధినిరసనం లక్ష్మీపురుషకారసాపేక్షం. ఈ పురుషకారం లక్ష్మీనిత్యయోగప్రయుక్తం. ఈ రీతిలో విరోధి నిరసనకు ప్రతీక అయిన మధుసూధన వృత్తాంతానికి, పురుషకారానికి మూలం అయిన లక్ష్మీనిత్యయోగానికి మధ్యగల ఘనిష్ఠమైన సంబంధం స్పష్టం. వాత్సల్యదయాక్షమాది గుణాలు స్వామి హృదయ గతాలు కనుక వాటిని ఉద్బుద్ధం చేసే పురుషకారస్వరూపిణి అయిన అమ్మనుగూర్చి శ్రీదేశికులు చమత్కారంగా **"వక్షఃపీఠీం మధువిజయినో భూషయంతీ స్వకాంత్యా"** అని ప్రయోగించి ఉండవచ్చు.

ఈ విధంగా పలురీతుల్లో విశిష్టమైన ఈ స్తుతికి సంస్కృతంలో, ద్రావిడంలో వ్యాఖలున్నా తెలుగులో ఇంతవరకు సరి అయిన, సమగ్రమైన వ్యాఖ్యానం వెలువడలేదు అనే లోటును చూచిన విద్వత్తల్లజులు, వ్యాఖ్యాతృచక్రవర్తులు, మహోదారులు, విశేషించి నా విషయంలో అవ్యాజకృపాపూర్ణులు అయిన **వాచస్పతి, ఉ.వే. శ్రీమాన్ కె.వి.రాఘవాచార్య స్వామివారు** పలు వ్యాఖ్యాలను పరామర్శించి, ఎంతో శ్రమించి విస్తృతమైన, సమగ్రమైన, సార్థకమైన **"హిరణ్మయీవ్యాఖ్య"** ను సంతరించడం ఆంధ్రపాఠకలోకం చేసికొన్న అదృష్టఫలం. ఈ వ్యాఖ్యలోని ప్రత్యక్షరం సువర్ణమే. **"సువర్ణజతస్రజామ్"** అని వేదపురుషునిచేత కీర్తింపబడే అమ్మకు తాము కూడ ఒక సువర్ణమాలను సమర్పించిన శ్రీ స్వామివారు ధన్యధన్యులు. ఈ గ్రంథాన్నిగూర్చి విన్నవించవలసినదనే వారి ఆజ్ఞను కాదనలేకమాత్రమే ఈ సాహసాన్ని చేశాను. పండిత ప్రకాండులచే ప్రశంసింపబడ్డ శ్రీస్వామివారి వ్యాఖ్యాన వైభవం ఇతః పూర్వమే పాదుకాసహస్రం, యతిరాజసప్తతివంటి గ్రంథాల వ్యాఖ్యానాలద్వారా సహృదయ పాఠకలోకానికి సుపరిచితం. ఇపుడీ హిరణ్మయీ వ్యాఖ్య వాటికి ఏమాత్రం తీసిపోనిది – అనడం ప్రత్యక్షరసత్యం. శ్రీమాన్ స్వామివారు రాష్ట్రియవిద్యాపీఠం, తిరుపతి నుండి **"వాచస్పతి"** బిరుదాన్ని అందుకొనే ఈ శుభతరణంలో వారికి దాసుడు హృదయపూర్వక శుభాకాంక్షలను సమర్పించుకొంటున్నాడు. వీరి లేఖిని నుండి త్వరలో దయాశతకానికి ఒక మధురవ్యాఖ్య వెలువడబోవడం అత్యంతం హర్షదాయకం. ఇదేరీతిలో వీరు **"పశ్యేమ శరద శ్శతమ్"** అనేరీతిలో చిరకాలం ఆయురారోగ్యాలతో **"పల్లాణ్డు పల్లాణ్డు"** గా వేంచేసి ఉండి, ఇంకా పలు గ్రంథాలకు రుచిర వ్యాఖ్యలను అనుగ్రహించాలని, ఆవిధంగా వీరిని శ్రీనివాసప్రభువు కటాక్షించాలని ప్రార్థిస్తూ, వాచికకైంకర్యాన్ని చేసికొనే ఈ గొప్ప అవకాశాన్ని నాకు ప్రసాదించిన శ్రీస్వామివారి సన్నిధిలో కార్తజ్ఞ్యసమర్పణను చేసికొంటూ విరమిస్తున్నాను.

**వ్యాఖ్యా హిరణ్మయీ శ్రీమద్రాఘవార్యవినిర్మితా ।**
**రాజతాం రుచిరార్థేయం రసజ్ఞహృదయే సదా ॥**

ఇట్లు

తిరుపతి, భాగవత నియోజ్యుడు

14-3-08 **ఈ.ఏ. శింగరాచార్యులు**

# విజ్ఞప్తి

జయంతి జగతాం పత్యుః జగద్రక్షణదీక్షితాః ।
మూర్తా ఇవదయా పూరా అస్మదాచార్య పంక్తయః ॥
నిషద్యావిద్యానాం నిఖిలకుమతివ్యాళ గరుడః
సభాసౌభాగ్యానాం సరసకవితా పద్మసవితా ।
ప్రమాణం భాష్యస్య ప్రపదనకళా జన్మజలధిః
**కరోతు క్షేమం నః కవికథక కంఠీరవ గురుః ॥**

నాథోపజ్ఞవృత్తమై యామునేయ ప్రబంధాలచే అభివర్ధితమై, యతి పురందరులైన భగవద్భాష్యకారులచే రక్షితమై, శ్రీ వేంకటేశ్వర ఘంటావతారులైన వేదాన్త దేశికులచే ప్రతిష్ఠాపితమైన విశిష్టాద్వైత వేదాన్తమందు లబ్ధజన్ములై అప్రతిమ ప్రతిభాశాలురైన అనేకాచార్యవర్యులు తమ తమ ధిషణానుసారంగా భగవద్గుణ గణాలను అనుభవించి, అమందానందతుందిలమైన తమ పవిత్ర వాక్కుచే కీర్తించిన విషయమే స్తోత్రమని విజ్ఞుల మాట.

గుణినిష్ఠగుణకీర్తనమే స్తోత్రం కదా!

భగవద్గుణగణమహోదధియందు నిమగ్నులైన ఆచార్యులలో శతాధిక గ్రంథకర్తలైన శ్రీమన్నిగమాంత మహాదేశికులకు అనుపమస్థానమున్నదనడానికి వారు రచించిన 29 స్తోత్రాలే ప్రమాణాలు. అందులో శ్రీలక్ష్మీదేవియొక్క స్వరూప రూపగుణ విభూతులను దెలిపే శ్రీస్తుతి ఒకటి.

విశ్వోపజీవ్యాలైన వేదాన్త దేశికుల స్తోత్రగ్రంథాలు స్తోత్రాలుగానే కాక అవి తత్త్వ నిర్ణాయకాలైన శాస్త్ర గ్రంథాలుగానూ ప్రకాశిస్తున్నాయి. లక్ష్మీదేవి ధనధాన్యాది సకల సంపదలకు అధిష్ఠాత్రియైన దేవత. ఆమె విష్ణుపత్ని. విష్ణుభగవానుడు లక్ష్మీపతి. లక్ష్మీనారాయణుల మహిమ వర్ణనాతీతం. అయినా, ఋషులూ, ఆళ్వార్లూ, ఆచార్యులూ యథాశక్తి వర్ణించక ఉండలేకపోయారు. శ్రీ శ్రియఃపతులు సృష్టికారకులుగా దివ్యదంపతులు, రక్షకులుగా శరణ్య దంపతులు. పాలకులుగా శేషిదంపతులు.

లక్ష్మీదేవి మూడు రూపాలుగా పూజింపబడుతుంది.

1. **కామ్యార్చారూపం :** ఆలయాలలో ప్రత్యేక స్థానమందు ప్రతిష్ఠింపబడిన దేవ్యాలయమందు భక్తులచే పూజింపబడుతూ, వారు కోరే ఐహికాముష్మిక సంపదలను ప్రసాదిస్తుంది.

2. **భోగార్చారూపం :** దేవాలయమందు భగవానుని ప్రక్కనే వెలసి జగద్రక్షణార్థం వ్యవహరిస్తుంది.

3. **లయార్చారూపం :** లక్ష్మీదేవి భగవానుని వక్షఃస్థలమందు కుడి ప్రక్కన వెలసి సర్వదా భగవానుడు జీవులపట్ల వారుచేసిన అపరాధాలను చూడకుండునట్లును, క్షమను కలిగియుండునట్లను చేస్తుంది. శ్రియఃపతి లాగా శ్రీదేవి కూడా సర్వవ్యాపిని, సర్వశక్తిమతి, సర్వనియంత్రి. భగవానుని అవతారాలలో ఆయనకు అనుకూలమైన రూపాలతో అవతరించి నిత్యాన పాయినిగా ఉంటుంది.

భగవన్నారాయణుడు లోకేశ్వరుడైతే భగవతి లక్ష్మీదేవి లోకేశ్వరి అని ఈ స్తోత్రం విశదపరుస్తుంది. ఒకే ప్రపంచానికి ఇద్దరీశ్వరులుంటే వారిద్దరిలో అభిప్రాయ భేదాలు కలుగుతాయికదా! అనే శంకను పరిహారంచేస్తూ, ఒకరిని విడిచి ఒకరు ఉండలేని దివ్య దాంపత్యమది. ఈ దివ్య దంపతియే మనకు శరణ్యమని, దైవతమని నిరూపించిన విషయాన్ని సహృదయులైన పాఠకులు గమనించగలరు. సృష్టిస్థితిలయ కారకులైన లక్ష్మీనారాయణుల దివ్యదాంపత్యం అసాధారణమైనదని, శ్రీతత్త్వాన్ని నిష్కృష్టంగా తెలుపుతుంది. ఈ 'శ్రీస్తుతి'.

'శ్రీస్తుతి' కావ్యంలో 25 శ్లోకాలున్నాయి. మొదట శ్రీదేవి స్వరూప వర్ణన ముంది 10 శ్లోకాలలో. శ్లో. 11 నుండి 14 వరకు దేవీ దివ్య మంగళ విగ్రహవర్ణనం, 15 నుంచి 19 వరకు చతుర్విధ పురుషార్థ ప్రదత్వం, 20 నుంచి 24 వరకు శరణాగత్యనుష్ఠానం. 25వ శ్లోకంలో 'ఫలశ్రుతి' ఉంది. శ్రీస్తుతిలోని మధ్య శ్లోకమందు (అగ్రే భర్తుః-13) శ్రీదేవి యొక్క పట్టాభిషేకం వర్ణితం. ఇలాగా ఈ కృతిలో అనేక విషయాలు ప్రతిపాదితాలు.

ఈ స్తోత్రం శ్రీరంగంలో రచింపబడినదని కొందఱు, కాంచీనగరమందు రచింపబడినదని కొందఱు అంటారు. దేశికులు కాంచీనగరమందు నివసించి

యున్నప్పుడు ఇతరుల ప్రేరణవల్ల ఒక విప్రవటువు దేశికుల సన్నిధికి వచ్చి తన వివాహ శుభకార్యం కోసం కావలసిన ద్రవ్యమిమ్మని ప్రార్థించగా, ఆ స్వామి శ్రీదేవిని స్తుతించారు. ప్రసన్నురాలైన శ్రీదేవి (16వ శ్లోకంలో) కనకవర్షాన్ని కురిపించిందని, ఆ బంగారాన్ని అట్లే దేశికులు ఆ బ్రహ్మచారికి ఇచ్చారని, ఈ స్తోత్రనిర్మాణానికి కారణమైన ఒక ఐతిహ్యముంది. దీనివల్ల ఈ స్తోత్రానికి 'కనకధారా స్తోత్ర' మని కూడా పేరు ఉన్నదని పెద్దలు చెబుతారు. ప్రతిదినం శ్రీ స్తుతిని పారాయణం చేసే భక్తులకు సకల సంపదలు కలుగుతాయి.

దేశికుల 'శ్రీస్తుతి'కి సంస్కృత వ్యాఖ్యానాలేవైనా లభించే అవకాశామున్నదా స్వామీ! అని (ఫోనుద్వారా) వేడుకను విన్నవించుకొన్నాను. అంతే అస్మచ్ఛ్రేయోభిలాషులూ, బహుగ్రంథ కర్తలై లోకోపకారులూ అయిన ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి ఆళగియ శింగరాచార్యస్వామి వారు ఆలసించక శ్రీమదాండవన్‌పౌండరీకపురం స్వామి ఆశ్రమం, శ్రీరంగం' వారు రెండు సంస్కృత వ్యాఖ్యలతోపాటు ముద్రించిన 'శ్రీస్తుతి' గ్రంథాన్ని కృపతో అందించారు.

ఆ సంస్కృత వ్యాఖ్యలను తెలుగు లిపిలో ముద్రించే అనుమతిని ప్రసాదించ వలసినదని (జనవరి 2008 మొదటి వారంలో) ఆండవనాశ్రమానికి వినతి పత్రం పంపబడినది. నేటికీ అనుమతి రాలేదు. మౌనమంగీకార సూచకమే కదా! పూర్వాచార్యుల కృతులు, వ్యాఖ్యలు అందరికీ తెలియడం అత్యావశ్యకమే కదా!

ఈ రెండు వ్యాఖ్యానాలలో ఒకటైన శ్రీమాన్ ఆత్రేయ వరదాచార్య నిర్మిత సంస్కృత వ్యాఖ్యతో ప్రకాశింపజేసిన 'శ్రీస్తుతి' గ్రంథాన్ని (రాష్ట్రియ సంస్కృత విద్యాపీఠ గ్రంథమాల – 97) ఆచార్య కా.ఇ. గోవిందన్, తిరుపతి) స్వామివారు కృపచేశారు.

ఇపుడు తెలుగు భాషలో 'హిరణ్మయీ' వ్యాఖ్యతోపాటు అనుబంధంగా తెలుగు లిపిలో శ్రీ ఆ. వరదాచార్యుల సంస్కృత వ్యాఖ్యలతో, శ్రీ అ.వే.గోపాలాచార్య ప్రణీత సంస్కృత వ్యాఖ్యతోనూ ఈ 'శ్రీస్తుతి' ముద్రింపబడియున్నది. ఈ రెండు వ్యాఖ్యలనూ తెలుగు లిపిలో ముద్రించే అవకాశం కల్పించిన శ్రీమదాండవన్ పౌండరీక పురం స్వామి ఆశ్రమం (శ్రీరంగం) వారికి, నా హార్థిక కృతజ్ఞతలను తెల్పుకొంటున్నాను. ప్రత్యేకంగా శ్రీమాన్ ప్రొఫెసర్ కా.ఇ. గోవిందన్ మహోదయులకు

ధన్యవాదాలర్పిస్తున్నాను.

భగవద్భాగవత కైంకర్య నిష్ఠులైన శ్రీయుత మాదాడి కృష్ణారెడ్డి, సులోచనా దంపతులు కీ.శే. మాదాడి జగన్మోహన రెడ్డి గారి స్మృత్యర్థం తమ పవిత్ర ధనాన్ని సాదరంగా సమర్పించి 'శ్రీస్తుతి' గ్రంథాన్ని ప్రకాశింపజేశారు.

శ్రీ సులోచనా కృష్ణారెడ్డి దంపతులకు అనేక మంగళాశాసనాలు. శ్రీ మాదాడి జగన్మోహన రెడ్డి కుటుంబ సభ్యులందరికి తిరుమల శ్రీనివాస భగవానుడు సకల శ్రేయస్సులను కలిగించాలని స్వామి సన్నిధిలో ప్రార్థిస్తున్నాను.

దాసుని ప్రార్థనను వాత్సల్యంతో అంగీకరించి అమూల్యమైన మంగళా శాసనాలను ప్రసాదించిన పరమహంస పరివ్రాజకాచార్య, త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి సన్నిధిలో సప్రశ్రయ ప్రణామాల నర్పిస్తున్నాను. కోరినదే తడవుగా ఈ కృతిని 'గ్రైవేయకం'తో అలంకరించిన పండిత పుండరీకులు ఉ.వే.ప్ర శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్యస్వామి వారి సన్నిధిలో సప్రశ్రయ కార్తజ్ఞ్యాన్ని సమర్పించుకొంటున్నాను.

ఈ 'శ్రీస్తుతి'ని 'అక్షరోపద'తో సముచితంగా అర్చించిన విద్వత్కవులూ, పాండిత్య పాథోనిధులూ అయిన ఆచార్య శ్రీభాష్యం విజయసారథి, కులపతిగారికి, సర్వ విధాలా ప్రోత్సహిస్తూ, నా ప్రతి ప్రయత్నానికి తగు సూచనలిస్తూ, ఈ కృతిని 'సువర్ణమాలిక'తో భూషించిన విద్వద్వేరేణ్యులు డా॥ ఈ.ఏ. శింగరాచార్య స్వామి (తిరుపతి) వారికి – మనఃపూర్వక నమస్సుమాంజలుల నర్పిస్తున్నాను. అన్నివిధాలా నాకు తోడ్పడుతున్న సహృద్వరులకూ, తమ్ములకూ, తనయులకూ ఆయురారోగ్య సంపదలు కలుగాలని మంగళాశాసనాలు, అనుకొన్నంత తొందరలోనూ, ఈ కృతిని అందంగా ముద్రించి ఇచ్చిన శ్రీ వాగ్దేవి ప్రింటర్స్ అధినేతలు శ్రీ పి. వాసుదేవరావు, శ్రీధర్‌రావు సోదరులకు హార్దిక ధన్యవాదాలు.

"సంతఃక్షమన్తు దోషాన్"

భగవద్భాగవత చరణత్రాణరేణువు

23 మార్చి 2008 **కె.వి. రాఘవాచార్యులు**

1. మానాతీత ప్రథిత విభవాం మంగళం మంగళానాం
వక్షఃపీఠీం మధువిజయినో భూషయన్తీం స్వకాన్త్యా ।
ప్రత్యక్షా సుశ్రవిక మహిమ ప్రార్థినీనాం ప్రజానాం
శ్రేయోమూర్తిం శ్రియ మశరణస్త్వాంశరణ్యాం ప్రపద్యే॥

2. ఆవిర్భావః కలశ జలధా వధ్వరేవాఽ పి యస్యాః
స్థానం యస్యాః సరసిజవనం విష్ణు వక్షః స్థలంవా ।
భూమాయస్యా భువనమఖిలం దేవి! దివ్యం పదంవా
స్తోక ప్రజ్ఞై రనవధి గుణాస్త్వాయ సేపాకథంత్వమ్ ॥

3. స్తోతవ్యత్వం దిశతి భవతీ దేహిభిఃస్తూయమానా
తామేవత్వా మనితరగతిః స్తోతుమాశంసమానః
సిద్ధారంభః సకలభువవ శ్లాఘనీయో భవేయం
సేవాపేక్షా తవచరణయోః శ్రేయసే కస్యనస్యాత్ ॥

4. యత్సంకల్పాద్భవతి కమలే! యత్ర దేహిన్యమీషాం
జన్మ స్థేమప్రళయ రచనా జంగమా జంగమానామ్ ।
తత్కల్యాణం కి మపి యమినా మేక లక్ష్యం సమాధౌ
పూర్ణం తేజః స్ఫురతి భవతీ పాదలాక్షారసాంకమ్ ॥

5. నిష్ప్రత్యూహ ప్రణయ ఘటితం దేవి! నిత్యానపాయం
విష్ణుస్త్వం చేత్యనవధిగుణం ద్వంద్వ మన్యోన్య లక్ష్యమ్ ।
శేషశ్చిత్తం విమల మనసాం మౌళయశ్చ శ్రుతీనాం
సంపద్యంతే విహరణ విధౌ యస్యశయ్యా విశేషాః ॥

6. ఉద్దేశ్యత్వం జనని! భవతోరుజ్జితోపాధి గంధం
ప్రత్యగ్రూపే హవిషి యువయోరేక శేషిత్వ యోగాత్ ।
పద్మే! పత్యుస్తవచ నిగమైర్నిత్యమన్విష్య మాణో
నా వచ్ఛేదం భజతి మహిమానర్తయన్మానసం నః॥

7. పశ్యంతీషు శ్రుతిషు పరితః సూరిబృన్దేనసార్థం
మధ్యేకృత్య త్రిగుణఫలకం నిర్మితస్థాన భేదమ్ ।
విశ్వాధీశప్రణయిని! సదా విభ్రమద్యూత వృత్తౌ
బ్రహ్మేశాద్యా దధతియువయో రక్షశార ప్రచారమ్ ॥

8. అస్యేశానా త్వమసిజగతః సంశ్రయన్తీ ముకుందం
లక్ష్మీః పద్మా జలధి తనయా విష్ణుపత్నీందిరేతి ।
యన్నామాని శ్రుతి పరిపణాన్యేవ మా వర్తయంతో
నా వర్తంతే దురిత పవన ప్రేరితే జన్మ చక్రే ॥

9. త్వామే వాహుః కతిచిదపరేత్వత్ప్రియం లోకనాథం
కింతైరన్తః కలహమలినైః కించిదుత్తీర్య మగ్నైః
త్వత్సం ప్రీత్యై విహరతి హరౌసమ్ముఖీనాం శ్రుతీనాం
భావా రూఢౌ భగవతి! యువాందైవతం దంపతీ నః॥

10. ఆపన్నార్తి ప్రశమాన విధౌబద్ధ దీక్షస్య విష్ణోః
ఆచఖ్యుస్త్వాం ప్రియసహచరీమైక మత్యోపపన్నామ్
ప్రాదుర్భావైరపి సమతనుః ప్రాధ్వమన్వీయ సేత్వం
దూరోత్క్షిప్తైరివ మధురతా దుగ్ధరాశేస్తరంగైః ॥

11. ధత్తేశోభాం హరిమరతకే తావకీ మూర్తిరాద్యా,
తన్వీతుంగస్తన భరనతా తప్త జాంబూనదాభా ।
యస్యాంగచ్ఛంత్యుదయ విలయైర్నిత్యమానందసింధా
విచ్ఛా వేగోల్లసితలహరీ విభ్రమం వ్యక్తయస్తే ॥

12. ఆసంసారం వితత మఖిలం వాఙ్మయం యద్విభూతిః,
యద్భ్రూ భంగాత్కు సుమధనుషః కింకరోమేరుధన్వా ।
యస్యాం నిత్యం నయన శతకై రేకలక్ష్యో మహేంద్రః
పద్మే! తాసాం పరిణతిరసౌభావలేశై స్త్వదీయైః ॥

13. అగ్రేభర్తుః సరసిజమయే భద్రపీఠే నిషణ్ణా,
మంభోరాశేరధిగత సుధా సంప్లవా దుత్థితాం త్వామ్ ।
పుష్పాసారస్థగిత భువనైః పుష్కలావర్తకాద్యైః
క్లుప్తారంభాః కనకకలశైరభ్యషించన్ గజేన్ద్రాః ॥

14. ఆలోక్యత్వామమృత సహజే! విష్ణు వక్షః స్థలస్థాం,
శాపాక్రాన్తాః శరణమగమన్ సావరోధాస్సురేన్ద్రాః ।
లబ్ధ్వా భూయస్త్రి భువనమిదం లక్షితం త్వత్కటాక్షైః
సర్వాకార స్థిర సముదయాం సంపదం నిర్విశంతి ॥

15. ఆర్తత్రాణ వ్రతిభిరమృతా సారనీలాంబువాహైః
అంభోజానాముషసిమిషతామంతరంగైరపాఙ్గైః ।
యస్యాం యస్యాం దిశి విహరతే దేవి! దృష్టిస్త్వదీయా
తస్యాం తస్యామహమహమికాంతన్వతే సంపదోఘాః ॥

16. యోగారం భత్వరిత మనసోయుష్మదైకాంత్యయుక్తం,
ధర్మం ప్రాప్తుం ప్రథమ మిహయే ధారయంతే ధనాయామ్ ।
తేషాం భూమేర్ధన పతి గృహాదంబరాదంబుధేర్వా,
ధారానిర్యాంత్యధిక మధికం వాంఛితానాం వసూనామ్ ॥

17. శ్రేయస్కామాః కమలనిలయే! చిత్రమామ్నాయ వాచాం
చూడాపీడం తవ పదయుగంచేత సాధారయంతః ।
ఛత్రచ్ఛాయా సుభగశిరసశ్చామర స్మేర పార్శ్వాః
శ్లాఘాశబ్ద శ్రవణ ముదితాఃస్రగ్విణ స్సంచరంతి ॥

18. ఊరీకర్తుం కుశలమఖిలం జేతుమాదీనరాతీన్
దూరీకర్తుం దురితనివహంత్యక్తు మాద్యామవిద్యామ్ ।
అంబ! స్తంబావధిక జననగ్రామ సీమాంత రేఖాం
ఆలంబంతే విమలమనసో విష్ణుకాంతే దయాంతే ॥

19. జాతా కాంక్షా జనని! యువయోరేక సేవాధికారే
మాయాలీఢం విభవ మఖిలంమన్య మానా స్తృణాయ ।
ప్రీత్యై విష్ణో స్తవచ కృతినః ప్రీతిమంతో భజంతే
వేలాభంగ ప్రశమన ఫలం వైదికం ధర్మ సేతుమ్ ॥

20. సేవే దేవి! త్రిదశ మహిళా మౌళిమాలార్చితంతే
సిద్ధిక్షేత్రం శమితవిపదాం సంపదాం పాద పద్మమ్ ।
యస్మిన్నీషన్న మిత శిరసో యాపయిత్వా శరీరం
వర్తిష్యంతే వితమసి పదే వాసుదేవస్య ధన్యాః ॥

21. సానుప్రాస ప్రకటితదయైః సాంద్రవాత్సల్య దిగ్ధైః
అంబ! స్నిగ్ధైరమృతలహరీ లబ్ధ సబ్రహ్మచర్యైః ।
ఘర్మే తాపత్రయ విరచితే గాఢ తప్తం క్షణంమాం
ఆకించన్యగ్లపిత మనఘైర్నాయేథాః కటాక్షైః ॥

22. సంపద్యంతే భవభయతమీ భానవస్త్వత్ప్రసాదాత్
భావాః సర్వే భగవతి హరౌభక్తి ముద్వేలయన్తః ।
యాచేకిం త్వామహ మిహయంతః శీతలోదారశీలా,
భూయోభూయో దిశసి మహతాం మంగళానాం ప్రబంధాన్ ॥

23. మాతాదేవి! త్వమసి, భగవాన్వాసుదేవః పితామే ।
జాతఃసోహం జనని! యువయోరేక లక్ష్యం దయాయాః ।
దత్తోయుష్మత్పరి జనతయా దేశికైరప్యతస్త్వం
కింతే భూయః ప్రియమితికిల స్మేరవక్త్రా విభాసి ॥

24. కల్యాణానా మవికలనిధిః కాఽపి కారుణ్య సీమా
నిత్యామోదా నిగమవచసాం మౌళిమందారమాలా
సంపద్దివ్యా మధు విజయినః సన్నిధత్తాం సదామే
సైషా దేవీ సకలభువవ ప్రార్థనా కామధేనుః ॥

25. ఉపచిత గురుభక్తే రుత్థితం వేంకటేశాత్
కలి కలుష నివృత్త్యై కల్ప్యమానం ప్రజానామ్ ।
సరసిజ నిలయాయాః స్తోత్రమే తత్ పఠంతః
సకల కుశల సీమాస్సార్వభౌమా భవంతి ॥

శ్రీశో౽వ్యాత్
శ్రియై నమః
శ్రీ రంగనాథ పర బ్రహ్మణే నమః
శ్రీమన్నిగమాన్త మహా దేశికాయనమః

## శ్రీమద్వేదాన్త దేశిక ప్రణీతా

# శ్రీ స్తుతిః

శ్రీమాన్ వేంకట నాథార్యః కవితార్కిక కేసరీ ।
వేదాన్తాచార్య వర్యోమే సన్నిధత్తాం సదాహృది ॥

1. మానాతీత ప్రథిత విభవాం మంగళం మంగళానాం
వక్షఃపీఠీం మధువిజయినో భూషయన్తీం స్వకాన్త్యా ।
ప్రత్యక్షా నుశ్రవిక మహిమ ప్రార్థినీనాం ప్రజానాం
శ్రేయోమూర్తిం శ్రియ మశరణస్త్వాంశరణ్యాం ప్రపద్యే ॥

**అర్థం** :- మానాతీత ప్రథిత విభవాం । మాన = ప్రమాణానికి; అతీత = మించిన; ప్రథిత = ప్రసిద్ధమైన; విభవాం = మహిమ కలిగినట్టి; మంగళానాం= శుభకర వస్తువులన్నిటికి; మంగళం = మంగళమైనట్టి; మధు విజయినః = మధుసూదనుడైన భగవానుని యొక్క; వక్షః పీఠీం = వక్షః స్థలాన్ని; స్వకాంత్యా = తన కాంతిచేత; భూషయంతీం = ప్రకాశింపజేయునట్టి, అలకరించునట్టి; ప్రత్యక్షా నుశ్రవిక మహిమ ప్రార్థినీనాం । ప్రత్యక్ష = లోకమందు కనబడే; ఆనుశ్రవిక = వేద ప్రమాణ సిద్ధమైన; మహిమ = గొప్పదనాన్ని; ప్రార్థినీనాం = ప్రార్థించే; ప్రజానాం = ప్రజలకు; శ్రేయస్+మూర్తిం = శ్రేయస్స్వరూపిణియైన; శరణ్యాం = రక్షించడానికి యోగ్యమైన; శ్రియం = ఆశ్రితులకు ఆరు విధాలుగా ఉపకరించే 'శ్రీ' అనే నామధేయం కలిగిన; త్వాం = నిన్ను; అశరణః = వేరేగతి - రక్షణ - లేనివాడనై; ప్రపద్యే = శరణు పొందుతున్నాను.

**తా॥** ఓ శ్రీ మహాలక్ష్మీ! ఎల్లలేని, ఎన్నరాని నీ మహిమ లోక ప్రసిద్ధమైనది. ప్రపంచంలోని మంగళద్రవ్యాలకు మంగళమై వెలసియున్నావు. మధుసూదనుడైన భగవానుని వక్షఃస్థలాన అధివసించి ఆయనకు శ్రీనివాసుడనే పేరు తెచ్చి, ఎనలేని తేజస్సును కలిగించావు. లోకమందు కనబడునట్టి, వేద విహితమైనట్టి సకలైశ్వర్యాలు నీ వల్లనే కలుగుతాయని ప్రార్థించే ప్రజలకు మూర్తీభవించిన శ్రేయస్సువు నీవే. ఆశ్రితులను రక్షించే అర్హత కలిగి 'శ్రీదేవి' అనే సార్థక నామధేయం కలదానవమ్మా! కాబట్టి వేరే దిక్కూ-చక్కీ లేని నేను నీవే **గతి-శరణం**- అని నిన్ను మహా విశ్వాసంతో ప్రార్థిస్తున్నాను.

**హిరణ్మయీ వ్యాఖ్య :-** శ్రేయోమూర్తియైన శ్రీ మహాలక్ష్మియే హిరణ్మయీ రక్షా దీక్ష కలదని అనన్య గతికతతో ప్రార్థిస్తున్న శ్లోకంతో స్తోత్రమారంభింపబడుతున్నది.

శ్రీమద్వేదాంత దేశికులు శ్రీ మహాలక్ష్మీదేవి యొక్క వాచామగోచరమైన వైభవాన్నీ, అనంత కల్యాణ గుణగణాన్నీ స్తుతింప దలచి, మొదట శరణాగతి చేస్తున్నారు. సీతాదేవిని అన్వేషించే, దర్శించే విషయం కలిగిన సుందరకాండ "చారణా చరితే పథి" అని అత్యున్నతంగా ప్రచరించింది. అలాగే **'శ్రీస్తుతి'** సౌందర్యం 'మానాతీత'మై వెలసింది అతిమధురమైనది. శ్రీదేవీ విషయమైన స్తుతి – **శ్రీస్తుతి.**

**మానాతీత ప్రథిత విభవాం :-**

"యతో వాచో నివర్తంతే, అప్రాప్య మనసా సహ ।" శ్రుతి అన్నట్లు, ప్రమాణాలైన వేదాలకు అంతుబట్టని ప్రసిద్ధమైన మహిమ కలది భగవతి శ్రీదేవి. "హిరణ్మయః పురుషః" శ్రుతిరీత్యా, శ్రియఃపతి న్యాయాన్నిబట్టి, ఆ పురుషుని పత్నికి 'శ్రీ' అని పేరు. "చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం"– "సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం"– అనే "శ్రీ సూక్తం పలికినట్లు భగవానుడు హిరణ్మయ పురుషుడైతే ఆయన పత్నియైన భగవతి శ్రీదేవి 'హిరణ్మయి' కదా! "యస్యాంతం నవిదుః సురాసుర గణాః దేవాయ తస్మై నమః" (భాగవతం) భగవన్మహిమ ఇంతటిదని పరిచ్ఛేదింప రానిదిగా తెలిసిన దేవతలూ, పూర్వ దేవతలూ దిక్కుతోచనివారై, చేతులు జోడించి నమస్కరిస్తుంటారు.

శబ్దాదిక ప్రమాణాన్ని మించినదనే కాక, 'మానం' అంటే పరిమాణం

కూడా అసంఖ్యేయమనడం ప్రథితం–ప్రసిద్ధం.

ప్రథిత విభవం కలది. అంటే శ్రియఃపతికివలె, శ్రీదేవికి సకల విభూతి నాయకత్వమూ, విభుత్వమూ, ఈశ్వరత్వమూ, రక్షణ సామర్థ్యమూ సమర్థింపబడింది.

ప్రజలందరు మాతృమేయులే కదా! తల్లి చేసే ఉపకారాలు ఎవరికి తెలియవు? "మానాధీనా మేయసిద్ధిః" అనే న్యాయానుసారంగా తల్లిని కొలువడం, పూజించడం ప్రసిద్ధమే కదా! అయినా, మాతృమహిమ ప్రజలచే – ఆమె సంతతిచే అపరిచ్ఛేద్యం అంటే, ఇంతపాటిదని పరిగణించరానిది– "యస్యాస్తే మహిమాన మాత్మన ఇవత్వద్వల్లభోఽపి ప్రభుః, నాలం మాతు మియత్త యా నిరవధిః"– అమ్మా! నీ మహిమను తన మహిమనువలె, సర్వశక్తి సంపన్నుడైన నీ ప్రియుడు కూడా తెలుసుకోలేడు. అని శ్రీమద్యామున మునులు (ఆళ్వందార్) 'చతుఃశ్లోకి' లో స్తుతించారు. "తనక్కుమ్ తన్ తన్మై యఱియార్"– శ్రియః పతి తన మహిమను తానే తెలుసుకోలేడు – అని ఆళ్వార్ల శ్రీ సూక్తులు.

"దేవిత్వన్మహిమావధిర్న హరిణా నా పి త్వయా జ్ఞాయతే। యద్యప్యేవ మథాపి నైవ యువయోః సర్వజ్ఞతా హీయతే॥" ఓ శ్రీదేవీ! నీ మహిమ–నీకుగానీ, నీ పతియైన హరికిగానీ ఇంతటిదని మీ యిద్దరికీ తెలియదు కదా! అంతమాత్రాన, మీ యిద్దరి సర్వజ్ఞత్వానికి హానిలేదని శ్రీ కూరేశులు 'శ్రీస్తవం' చేశారు. వారు 'మహిమ'ను ప్రయోగిస్తే దేశికులు ఇక్కడ 'విభవ' శబ్దాన్ని ఉపయోగించారు. "అభిష్టౌతి స్తుత్యా మవితథ మతిర్యా మున మునిః"– అని దేశికులు 'చతుఃశ్లోకీ' భాష్యారంభంలో 'శ్రీయామున మునులు భక్తి రూపమైన శేముషితో శ్రీదేవిని బాగా స్తుతించారు' అని ప్రశంసించారు.

'లక్ష్మీ సహస్ర నామ స్తోత్ర' మందు మొదటి శ్లోకంలోనే "అచింత్యానంత విభవా" – లక్ష్మీదేవి విభవం అంతం లేనిది. ఊహింపరానిది – అని ప్రస్తుతింపబడింది.

**మంగళం మంగళానాం :–** బంగారం, మణులు, పసుపు, కుంకుమ, చందనం, పాలు, పెరుగు, దూర్వాక్షతాది శోభన ద్రవ్యాలకు మంగళత్వాన్ని

ఆపాదించేది శ్రీదేవి. "రమా మంగళ దేవతా". (అమరం)

కురు పితామహుడు, జ్ఞాన వృద్ధుడైన భీష్మాచార్యులు శ్రీకృష్ణుని సన్నిధిలోనే ధర్మరాజుకు భగవానుడు "పవిత్రాణాం పవిత్రం యో మంగళానాం చ మంగళమ్" అని ఉపదేశించాడు. గంగోదక, కుశ పవిత్రాది పావన ద్రవ్యాలకు పావనత్వమూ, శోభన ద్రవ్యాలకు మంగళత్వమూ, జగత్కారణత్వమూ శ్రియఃపతియొక్క సంకల్పాయత్త మనడం నిర్వివాదాంశం. శ్రీదేవి "సర్వమంగళ మాంగల్యా, సర్వ కామ ఫలప్రదా"। అని లక్ష్మీ సహస్ర నామ స్తోత్రమందు పూజింపబడింది. ప్రపంచంలోని మాంగళిక ద్రవ్యాలన్నీ వాటికి అధిదేవతయైన లక్ష్మీనామ పూర్వకంగా పేర్కొనబడడం నైసర్గికం.

సీతాదేవి అశోకవనంలో ప్రాణ పరిత్యాగానికి ప్రయత్నించే సమయాన శుభశకునాలు కలిగాయన్న వాల్మీకి వాగ్విలాసం గమనార్హం.

**"శుభాం నిమిత్తాని శుభానిభేజిరే".**

రాజును ఆశ్రయించి సేవచేసే వారికి రాజభటులని పేరు వస్తుంది. శోభన దేవతయైన సీతమ్మను ఆశ్రయించి శుభశకునాలని పేర్కొనబడినాయట.

"ఆ విరించాత్ అమంగళమ్". పురాణోక్తిని బట్టి చతుర్ముఖ బ్రహ్మ మొదల్కొని అంతా అమంగళమే. శ్రీ మహాలక్ష్మి యొక్క కడకంటి చూపు సోకకపోతే సర్వం నిః శ్రీకమే. కాబట్టి శ్రీ తత్త్వం బ్రహ్మాది జీవులకంటె విలక్షణమైనది. భగవానుడు శ్రీవల్లభుడైనందువల్ల మంగళకరుడు.

"తవ స్పర్శాదీశం స్పృశతి కమలే! మంగళ పదం" ఓ లక్ష్మీ దేవీ! సర్వేశ్వరునికి నీ స్పర్శవల్లనే మంగళ చిహ్నం ఏర్పడింది. 'శ్రీ' నామధేయవు కాబట్టి నీకు మాత్రం మంగళపదం నిరుపాధికమైనది, అని శ్రీ పరాశర భట్టరు శ్రీ గుణరత్నాలను కీర్తించారు.

లక్ష్మీ తత్త్వం వాస్తవంగా ఈశ్వరగోష్ఠియందు ప్రవిష్ట మనడం సుస్పష్టం.

**వక్షః పీఠం మధు విజయినో భూషయంతీం స్వకాంత్యా:-**

మధు విజయి మాధవుడు. సృష్ట్యాదిలో శ్రీహరి, వేదాపహర్తయైన మధువు అనే రాక్షసుణ్ని సంహరించి, వేదాలను చతుర్ముఖునికి ఇచ్చి, సృష్టి జేయడానికి అతణ్ని ఉత్తేజపరచాడు.

"మధు" పదం తీపి వస్తువే అయినా, అది 'అహం'కారమే. సర్వానర్థాలకు మూలమైన 'అహం' భావాన్ని అంతం జేయడం – అఖండ గర్వాన్ని గళితం చేయడం జగత్కారణ లక్షణం.

లావణ్య జలధియైన మధు విజయుని వక్షఃస్థలం యొక్క భోగ్యతను జూచి జలధి రాజ తనయ "పశ్యతాం సర్వదేవానాం యయౌ వక్షఃస్థలం హరేః" (వి.పు. 1-9-105) దేవతలందరు చూస్తుండగా ఆయన వక్షః పీఠంపైన అధివసించింది.

"అకల కిల్లే నిఱైయు మెన్ఱు అలర్మేల్మంగై యుఱై మార్పా" (తిరువాయ్. 6-10-10) పుష్పవాసినియైన పడతి హరి యెదలో వెలసి ఇక ఒక్కక్షణమైనను విడిచి యుండలేను, అని ప్రకటించింది. "తిరువిడమే మార్బుమ్"– లక్ష్మీ నివాసమే భగవానుని వక్షః స్థలమని నమ్మాళ్వార్ల శ్రీ సూక్తి. "మందిర మిందిరా యాః" (వైకుంఠస్తవం) 'ఇందిరా మందిర' మన్నారు శ్రీ కూరేశులు. "లక్ష్మీ లలిత గృహముపాసే రంగ సర్వంస హోరః" (శ్రీరం.రా.పూ.శ. 111) శ్రీరంగనాథుని ఉరఃస్థలాన్ని లక్ష్మీ విలాస గృహంగా ఉపాసిస్తానన్నారు శ్రీ పరాశర భట్టరు.

అప్పయ దీక్షితులు 'వరదరాజస్తవం'లో "అంతఃపురం జలధి రాజకుమారికాయాః"– వరదరాజు వక్షఃస్థలం కడలి కూతురు యొక్క అంతఃపురమని వర్ణించారు.

**'దేవనాయక పంచాశత్' స్తోత్రంలో దేశికులు**

**"దుర్దాంత దైత్య విశిఖక్షత పత్ర భంగం--**

**వీరస్య తే విబుధనాయక బాహుమధ్యమ్"–**

దేవనాయకుని భుజాంతరం వీర్యపరాక్రమాలకు గుర్తులుగా చిత్రరేఖలు కలిగి యున్నదని స్తుతించారు. అట్టి పతులయెదను చూచి, వీర పత్నులు మురిసి పోతారు.

"తం దృష్ట్వా శత్రుహంతారం మహర్షీణాం సుఖావహం। బభూవ దృష్టా వైదేహీ భర్తారం పరిషస్వజే॥" (రా.అర.)

విదేహ దేశ మందు పుట్టిన, విగత దేహాభిమానియైననూ జనక సుత వైదేహి, ప్రబల శత్రువులను జయించి వచ్చిన శ్రీరామ చంద్ర స్వామిని చూచిన వెంటనే, ఆయన యెదను గాఢంగా కౌగిలించుకొని - పతి పరిష్వంగం కోసం దేహాన్ని బహుమానించి - స్వామిని ఆనందసాగర వీచికలలో ఓలలాడించింది కదా।

"అప్రమేయం హి తత్తేజః యస్యసా జనకాత్మజా"- సీతాపతియైనందువల్ల శ్రీరాముని తేజస్సు - పరాభిభవన సామర్థ్యం, పరిగణించరానంతగా మించి శోభిస్తున్నదని మారీచుడు సౌహార్దంతో, రావణాసురునికి ఉపదేశించాడు. ఇది రాక్షసోపదేశం- దీనివల్ల సీతాదేవి యొక్క తేజస్సు అప్రమేయమని చెప్పక చెప్పినట్లయింది కదా!

"ఫలమత ఉపపత్తేః" (బ్రహ్మ సూత్రం) భగవానుడు సర్వశక్తుడు, పక్షపాత రహితుడు, కర్మ ఫల ప్రదాన సమర్థుడు అని శ్రీమద్వ్యాసోక్తి. సర్వఫల మూల భూతుడైన సర్వేశ్వరుడు సంసార తంత్ర నిర్వాహకుడైనందువల్ల సాపరాధులైన ప్రాణులకు తీక్ష్ణ దండన విధిస్తాడు.

"నా హితం కారయేద్ధరిః"- అపరాధులపట్ల హితాన్ని కలిగించడానికే కోపం తెచ్చుకుంటాడు. అందుకే నిగ్రహ మెరుగని, కరుణా రూపిణియైన లక్ష్మిహరి యెద నధివసించియున్నది.

"ప్రభావాన్ సీతయాదేవ్యా"-అన్నట్లు లక్ష్మి స్వరూపం (సూర్యుని) ప్రభలాంటిది. కారుణ్య ప్రభారూప జలాభిషేకంతో హరి హృదయాన్ని శిశిరం (శీతలం) చేస్తుంది. కోపాన్ని శాంతింపజేస్తుంది. "కిమేతత్? నిర్దోషఃక ఇహ జగతి? న కశ్చిన్నాపరాధ్యతి." ఏమిటి? ఎందుకీ కోపం? ప్రపంచంలో దోషం లేని వాడెవడు? అంటూ, ఉపాయంగా హరిచిత్తాన్ని మెత్తబడగొడుతుంది. జనుల అపరాధాలను విస్మరింపజేస్తుంది. లక్ష్మీదేవి 'మధు విజయుని వక్షః స్థలాన్ని తన కారుణ్య కాంతితో అలంకరిస్తుంది. అలంకార ప్రియుడు కదా విష్ణువు.

"అక్షయ్యం మధుహన్తారం జానామి త్వాం సురోత్తమమ్"- అనే పరశురాముని

స్తుతి వాక్యాన్ని బట్టి, మధు హంత దేవ దేవోత్తముడు. లక్ష్మీదేవి దేవ దేవ దివ్య మహిషి కదా!

**ప్రత్యక్షా నుశ్రవిక – శ్రియమ్:–**

"గుణాద్రూప గుణాచ్చాపి". (రా) వాల్మీకి చెప్పినట్లు రూప గుణాలు, ఆత్మ గుణాలు అని గుణ నిరూపణం రెండు విధాలు. శ్లోకంలోని మొదటి చరణంలో శ్రీదేవి వైభవం-ఐశ్వర్యం అగ్గలంగా ఉగ్గడింపబడింది. రెండవ చరణంలో "కాంతిర్లావణ్యమర్చిః" అన్నట్లు దేహకాంతితో తాను ప్రకాశిస్తూ తన వల్లభుణ్ని ప్రకాశింపజేసే శ్రీదేవి యొక్క రూప గుణ సంపత్తు ప్రస్తుతింపబడింది. ఈ మూడవ చరణంలో ఆత్మగుణాలు వివరింపబడుతున్నాయి.

"శ్రియం లోకే దేవజుష్టా ముదారామ్" అని శ్రుతి శ్రీదేవిని వర్ణించింది. ప్రేమతో భగవంతుణ్ని ఆశ్రయించి, బ్రహ్మాది దేవతల చేత శ్రద్ధాభక్తులతో సేవింపబడుతున్న శ్రీదేవి ఔదార్యగుణం కలది, అని వేదం ప్రతిపాదించింది.

"త్వం లజ్జసే కథయకోఽ యముదారభావః" శ్రీ గుణరత్న-58.

తల్లీ! సకల సంపదలనే కాక మోక్ష సంపదను కూడా అజ్ఞాత భక్తులకు ప్రసాదించావు కదా! ఇంత ఔదార్యం కలిగిన నీవు "నేనేమి ఉపకరించక పోతిని" అని బిడియ పడుతున్నావెందుకో చెప్పుమని శ్రీ పరాశరభట్టర్ సూక్తి.

ఇలా, విశేషంగా పరమకారుణికత్వాన్ని ప్రత్యేకంగా ప్రశంసిస్తున్నది తృతీయ చరణం.

పశు, పుత్ర, గృహ, ఆరామ, ఐశ్వర్యాదులు ప్రత్యక్ష ప్రమాణ సిద్ధమైనవి. 'అనుశ్రవ'మంటే వేదం. "నిగమానుశ్రవౌ" (శబ్దార్ణవం) అనుశ్రవేభవః= ఆనుశ్రవికః . స్వర్గకైవల్యా పవర్గాలు వేదశాస్త్ర సిద్ధాలు. ప్రత్యక్ష, వేదశాస్త్ర గమ్యాలైన ఈ రెండు మహిమలను కోరేవారు ప్రజలు. జగన్మాతకు బ్రహ్మాదులందరు ప్రజలే (బిడ్డలే) కదా! ప్రకృష్టమైన జన్మ గలవారు ప్రజలు. పుట్టినప్పుడే భగవత్కటాక్షాన్ని పొంది గొప్పవారుగా పుట్టారు. "పిరందార్ ఉయర్న్దే" – అని నమ్మాళ్వార్ల సూక్తి. ప్రజలయందు వాత్సల్యం స్ఫురిస్తున్నది కదా!

తల్లిదండ్రులు ప్రత్యక్ష దేవతలు.

"యతో మూలం నరఃపశ్యేత్ ప్రాదుర్భావ మధాత్మనః ।కథం తస్మిన్నవర్తేత ప్రత్యక్షే సతి దైవతే ॥" మానవుడు, తనకు జన్మనిచ్చిన తల్లిదండ్రులను, దేవతలుగా కంటికి కనబడుతుండగా, పూజించడానికి ఎందుకు ప్రవర్తించడు? అని పితృభక్తి పరాయణుడైన శ్రీరాముని మాట. ప్రత్యక్ష దైవ స్వరూపులైన మాతా పితరులను పూజిస్తే, వారు తమ సంతతికి దృష్టా దృష్ట-సమస్త-ఫలాలను ప్రసాదిస్తారు. కాబట్టి, "మాతృదేవోభవ, పితృదేవోభవ"- 'తల్లిని, తండ్రిని దేవతలుగా భావించేవాడవగు' మని ఉపనిషత్తు బోధిస్తుంది.

"శ్రియః గుణః శ్రేయః"- శ్రేయస్సు అంటే 'శ్రీ' యొక్క గుణమే. శ్రేయస్సాధనమైనది ధర్మం. "రామో విగ్రహవాన్ ధర్మః" అని "కృష్ణం ధర్మం సనాతనం" అని భగవంతుణ్ని పొగడే రీతిగా శ్రీదేవిని శ్రేయోమూర్తిగా స్తుతిస్తున్నారు దేశికులు. మూర్తీభవించిన శ్రేయస్సు-శ్రేయో రూపయైనదన్నమాట. శ్రేయస్సు అంటే హితం. ఇది ఉపాయరూపమని, ఫలరూపమని రెండు విధాలు.

"యజ్ఞ విద్యా మహావిద్యా గుహ్య విద్యాచ శోభనే । ఆత్మ విద్యాచ దేవి! త్వం విముక్తి ఫలదాయినీ॥" ఆత్మ విద్యా రూపిణి అనడం వల్ల చైతన్య పుష్టిని కలిగించే శ్రీదేవి, ఉపాయ రూప.' విముక్తి ఫలదాయినీ, అనడంవల్ల మోక్ష ఫల రూపమైన ఐశ్వర్యమే. "సాహి శ్రీ రమృతాసతామ్" అనే శ్రుతిరీత్యా, త్రయీ రూపమైన శ్రీదేవి శ్రేయస్సాధన రూపయే కాక కేవలం శ్రేయోరూపురాలని తెలుస్తున్నది. కదా! భగవానుడీమె వియోగాన్ని సహించలేక తన పేరులోనే (శ్రీనివాసుడు) 'శ్రీ' ని ఇమిడించుకొన్నాడు. శ్రేయోదానమందు శ్రీదేవి అనుగ్రహాన్ని అపేక్షిస్తాడు శ్రియః పతి,

**"శ్రేయో నహ్యరవిందలోచ నమనః కాన్తా**
**ప్రసాదాదృతే, సంస్కృత్యక్షర వైష్ణవా**
**ధ్వసు నృణాం సంభావ్యతే కర్హిచిత్ ॥"**

అని స్తుతించారు శ్రీమద్యామునాచార్యులు.

లక్ష్మీదేవి అనుగ్రహమే లేకపోతే ప్రాణులకు ఇహలోకైశ్వర్యంగానీ, కైవల్యంగానీ, భగవత్కైంకర్యంగానీ – ఏ శ్రేయస్సు ఉండదని వ్యతిరేకాన్వయంతో స్తుతించారు. 'శ్రేయో మూర్తి' అనడం వల్ల ప్రార్థించిన వెంటనే కోరబడిన శ్రేయస్సు కలుగుతుందని, అన్వయ ముఖంగా చెప్పిన ఈ మాటకు కూడా దార్ఢ్యమేర్పడింది.

శ్రియం :– భగవచ్ఛాస్త్ర ప్రకారం శ్రీ శబ్దానికి ఆరు వ్యుత్పత్త్యర్థాలున్నాయి. శ్లో. "శ్రితాస్యన్యైః సర్వైః, శ్రయసి రమణం; సంశ్రిత గిరః శృణోషి; ప్రేయాంసంశ్రిత జనవచః శ్రావయసిచ । శృణాస్యేతద్దోషాన్ జనని! నిఖిలాన్; సర్వజగతీం గుణైః శ్రీణాసిత్వం; తదిహ భవతీం శ్రీరితివిదుః ॥"

1. జీవవర్గం చేత ఆశ్రయింపబడుతుంది.
2. వల్లభుడైన విష్ణుమూర్తిని ఆశ్రయిస్తుంది.
3. ఆశ్రితుల మాటలను వింటుంది.
4. ఆర్తుల మాటలను పతికి వినిపిస్తుంది.
5. సకల దోషాలను పోగొట్టుతుంది.
6. తన గుణాలచే జగమంతా ఆశ్రయించి ఉంటుంది.

అందువల్ల 'శ్రీః' అని పేర్కొంటున్నారు. ఈ పేరులోనే, పురుషకారత్వానికి ఉపయోగపడే దయార్ద్రత్వం, క్షమాశీలత్వం, దోష అదర్శిత్వం, పతివాల్లభ్యం, తద్రంజన సమర్థత్వం; ఆర్జవ మార్దవ సౌహార్ద స్థిరత్వ సమత్వాది ఆత్మగుణాలు స్ఫురిస్తున్నాయి.

సమాశ్రయణానికి విరోధించే రజస్తమస్సుల నివర్తకత్వం, సమాశ్రయించిన తర్వాత సంభవించే సాంసారిక దోషాల నివర్తకత్వం, సమాశ్రయించడానికి అవసరమైన జ్ఞాన విశేష పరిపాకాది హేతుత్వం, తర్వాత కలిగే స్వాష్టగుణాభి వ్యంజకత్వం మొదలైన, సిద్ధోపాయానికి ఉచితాలైన ధర్మాలూ ప్రతిపాదితాలు. ఉపేయత్వ ప్రయోజకాలైన సౌశీల్యాదులూ, ఆకార త్రయోపయుక్త గుణాలూ స్ఫోరితాలు.

అశరణః :– 'అనన్య శరణః' అన్నట్లే, తల్లీ! నీవు తప్ప వేరు రక్షకత్వం లేనివాడను అని అర్థం. ఆశ్రయించే భయాన్ని పోగొట్టి, దగ్గరికి చేర్చేమాట ఇది.

శరణ్యాం, త్వాం :– శరణ్యుడైన నారాయణుడు లక్ష్మీ విశిష్టుడై ఉంటాడు.

"ఒండొడియాళ్ తిరుమగళుమ్ నీయుమేనిలానిఱ్ఱ"– జగ జగ మనే కంకణాలుగల శ్రీదేవీ, నీవూ కలిసియున్నప్పుడు, అని నమ్మాళ్వార్ల శ్రీసూక్తి "శ్రియాసార్థం జగత్పతిః " – జగన్నాథుడు లక్ష్మితోనే కూడి యుంటాడు. కాబట్టి, భగవానుడెట్లు శరణ్యుడో అట్లే శరణ్యవైన నిన్ను– అని అర్థం.

ప్రపద్యే :– స్తుతింపబడే దేవత – శ్రీదేవి– యొక్క చరణాలలో శరణాగతి చేస్తున్నాను. "విశ్వంభరాం అశరణః శరణం ప్రపద్యే" (భూస్తుతి) 'గోదామనన్య శరణః శరణం ప్రపద్యే" (గోదాస్తుతి) అట్లే, మొదటిశ్లోకంలోనే మంగళార్థంగా చేసిన దేశికుల ప్రపదనం స్వరూపస్వారస్యం కదా! "ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దేశోవాఽపితన్ముఖే" న్యాయానుసారంగా వస్తు నిర్దేశమూ ఉంది. ఇందు, స్తోత్రం, నిర్విఘ్నంగా పరిసమాప్తి కోసం చేసే ప్రార్థన కూడా ఉంది.

భద్రవాచకమైన 'మా' తోనూ, మగణంతోనూ స్తోత్రం ఆరంభమైనది.

ఉదాత్తాలంకారం. 'ప్రజానాం' అన్న చోట మాతృత్వాన్ని స్ఫురింపజేయడంవల్ల వస్తు ధ్వని. మభనతతగగ – గణాలు గలిగిన, మందాక్రాంతా వృత్తంతో శ్లోకాల రచన సాగింది.

**2. ఆవిర్భావః కలశ జలధా వధ్వరేవాఽపి యస్యాః**
**స్థానం యస్యాః సరసిజవనం విష్ణు వక్షః స్థలంవా ।**
**భూమాయస్యా భువనమఖిలం దేవి! దివ్యం పదంవా**
**స్తోక ప్రజ్ఞై రనవధి గుణాస్తూయసేసాకథంత్వమ్ ॥**

**అర్థం:–** యస్యాః = ఏ మహాలక్ష్మియొక్క; ఆవిర్భావః = అవతారం; కలశజలధౌ= పాలకడలియందో; అధ్వరే, వా,అపి = లేక, యజ్ఞమందో; యస్యాః = ఏ మహాలక్ష్మియొక్క; స్థానం = నివాసం; సరసిజవనం = పద్మవనమో; విష్ణు వక్షః స్థలం, వా = లేక, విష్ణుమూర్తి యొక్క ఉరః స్థలమో; యస్యాః = ఏ దేవి యొక్క; భూమా = ఐశ్వర్యం; అఖిలం భువనం = సమస్త ప్రపంచమో; దివ్యం, పదం వా= లేక, పరమ పదమో; సా = అట్టి; అనవధి గుణా = ఎల్లలేని గుణాలు కలిగియున్న; త్వం = నీవు; దేవి = ఓ లక్ష్మీదేవి! స్తోక ప్రజ్ఞైః = మంద మతుల చేత; కథం =

ఎట్లు; స్తూయసే = స్తుతింపబడుతావు!

**తా॥** ఏ మహాలక్ష్మి యొక్క జననం క్షీర సముద్రమందో లేక యజ్ఞస్థలమందు కలిగెనో, ఏ దేవి యొక్క నివాస స్థానం కమలవనమో, లేక విష్ణు భగవానుని వక్షః స్థలమో; ఏ దేవి యొక్క ఐశ్వర్యం సమస్త ప్రపంచమో లేక దివ్యస్థానమైన శ్రీ వైకుంఠమో; అట్టి వైభవమున్న, లెక్కించ రానన్ని కల్యాణ గుణాలు కలిగియున్న నీవు, ఓ మహాలక్ష్మీ! అల్పజ్ఞుల చేత ఎట్లు స్తుతింపబడుతున్నావో ఆశ్చర్యమే.

**వ్యాఖ్య :- శ్రీదేవి యొక్క అవతారాది వైభవం ప్రతిపాదితం.**

స్త్రీల గొప్పతనం పుట్టినింటి, మెట్టినింటి మహిమల వల్లనే ప్రకటింపబడుతుంది. "స ఉ శ్రేయాన్ భవతి జాయ మానః" అని శ్రుతి పలికినట్లు, శ్రీ మహాలక్ష్మికి శ్రేయస్త్వం సహజమైనది. పుట్టినప్పుడే శ్రేయోమూర్తిగా వెలసింది. ఆమె క్షీరవారాశి గారాబు పట్టి.

**ఆవిర్భావః కలశ జలధౌ :-** లక్ష్మి పాలకడలిలో అవతరించింది. ఆ కలుముల జవరాలు దేవతలు, దానవులు చూస్తుండగా కమలాక్షుణ్ని వరించింది. పాలకడలిలో పాముసెజ్జపై పవళించిన భగవంతుణ్ని దేవతలూ, ఋషులూ పదే పదే పరమభక్తితో సేవిస్తుంటారు. కాబట్టి వారికి సేవా సౌకర్యం కలిగించడానికి తన భర్తతోనే (ఎడబాయకుండా) ఉంటుంది.

జగన్మాత సంతానం అసంఖ్యాకమైనది కదా! తన బిడ్డలకు క్షీర దానం చేయడానికి కామధేనువుకున్న సామర్థ్యం సరిపోదు. ఈ తల్లి పాలు పితికే ఆలస్యాన్ని కూడా సహించజాలదు. ప్రజలు ఆయాసపడకుండా వారికి పాలివ్వాలనే వాత్సల్యంతో సముద్ర రూపంలో పాలను సమృద్ధిగా ధరించియున్నట్లు ఉంటుంది.

శ్రీ మహావిష్ణువు పాల సముద్రాన్ని పెరుగును చిలికినట్లే, కటక కేయూరహారాదులు జారిపోతుండగా బాహువులతో చిలికి చాలా అలసిపోయాడు. ఆయన శ్రమను పోగొట్టడానికే అమృత తరంగాల మధ్య నుంచి లక్ష్మీదేవి, చిరునవ్వుతో కూడిన చూపులనే అమృతంతో తడుపుతున్న చంద్రిక (వెన్నెల) లాగా ఉద్భవించింది; (శ్రీ గుణ రత్నకోశం.49) అని శ్రీ పరాశరభట్టర్ సూక్తి.

**అధ్వరే వాఽపి :-** జనక మహారాజు యొక్క యాగ భూమియందు కూడా ఆవిర్భవించింది. 'వా, అపి' అనే అవ్యయాలు సముచ్చయార్థకాలు. మొదట సముద్ర తనయగా అవతరించిన లక్ష్మి తర్వాత యజ్ఞశాలయందు సీతగానూ అవతరించింది. "ఇవవద్వా యథాదయః" అని నిఘంటువు.

లక్ష్మి సాగరకన్యగా జన్మించినట్లే సీతయై భూకన్యగానూ జన్మించిందన్న అర్థమూ గ్రాహ్యమే.

అధ్వరమందు భగవానుడు రామునిగా అవతరించడానికి కారణమైన పాయసాన్ని భుజించి దశరథుని పత్నియైన కౌసల్య గర్భాన్ని దాల్చింది. సీతయైన శ్రీదేవి అయోనిజ కాబట్టి ఈమె అవతారం భగవంతుని అవతారంకన్న విలక్షణమయింది.

దేవతల ప్రపదన సౌకర్యం కోసం శ్రీదేవి కడలియందవతరించింది. రాక్షస స్త్రీల ప్రపదనార్థం సీత అధ్వరమందు అవతరించింది. 'పాపీయసోఽపి శరణాగతి శబ్దభాజః"- భగవంతుడు శరణాగతులైన సాపరాధులను రక్షిస్తాడన్న మాట సత్యం కావచ్చు. కాకపోవచ్చు. కాని శ్రీదేవి, ఆర్ద్రా పరాధినులైన రాక్షసాంగనలు 'తల్లీ! నీవే శరణ'మన్న వెంటనే వారిని రక్షిస్తుంది. కాబట్టి, మొదట తల్లినే శరణువేడడం మేలు కదా!

ఈ శ్లోకంలోని ప్రథమ చరణం, శ్రీదేవి "పవిత్రాణాం చ పవిత్రం" అనే మాటను నిరూపించే మహత్త్వం కలది. "తీర్థోదకంచ వహ్నిశ్చ నాన్యతః శుద్ధి మర్హతః "- (ఉ.రా.చ) అన్నాడు భవభూతి. తీర్థజలాన్ని, అగ్నిని ఇతర వస్తువులేవీ శుద్ధి చేయజాలవు. అంత పవిత్రమైన ఈ పదార్థాలు రెండు కూడా దేవ యజన సంభవ, అయోనిజయైన సీతమ్మను పవిత్రీకరించలేవు. ఆజాన శుద్ధయైన సీతాదేవి వల్లనే ఉదకాగ్నులు శుద్ధి పొందడానికి అర్హమైనవి కదా!

**స్థానం యస్యాః సరసిజవనం విష్ణు వక్షః స్థలం వా :-** లక్ష్మీదేవి యొక్క నివాస స్థానం పద్మవనం. తామర పూవు చాలా సువాసన కలది, సుకుమారమైనది. "పద్మే స్థితాం, పద్మవర్ణాం" సౌందర్యం, సౌగంధ్యం, సౌకుమార్యం కలిగిన పద్మంతో

సమానమైన శరీర వర్ణమున్న శ్రీదేవి తనకు సముచితమైన సుందర సుగంధ సుకుమార సరసిజాసనమందు ఆసీనమైనదని 'శ్రీ సూక్తం' వర్ణించింది.

"అలర్మేల్ మంగై" పద్మాసనస్థయైన పడతి, అని శ్రీ వకుళాభరణ సూక్తి. ఉభయ వేదాంతాలు శ్రీదేవి 'దివ్యమంగళ విగ్రహ' అని విశదపరచాయి.

విష్ణు వక్షః స్థలం వా :- అలాగే, విష్ణువు యొక్క భుజాంతరం శ్రీ దేవతకు స్థానమైయున్నది. స్థల శబ్దం దేవతాస్థానార్థకం.

**"పాదారుంతుద మేవ పంకజ రజః"** (శ్రీ గు.రత్న)

తామర పూవు చాలా మృదువైనది. తామర పుప్పొడి అంతకంటె మెత్తనిది కదా!

శ్రీదేవికి ప్రాకృతికమైన పద్మపరాగమే కంటక ప్రాయమై బాధ పెట్టిందట. అందువల్ల, ఆమెకు అప్రాకృత - పంచోపనిషణ్మయమైన శ్రీ మహా విష్ణువు యొక్క దివ్యసుందర, సుకుమార దేహమందలి హృదయ కమలమందు నివసించడం భోగ్యమనిపించింది.

"శ్రీ విష్ణు హృత్కమల వాసిని" అని స్తుతిస్తే లక్ష్మీదేవి ఆనందంతో అనుగ్రహాన్ని వర్షిస్తుంది. సౌగంధ్యం కలిగిన పద్మమందూ, పవిత్రమైన వక్షః స్థలమందూ - ఈ స్థానద్వయమందు- నివసించే భాగ్యం విష్ణుమూర్తికి ఘటించనందువల్ల భగవానునికన్న అతిశయించిన స్థానంకలది లక్ష్మీదేవి అని సంస్కృత వ్యాఖ్య. విష్ణు వక్షఃస్థలమందు నివసించడంవల్ల శ్రీదేవికి భర్తతో నిత్యయోగమూ, ఆయన హృదయాన్ని నియమించడమూ సిద్ధించింది. (అప్పయ దీక్షితుల వంశీయులు వరదరాజ స్వామి వక్షఃస్థలాన్ని వర్ణించినందువల్ల దీక్షితుల పితామహుడు 'వక్షఃస్థలాచార్యుడు' అనే రాజదత్త బిరుదుతో ప్రఖ్యాతుడయ్యాడు.)

**భూమాయస్యా భువన మఖిలం దేవి ! దివ్యం పదంవా :-**

"అఖిల భువన జన్మస్థేమ భంగాదిలీలే" అనే శ్రీ భాష్యమందలి మంగళ శ్లోకం స్మారితం.

సమస్త ప్రపంచం (ఏకపాద్విభూతి) శ్రీదేవి సొమ్ము. "త్రిపాదస్యామృతందివి".

అనే వేద వాణి పరమపదాన్ని 'త్రిపాద్విభూతి' అన్నది. మోక్షస్థానమూ శ్రీదేవి సొమ్మే. శ్రీదేవికి ఉభయ విభూతి శేషిత్వం కీర్తింపబడింది.

"విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్" అని భగవద్గీతలో ప్రాకృత విభూతి వర్ణింపబడింది. 'దివ్యం పదం' అనడం వల్ల ధనలక్ష్మి మొదలుకొని మోక్షలక్ష్మి వరకు శ్రీదేవి యొక్క వైభవం విస్తరించి ఉంది. 'దేవి' అనే సంబోధనాంత పదం ఉభయ విభూతులకు మధ్య ప్రయుక్తమైనది. దేవుడంటే క్రీడించేవాడు. ఆటలాడేవాడు. "దివ్-క్రీడా విజిగీషా వ్యవహారమోద మద స్వప్న కాంతి గతిషు" అని దేవశబ్దం అనేకార్థకం. "శ్రద్ధయా దేవో దేవత్వమశ్నుతే" అని శ్రుతి. భగవానునికి సృష్టి స్థితి సంహారాలు లీలగా ఆడుకొనే ఆటలే. అయితే లక్ష్మీదేవితో కలిసి ఆడుకొంటాడని శ్రుత్యర్థం. సృష్ట్యాది క్రీడవల్ల అవాప్త సమస్త కామునికి ఆనంద రసానుభవమే తప్ప వేరే లాభమే లేదు, ఉండదు.

"లోక వత్తు లీలా కైవల్యమ్"(బ్రహ్మ సూత్రం) "క్రీడతో బాలకస్యేవ" (విష్ణు పురాణం) "ఇన్బుఱు మివ్విళైయాట్టుడైయాన్" (ఆళ్వార్ శ్రీసూక్తి) శ్రుతి స్మృతులన్నీ సృష్ట్యాది వ్యాపారం 'క్రీడ'గానే స్పష్టపరచాయి. "యద్భ్రూ భంగాః ప్రమాణం స్థిరచర రచనా తారతమ్యే" భగవానుడు లక్ష్మీదేవి యొక్క భ్రూభంగాది చేష్టలను అనుసరించి జగద్వ్యాపారం చేస్తాడు. 'దేవి' అంటే 'పట్టమహిషి' అనే కాక 'దేవయతి', (క్రీడయతి కాంతం) భర్తను ఆటాడించేది, అనే అర్థమూ ఉంది.

**'భూమన్' శబ్దం బహ్వర్థకం. సమృద్ధి; ఐశ్వర్యం,**
**ఇటు ప్రపంచమంతా (లీలా విభూతి),**
**అటు పరమ పదమూ (నిత్యవిభూతి)**
**లక్ష్మీదేవి యొక్క ఐశ్వర్యమే.**

భగవద్గీతలో మధ్యమ షట్కమందు భగవానుడు భక్తి కలగడం కోసం తన విభూతులను ప్రదర్శించాడు. ఆ విధంగా ఇక్కడ శ్రీ సమృద్ధిని (భూమా) దేశికులు ప్రదర్శించడం గమనీయం.

**స్తోక ప్రజ్ఞైః అనవధిగుణా స్తూయసే సా కథంత్వమ్ :-**

**'స్తుతి' అంటే, గుణి నిష్ఠగుణాభిధానమ్ ।**

**'స్తోత్రం' అంటే సమ్యక్తత్త్వ గుణాభివర్ణనమ్ ।**

త్వం కథం స్తూయసే :- నీ వెట్ల స్తుతింపబడుతావు? అని ఇది స్తోత్ర ప్రస్తావం కదా!

**"తద్విప్రాసో విపన్యవో జాగృవాంసఃసమింధతే, విష్ణోర్యత్పరమం పదమ్"**- పరమపదమందు నిత్యసూరులు, ముక్త పురుషులు జ్ఞాన సంకోచం లేని వారు. దివ్య జ్ఞాన పరిపూర్ణులైనందువల్ల లక్ష్మీ నారాయణులనబడే దివ్య దంపతులను జాగరూకులై అనేక విధాలుగా స్తోత్రం చేస్తుంటారు.

సా, అనవధి గుణా :- లక్ష్మీదేవి వైభవం అనంతమైనది. మహిమ అమేయమైనది. ఆమె యందు ఉన్నవన్ని కల్యాణ గుణాలే. ఒక్కొక్క గుణాన్ని, సర్వజ్ఞులైనా, స్తుతించడం దుష్కరం. పైగా, ఒక్కొక్క గుణమే ఎల్లలేనిదవడంవల్ల సమగ్రంగా వర్ణించడం అసంభవం. అపరిమేయమూ, అనవధికమూ అయిన దాన్ని ఇంతటిదని పరిచ్ఛేదించి వివరించడం ఈశ్వరునికైనా అశక్యమే.

"నతే వర్ణయితుం శక్తా గుణాన్ జిహ్వాఽపి వేధసః" నలువ నాలుక కూడా భగవద్గుణాలను వర్ణించే శక్తిలేనిది.

స్తోక ప్రజ్ఞైః కథం స్తూయసే :- "ధీః ప్రజ్ఞా శేముషీ మతిః"-(అమరం) అవసరానికి తగినట్లు స్ఫురించే బుద్ధిని 'ప్రజ్ఞ' అంటారు. శ్రియఃపతి కూడా తన పత్నియైన శ్రీదేవి మహిమను తెలుసుకోలేదన్నారు ఆళవందారు. ఇక స్తోక ప్రజ్ఞులు అల్పబుద్ధి కల చేతనులు శ్రీదేవి అవతారాన్ని, నివాస స్థానాన్ని, ఆమె వైభవాన్ని-భూమాదులను తెలిసి స్తుతించగలరా? భగవతి గుణాలకు అవధిలేదు. అలాగే చేతనుల గుణాలకు పూర్తిలేదు. ఓ లక్ష్మీదేవీ! జ్ఞాన సమృద్ధిలేని నేను నిన్నెలా స్తుతించగలను? అని దేశికులు స్వరూప లక్షణంగా వినయాన్ని ప్రకటించారు.

**3. స్తోతవ్యత్వం దిశతి భవతీ దేహిభిఃస్తూయమానా**
**తామేవత్వా మనితరగతిః స్తోతుమాశంసమానః ।**
**సిద్ధారంభః సకలభువన శ్లాఘనీయో భవేయం**
**సేవాపేక్షా తవచరణయోః శ్రేయసే కస్యనస్యాత్ ॥**

**అర్థం :-** దేవీ! భవతీ = నీవు; దేహిభిః = మానవులచేత; స్తూయమానా = స్తోత్రం చేయబడిన దానవై; స్తోతవ్యత్వం = (స్తోతలకు ఇతరులు) స్తోత్రం చేసే యోగ్యతను; దిశతి = కలుగ చేస్తున్నావు. తాం = అట్టి; త్వాం, ఏవ = నిన్నే; అనితరగతిః = వేరే దిక్కు లేని వాడనై; స్తోతుం = స్తుతించడానికి; ఆశంసమానః = ఆశపడే, నేను; సిద్ధ+ఆరంభః = కృత కృత్యుడనై; సకల భువన శ్లాఘనీయః। సకల = సమస్త; భువన = లోకాలచే; శ్లాఘనీయః = పొగడదగిన వాడను; భవేయం = కాగలను తవ = నీ యొక్క; చరణయోః = పాదాలయందు; సేవా+అపేక్షా= సేవ చేసే కోరిక; కస్య = ఎవనికి; శ్రేయసే = శ్రేయస్సు కోసం; న, స్యాత్ = కలుగక ఉంటుంది?

**తా॥** ఓ లక్ష్మీదేవి! దేహధారులు నిన్ను స్తుతిస్తుంటారు. నీవు వారికి లోకులు స్తుతించే స్థితిని కలిగిస్తుంటావు. అట్టి మహిమగల నిన్ను వేరే గతిలేక స్తోత్రం చేయ తలచినంత మాత్రాన స్తోత్రమారంభమై పూర్తియగునట్లు అనుగ్రహిస్తావు. కృతకృత్యుడనైన నేను ప్రజలచే శ్లాఘనీయుడనవుతాను. నీ పాద సేవాపేక్ష ఎవరికి శ్రేయస్సునియ్యదు? అందరికి శ్రేయస్సును కలిగిస్తుందని తాత్పర్యం.

**వ్యాఖ్య :- శ్రీదేవి తనను స్తుతించే వ్యక్తులకు స్తుతింపబడే భాగ్యాన్ని కలిగిస్తుందని వర్ణితం.**

స్తోత్రం చేసే శక్తి లేదని విన్నవించినంతలోనే దయామయి, స్తోత్రం చేయక-ఊరక- ఉండలేని దశను అనుగ్రహిస్తుంది. తల్లిని స్తుతించని వాడెవడు? స్తుతించడం జీవ లక్షణం. బద్ధులు, ముక్తులు, నిత్యులు అనబడే త్రివిధ చేతనులు భగవద్గుణాలను కీర్తిస్తుంటారు.

**దేహిభిః స్తూయమనా :-** దేహధారులందరు - మానవులు, బ్రహ్మాది దేవతలు- జగన్మాతను స్తుతిస్తూ తమ తమ పదవులందు స్థిరంగా ఉంటున్నారు. సంసారులు- దేహస్థులే దేవిని స్తుతించి స్తోతలనబడుతారు. సకల సంపదలను పొందుతారు.

**స్తోత వ్యత్వం దిశతి భవతీ :-** తల్లిని స్తుతించినవాడే సత్పుత్రుడని లోకం చేత పొగడబడుతాడు. తత్క్రతున్యాయంగా, లక్ష్మిని స్తుతించే వాడే లక్ష్మీవంతుడు

అవుతాడు. శ్రీమంతుణ్ని అందరు పొగడే భాగ్యాన్ని ప్రసాదిస్తుంది భగవతి.

'నీవు' అనే అర్థమిచ్చే 'త్వం' అనే పదంవంటిది కాదు 'భవ'చ్ఛబ్దం– 'నీవు' అనే అర్థమిచ్చే 'భవతీ' పదం పూజ్యార్థకం. 'త్వం' (యుష్మచ్ఛబ్దం) ప్రయుక్తమైతే మధ్యమ పురుషలో క్రియాపదం ఉంటుంది. భవచ్ఛబ్దమే ప్రయుక్తమైనప్పుడు 'శేషేప్రథమః' అనే శబ్ద శాస్త్రరీతిగా, క్రియాపదం ప్రథమ పురుషలో (దిశతి) ప్రయోగింపబడుతుంది. కాబట్టి 'భవతీ' అనడం వల్ల, శ్రీదేవి యొక్క పరత్వం వ్యక్తమవుతున్నది.

**తామేవత్వామ్ :–** "యోఽసి సోఽసి" అని శ్రుతి. అలాంటిదే ఈ ప్రయోగం. 'ఓమ్ తత్ సత్' అని భగవద్వాచకం త్రివిధం కదా!

తనోతి ఇతి = తత్ వ్యాపించి యుండేది 'తత్' పదార్థం. "సౌమ్యా సౌమ్యైః జగద్రూపైః త్వయైతద్దేవి! పూరితమ్"–ఓ దేవీ! సౌమ్యా సౌమ్యాలైన నీ రూపాలతో ఈ జగత్తు నిండియున్నది. (వి.పు) తచ్ఛబ్దమే స్త్రీ లింగమందు ద్వితీయా విభక్త్యేక వచనాంత రూపం 'తాం' అయింది. 'ఈశ్వరః సర్వభూతానాం' అన్నట్లే "ఈశ్వరీం సర్వభూతానాం త్వామిహోపహ్వయేశ్రియమ్" అన్నది శ్రీ సూక్తమ్. కాబట్టి 'తాం' అనే పదం పరత్వాన్ని సూచిస్తుంది. 'త్వాం' అనేది సౌలభ్యాన్ని తెల్పుతుంది పరమాత్మికవైన నిన్ను తప్ప వేరే ఉపాయం గానీ, ఉపేయంగానీ (గతి) తెలియనివాడనని (స్తోత్రం చేయ) తలచినవాడను.

**అనితరగతిః :–** బిడ్డకు తల్లి కాక వేరే దిక్కు–చక్కీ ఏముంటుంది? తల్లి సర్వం సహిస్తుంది. ప్రేయోమూర్తి, శ్రేయోమూర్తి మాతయే కదా!

**స్తోతు మాశంసమానః :–** స్తోత్రం చేయడం, స్తోత్రం చేయతలచడం అని రెండు దశలు. చేయకోరినంతలోనే దేవి అనుగ్రహం వల్ల అభీష్టం సిద్ధిస్తుంది. స్తోత్రారంభ సామర్థ్యం కల్గుతుంది.

**"త్వమేవ శ్రీర్మహ్యం బహుముఖయ**
**వాణీ విలసితమ్"** (శ్రీ గుణరత్న కోశం. 8)

శ్రేయోమూర్తి కృప వల్ల సారస్వత విలాసం బహుముఖంగా కలుగుతుందని

శ్రీ పరాశర భట్టర్ స్తుతించారు కదా!

సిద్ధారంభః :- ఆరంభింపబడిన దాన్ని నిర్విఘ్నంగా పూర్తి చేయడమూ సిద్ధిస్తుంది.

**సకల భువన శ్లాఘనీయో భవేయం :-** లక్ష్మీ స్తోత్రాన్ని పండితులూ, పామరులూ చదువుతారు. 'సకల భువన' శబ్దానికి చతుః షష్టి కళలతో కూడిన విద్వజ్జనులని భావం. కళాపూర్ణులైన విపశ్చిద పశ్చిములు కృతులను మెచ్చుకొంటెనే గానీ పురుషార్థం సిద్ధించదు. "ఆ పరితోషాద్విదుషాం నసాధుమన్యే" – అనే కవికుల గురువైన కాళిదాసు మాటకు అర్థమిదే కదా! భగవద్గుణ రూప వైభవాన్ని స్తుతించే కృతి కర్తలను లోకులు బహుధా శ్లాఘిస్తారు. తాను తరించి ఇతరులకు తరించే రేవును చూపేవాడు సామాన్యుడు కాదు, మహనీయుడు. లక్ష్మీదేవిని స్తుతించే వ్యక్తి లక్ష్మీ కటాక్షాన్ని పొందుతాడు. తత్ఫలమిదే.

**"సశ్లాఘ్యః సగుణీ ధన్యః సకులీనః సబుద్ధిమాన్ ।**
**సశూరః సచ విక్రాంతో యం త్వం దేవి । నిరీక్షసే"**

"ఓ దేవీ! నీ చూపు ఎవనిపై ప్రసరిస్తుందో ఆ వ్యక్తియే గుణవంతుడు, ధనవంతుడు, ఉత్తమవంశ సంజాతుడు, బుద్ధిమంతుడు, శూరుడు. అతడే సర్వం ఆక్రమించిన సమ్రాట్టుగా శ్లాఘనీయుడు" అని ఇంద్రుడు 'శ్రీ స్తుతి'ని చేశాడు (వి.పు)

'శ్లాఘనీయుడను కాగలను' అన్న మాటవల్ల, జ్ఞాన వైరాగ్య భూషణులైన వేదాంత దేశికులు ఖ్యాతి లాభ పూజోన్ముఖులయ్యారనిపిస్తుంది. కాని ఆంతర్యమది కాదు. "తనక్కేయాగ ఎనైక్కొళ్ళుమీదే"– నా సేవల వలన కలిగే ఆనందం నాకు కాక మీకే – భగవానునికే చెందాలి సుమా!" అన్న నమ్మాళ్వార్ల సూక్తిలాంటిదీమాట.

స్తుతివల్ల తనకు కలిగిన ఆనందం కంటె, తన పుత్రుని మాటలకు సంతోషించే లోకుల పొగడ్త వల్ల తల్లికి కలిగే ఆనందం అధికం కదా! ఈ లాభమే శ్లాఘనీయమని ప్రతీయమానమవుతున్నది.

**సేవాపేక్షా తవచరణయోః శ్రేయసేకస్యనస్యాత్ :-**

స్వార్థం కాక పరార్థమైన ప్రక్రియ 'సేవ'. వాచికీ, కాయికీ, మానసికీ అనే

మూడు విధాలైన సేవలలో 'స్తోత్రం' వాచికమైన సేవ. "భవేయం" అనే క్రియాపదం 'విధిలిజ్' ఉత్తమ పురుషైకవచనం. లక్ష్మీ స్తుతిని పఠించిన భక్తులు 'స్తుతికర్త'ను లక్ష్మీ భక్తుడు అని పొగడుతారు. 'శ్రీపాద భక్తుడను కావాలి'అని ప్రార్థించడమే పరమపురుషార్థం. భాగవతోత్తములు 'ఇతడు మనవాడు' అని తమ గోష్ఠిలో చేర్చుకొన్నప్పుడు 'భక్తి' సిద్ధిస్తుంది. 'సిద్ధ భక్తు' డవుతాడు.

తత్పాద భక్తి జ్ఞానాభ్యాం ఫలమన్యత్ కదాచన ।

నయాచేత్ వైష్ణవో విష్ణుమ్"– అన్నట్లు, ఐహికా ముష్మిక సుఖాలను కోరకుండా, కేవలం భగవత్పాద కమలాలయందు పరమైకాంత భక్తితో సర్వవిధ కైంకర్యం చేసేవాడను కావాలని ప్రార్థించడం శ్రీ వైష్ణవ లక్షణం.

**కస్య శ్రేయసే నస్యాత్ :–** తెలిసిన దాన్ని యత్నించే ఇచ్ఛ జ్ఞానాంశలలోకెల్ల ముఖ్యమైనది. సేవాపేక్ష అశక్తునికి కూడా శక్తిని ఇచ్చి శ్రేయస్సును కలిగిస్తుంది. అపేక్షతో వాచికమైన భగవత్పాద కైంకర్య రూప ఫలం సిద్ధిస్తుంది; ఎవనికి శ్రేయస్సు కలుగదు? అందరికీ శ్రేయస్సు కలుగుతుంది. సామాన్యం చేత విశేషాన్ని సమర్థించే అర్థాంతరన్యాసాలంకార సజ్జితం ఈ శ్లోకం.

**4.** **యత్సంకల్పాద్భవతి కమలే ! యత్ర దేహిన్యమీషాం**
**జన్మ స్థేమప్రళయ రచనా జంగమా జంగమానామ్ ।**
**తత్కల్యాణం కి మపి యమినా మేక లక్ష్యం సమాధౌ**
**పూర్ణం తేజః స్ఫురతి భవతీ పాదలాక్షారసాంకమ్ ॥**

**అర్థం :–** కమలే = ఓ లక్ష్మీదేవీ ! దేహిని = చరాచర పదార్థాలను తన శరీరముగా కలిగియున్న; యత్ర = దేనియందు; అమీషాం = కనుబడుతున్న ఈ; జంగమ+అజంగమానాం = చర, స్థిర వస్తువుల యొక్క; జన్మ, స్థేమ, ప్రళయ, రచనా= సృష్టి, స్థితి, సంహారాల యొక్క నిర్వహణం; యత్+సంకల్పాత్ = దేని యొక్క ఇచ్ఛామాత్రం వల్ల; భవతి = సంభవిస్తున్నదో; తత్ = అట్టి; కల్యాణం = మంగళరూపమైనట్టి; యమినాం = యోగులకు; సమాధౌ = యోగదశయందు; ఏకలక్ష్యం = ఒకటే సాధింపదగినదై యున్నట్టి; పూర్ణం = అఖండమైనట్టి; కింఅపి=

అనిర్వాచ్యమైనట్టి; తేజః = జ్యోతీ రూపం; భవతీపాదలాక్షారసాంకం; భవతీ = నీ యొక్క; పాద = చరణమందలి; లాక్షారస = పారాణిని; అంకం = గుర్తుగా కలిగినదై; స్ఫురతి = ప్రకాశిస్తున్నది.

**తా॥** ఓ లక్ష్మీదేవీ! చరాచర ప్రపంచం తన దేహంగా కలది బ్రహ్మం. ఆ బ్రహ్మం యొక్క సంకల్పం వల్లనే జంగమ స్థావర పదార్థాలయొక్క సృష్టి, రక్షణ, సంహారం అనే మూడు దశలు నిర్వహింపబడుతున్నాయి. అట్టి మంగళప్రదమైన, యోగులకు ధ్యానమందు ముఖ్యంగా సాధ్యమై అమరియున్న, ఒకానొక పరిపూర్ణమైన జ్యోతీ రూపం నీ కాళ్ళ పారాణినే గుర్తుగా కలిగి శోభిస్తున్నది.

**వ్యాఖ్య :- లక్ష్మీ పాదలాక్షారసాంకితమైనదే పరబ్రహ్మ స్వరూపమని వర్ణితం.**

కమలే :- ఈ సంబోధన, పరబ్రహ్మను చేరి ఆయనకు అలంకారంగా ఉన్న లక్ష్మీదేవి యొక్క వైశిష్ట్యాన్ని తెల్పుతున్నది.

యత్ర దేహిని :- "యస్యా వ్యక్తం శరీరం, యస్య ఆపః శరీరం, యస్య పృథివీ శరీరం, యస్యాత్మా శరీరం"-అని ఉపనిషత్తు (బృహదారణ్యకం), నింగి, నేల, నీరు, గాలి, నిప్పు మొదలైన సర్వ పదార్థాలతో పాటు జీవులూ పరబ్రహ్మకు శరీరాలనీ, ఆయన వాటికి అంతరాత్మయని విశదీకరిస్తున్నది. శరీరాన్ని దానిలో ఉండి నియామకుడైన జీవాత్మను కలిపి, ఇతడు దేవదత్తుడు అనితాదాత్మ్యాన్ని బట్టి వ్యవహరించడం పరిపాటి కదా! అట్లే బ్రహ్మచే వ్యాప్తమై అవిభాజ్యమైన ప్రపంచం కూడా "సర్వం ఖల్విదం బ్రహ్మ" అని ఐక్యంగా చెప్పబడుతున్నది. జగచ్ఛరీరకుడైన పరబ్రహ్మయందు - అని అర్థం.

**యత్సం కల్పాత్ భవతి, అమీషాం జన్మస్థేమ**

**ప్రళయ రచనా జంగమా జంగమానాం:-**

"తదైక్షత, బహుస్యాం ప్రజాయేయ" అనే ఉపనిషద్వాక్యాలు, పరబ్రహ్మ 'నేను అనేక పదార్థాలుగా అవుతాను' అని సంకల్పించుకొన్నాడని వివరిస్తున్నాయి. చిదచిత్తులతో కూడియున్న ఆ పరబ్రహ్మయందే ఆయన ఇచ్ఛచేత జగత్తు యొక్క ఉత్పత్తి, స్థితి, వినాశాలు పర్యవసిస్తున్నాయి.

"యతోవా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి, యత్ప్రయంతి- తత్ బ్రహ్మ" ఎవని నుండి సర్వప్రాణులు పుట్టినాయో, ఎవనిచే జీవిస్తున్నాయో, ఎవని యందు లయ మొందుతున్నవో, ఆయనయే 'పరబ్రహ్మ' అని బ్రహ్మ లక్షణాన్ని తైత్తిరీయోపనిషత్తు (భృగువల్లి) తెల్పుతున్నది. దీన్ని బట్టి వ్యాస భగవానుడు "జన్మాద్యస్య యతః"- (అస్య=ప్రత్యక్షంగా కనబడుతున్న ఈ ప్రపంచానికి; జన్మ+ఆది= సృష్టి స్థితి ప్రళయాలు; యతః = ఎవనివల్ల కలుగుతున్నవో, ఆ సర్వ కారణభూతుడే పరబ్రహ్మమని అర్థం) అనే బ్రహ్మ సూత్రాన్ని రచించాడు.

"తని ముదల్వన్" అని నమ్మాళ్వార్ల శ్రీ సూక్తి. ప్రతి వస్తువుకు మూడు కారణాలు కనబడుతున్నాయి.

1. ప్రతి వస్తువు యొక్క పుట్టుటకు మూలకారణమైన దాన్ని ఉపాదాన కారణమంటారు. అది వివిధ కార్యవస్తు రూపంగా పరిణమిస్తుంది. కుండ, చిప్ప, ఇటుక మొదలైన రూపాలుగా పరిణమించే మట్టి, వాటికి ఉపాదాన కారణమనవచ్చు.

2. మట్టిని తన తెలివిచేత 'కుండ' మొదలైన రూపాలుగా నిర్మించే 'కుమ్మరి' నిమిత్త కారణ మనబడుతాడు. నిమిత్త కారణుడంటే 'కర్త' యైనవాడు.

3. మట్టిని అనేక వస్తు రూపాలుగా మార్చడానికి ఉపకరించే దండం, చక్రం, మొదలైన సాధన సామగ్రి 'సహకారి కారణం' అనబడుతుంది. మట్టి నుంచి ఏర్పడిన వస్తువులు నశించినప్పుడు ఆ మట్టిలోనే కలిసిపోయినట్లు సర్వభూతాలు పరబ్రహ్మలోనే లీనమై పోతాయి. కాబట్టి ఆయన ఉపాదానమని సాధింపబడింది.

ఒక ఘట మేర్పడడానికి లోకంలో ఉపాదాన, నిమిత్త, సహకారి కారణాలు అగుపడుతున్నాయి. కాని దృశ్యమాన సర్వ ప్రపంచానికి మూడు కారణాలు వేర్వేరుగా లేవు.

త్రివిధ కారణాలు 'పరబ్రహ్మ' యే అని వేదాంత శాస్త్రం తెల్పుతున్నది. కాబట్టి, బ్రహ్మం-జగత్తు వేర్వేరు కావు. అంతా బ్రహ్మంలో అంతర్భవించిన పదార్థమే. త్రివిధ కారణమైన బ్రహ్మ మొక్కటే తన సంకల్ప మాత్రాన జగద్రూపంగా పరిణమించడమే 'సృష్టి' అని

"ప్రకృతిశ్చ ప్రతిజ్ఞా, దృష్టాంత, అను పరోధాత్" అనే బ్రహ్మ సూత్రాధికరణం (శ్రీ భాష్యం) స్పష్టపరచింది.

మూలకారణమైన బ్రహ్మం ఏ ధర్మాలు లేని నిర్వి శేష వస్తువు కాదు. అచేతనమైన ప్రకృతినీ, చేతనమైన జీవరాశినీ తనలో సూక్ష్మరూపంగా ఇముడ్చుకొన్న సర్వశక్తి మంతమైన విశిష్ట పదార్థమే పరబ్రహ్మం.

సృష్టికి కారణంగా చెప్పబడిన పరిణామం బ్రహ్మమందు సూక్ష్మంగా లీనమై యున్న ప్రకృతి జీవులకే స్థూల రూపాన భగవత్సంకల్పంచే ఏర్పడినది.

సాలెపురుగు దృష్టాంతాన్ని బట్టి బ్రహ్మంనుంచి చేతనా చేతనాలు బయల్పడి విస్తరించడమే 'సృష్టి' అనీ, మళ్ళీ ఆయనలో ఇమిడి పోవడమే ప్రళయమని శాస్త్రం బోధిస్తున్నది.

ఈ శ్లోకం, శ్రీ భాష్యంలోని "అఖిల భువన జన్మస్థేమ భంగాది లీలే" అనే మంగళ శ్లోకాన్ని స్మరింప జేయడం గమనీయం.

తత్, కల్యాణం :- శరీరానికి నశ్వరాది దోషాలుంటాయి. శరీర గతమైన అమంగళదోషాలు జగచ్ఛరీరియైన పరబ్రహ్మకు అంటవని తచ్ఛబ్దార్థం.

"ఆవిరించా దమంగళమ్"- బ్రహ్మరుద్రాదులు అమంగళులు. కాబట్టి శ్రీమన్నారాయణుడు సర్వశరీరుడైనా, శరీర గత దోషాలంటని కల్యాణ రూపం కలవాడు "కల్యాణం మంగళం శుభమ్"- (అమరం) 'తేజః' పదానికి విశేషణమైనందువల్ల 'కల్యాణం' అనబడింది.

యమినాం ఏకలక్ష్యం సమాధౌ :- సనకాది యోగులు బ్రహ్మమునే ఏకలక్ష్యంగా ధ్యానిస్తారు. "కారణం తుధ్యేయః". జగత్కారణుడైన పరబ్రహ్మయే ధ్యానించదగినవాడు అనేది విధి.

"మా రమా మంగళ దేవతా". (అమరం) మా-లక్ష్మి-తోకూడియున్న వాడు సముడు. (సమే ఆధీయతే ఇతి = సమాధిః). ఇతర విషయాలయందు మనస్సును పోనీయక, శ్రీమన్నారాయణుని ఆకారమందే దృష్టి పెట్టి ఉపాసన చేయడం సమాధి యోగం. దర్శన సమాకారమే ధ్యానం.

పూర్ణం :- అఖండమైనది పరబ్రహ్మ రూపం. లక్ష్మీ నారాయణుల దాంపత్యం అన్యోన్యానుకూలమైనది. "ఏకతత్త్వ మివోదితౌ" అన్నట్లు సతీపతులు ఇద్దరైనా, మణి ప్రభా న్యాయంగా ఒక్కటే తత్త్వం. స్వరూప రూప గుణ విభవైశ్వర్య శీలా ద్యనంత కల్యాణ గుణాలు గల శ్రీదేవికి భర్తయైనందువల్ల శ్రియఃపతియే అవాప్త సమస్తకాముడు. ఆయనకు ఏలోటు లేదు. కాబట్టి పూర్ణతత్వం. శ్రియః పతిత్వమే పరబ్రహ్మతత్త్వం. ధ్యాన యోగ్యమైనది అదే.

కిమపి :- ఇలాంటిది అని చెప్పరానిది.

తేజః :- అఖండమైన దివ్యజ్యోతి. ఆ పరంజ్యోతి "శ్రుతి శిరసి విదీప్తం". అది అప్రమేయం కాబట్టి "పూర్ణం తేజః" అని స్తుతింపబడింది. "అంతర్జ్యోతిః కిమపి యమినామ్" అని 'భగవద్ధ్యాన సోపానం' అనే స్తోత్రాన్ని దేశికుల వారు ఆరంభించారు. యోగి హృద్ధ్యాన గమ్యమైన జ్యోతీ రూపమది.

భవతీ పాదలాక్షారసాంకం :-స్వస్వరూపంతోనే ప్రకాశిస్తూ, ఇతర వస్తువులను ప్రకాశింపజేస్తూ, సకల పురుషార్థాలనూ ప్రదానం చేసే పరంజ్యోతీ రూపాన్ని గుర్తించడానికి శ్రీదేవీ చరణలాక్షారసమే సాధనం.

భవతీ పాద - అనేది సమాస పదం.

("భూ సత్తాయా" మితిధాతోః "లటః శతృశానచౌ" ఇతి శత్రా దేశే "ఉగితశ్చే" తి ఙ్జీపి "భవతీ" ఇతిరూపమ్.)

"భవతీ సంబంధ దృష్ట్యా హరిమ్" (శ్రీ గుణరత్న కోశం.51) అనే వాక్యం రీతిగా, ఈ పదం ప్రయోగింపబడింది.

కలశ జలధియందు ఆవిర్భవించిన వెంటనే స్వయంవర మంగళ విధియందు లాక్షారసార్ద్ర పాదయైన లక్ష్మీదేవి, విష్ణు వక్షః స్థలమందు అధిరోహించి ఆసీనయైనది. ఆ లాక్షారసం ఆర్ద్రంగా ఉన్నందువల్ల 'ఆర్ద్రాం జ్వలంతీం' అని శ్రీ సూక్తం వర్ణించినట్లే, జాజ్వల్య మాన తేజస్సు కలిగిన శ్రీదేవి చరణాలు భగవానుని వక్షః స్థలమందు ముద్రింపబడినాయి. చరణలాక్షా రసాంకితమైన ఆ తేజస్సుచే భగవానుడు "జ్యోతిరి వాధూమకః". అన్నట్లు పొగలేని జ్యోతీ రూపం కలవాడని వర్ణింపబడినాడు. లక్ష్మీ

పద లాక్షైక లాంఛనమే పరత్వ చిహ్నమని వేదాంతులచే నిర్ణయింపబడింది.

స్ఫురతి :- పూర్ణ తేజస్సు ప్రకాశిస్తున్నది. నిరాలంబన యోగం కంటె సాలంబన యోగం ప్రశస్తమైనదనీ, లక్ష్మీతత్త్వం వేదాంత శాస్త్ర ప్రతిపాదితమనీ, పరతత్త్వ నిర్ణయానికి లక్ష్మీ సంబంధమే కారణమని సుశ్లోకితం.

కావ్యలింగాలంకార సజ్జితం.

**5. నిష్ప్రత్యూహ ప్రణయ ఘటితం దేవి! నిత్యానపాయం**
**విష్ణుస్త్వం చేత్యనవధిగుణం ద్వంద్వ మన్యోన్య లక్ష్యమ్ ।**
**శేషశ్చిత్తం విమల మనసాం మౌళయశ్చ శ్రుతీనాం**
**సంపద్యంతే విహరణ విధౌ యస్యశయ్యా విశేషాః ॥**

**అర్థం:-** హే దేవి = ఓ లక్ష్మీ దేవీ! నిష్ప్రత్యూహ ప్రణయ ఘటితం । నిష్ప్రత్యూహ= ఏ ఆటంకం లేని; ప్రణయ = ప్రేమ చేత; ఘటితం = కూర్పబడినట్టి; నిత్య+అనపాయం= ఎప్పుడు ఎడబాటు లేనట్టి; అనవధి గుణం = అంతం లేని గుణాలు కలిగినట్టి; విష్ణుః = భగవానుడు; త్వం, చ = నీవు కూడా; అన్యోన్య లక్ష్యం= ఒకరి కొకరు నిరూపకంగా అమరియున్న; ద్వంద్వం = జంట-మిథునం; ఇతి = అని ఉద్దేశ్యం. యస్య = ఏ జంట-మిథునం-యొక్క; విహరణ విధౌ = విహార వేళయందు; శేషః = ఆది శేషుడు; విమల మనసాం = పరిశుద్ధమైన అంతః కరణం కలిగిన సత్పురుషుల యొక్క; చిత్తం = హృదయం; శ్రుతీనాం = వేదాలయొక్క; మౌళయః, చ = శిరస్సులు కూడా; శయ్యా విశేషాః = శ్రేష్ఠమైన సెజ్జలుగా; సంపద్యంతే= అవుతున్నవో;.

**తా॥** ఓ దేవీ! శ్రీ శ్రియః పతులనబడే మీ ఇద్దరి జంట (ద్వంద్వం) బాధలు లేని ప్రేమచే కూర్పబడినట్టిది. ఏ కాలాననైనా సంశ్లేషించి యుండునట్టిది. అసంఖ్యేయ కల్యాణ గుణాలు కలిగినట్టిది. నీ చేత నీ పతినీ, ఆయన చేత నిన్నూ గుర్తించే లక్షణం కలది.

మీ దాంపత్య విహార వేళల్లో ఆది శేషుడు, యోగుల హృదయం, శ్రుతి శిరస్సులు మీ ప్రణయ మిథున విహారానికి శయ్యాతలాలు అవుతున్నాయి. మీ,

పరస్పర సాదృశ్యం గల ద్వంద్వమే సర్వేశ్వరత్వ చిహ్నంగా విరాజిల్లుతున్నది.

**వ్యాఖ్య :-** లక్ష్మీ విశిష్టుడైన నారాయణుడే సర్వేశ్వరుడని స్థిరీకరించే శ్లోకమిది.

దేవి :- 'దివ్' ధాతువు క్రీడ, ప్రకాశం మొదలైన అర్థాలు కలది. కాబట్టి శ్లోక భావాన్ని సూచించే సంబోధనాంత పదమిది. విహరించే శీలం కలిగిన ఓ లక్ష్మీదేవీ! అని అర్థం. "శ్రద్ధయాదేవో దేవత్వమశ్నుతే"- (శ్రుతి) (శ్రద్ధా = లక్ష్మీదేవి) తన స్వరూప రూప విభవాదులచేత తన భర్తను ప్రకాశింపజేసే లక్ష్మియే దేవి.

**ద్వంద్వం :-** ఆలుమగల జంట. దంపతులలో భిన్నలింగం గల వ్యక్తులు ఇద్దరున్నా, ఏకతుల్యంగా 'మిథునం' అని శాస్త్ర మర్యాద, లోక వ్యవహారమూ ఉంది. (The pair, couple)

**నిష్ప్రత్యూహ ప్రణయ ఘటితం:-** పరస్పర ప్రేమ-స్నేహ సారం ఏకరూపమైన ద్వంద్వమిది. "జరసా యస్మిన్నహార్యోరసః"-(ఉ.రా.చ) ఉత్తమ దంపతుల అన్యోన్యానురాగం ముదిమిలోనూ - వయస్సు గడచిపోయినా, సడలిపోదు కదా! ఇది పరదేవతా ద్వంద్వం. సర్వప్రాణులయందు కూడా సహజమైన, పరిపూర్ణమైన అనురాగం కలది ఈ జంట- "ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే" ఈ దంపతుల ఆనందం వల్లనే కదా సర్వభూతోత్పత్తి జరుగుతున్నది. ఒకరికొకరు ప్రణయ పాత్రులు ఈ దంపతులు. "హృదయంత్వేవజానాతి ప్రీతియోగం పరస్పరమ్." పరస్పర ప్రేమ హృదయానికి మాత్రమే తెలుస్తుంది.

**"అస్యా దేవ్యా మన స్తస్మిన్ తస్యచాస్యాం ప్రతిష్ఠితమ్"**-ఈమె మనస్సు ఆయన యందు, ఆయన మనస్సు కూడా ఈమె యందు సుప్రతిష్ఠితమైనది. కాబట్టి, వీరి దాంపత్య ప్రణయం విఘ్నం, ఆటంకం లేనిది; శాశ్వతమైనది.

నిత్యానపాయం :- నిష్ప్రత్యూహ ప్రణయ ఘటితమైన ద్వంద్వం-మిథునం కాబట్టి ఎడబాటు లేకుండా, ఎల్లప్పుడు అన్యోన్యంగా కలిసి యుంటుంది. **"శ్రియం లోకే దేవజుష్టా ముదారాం".** (శ్రుతి)-ఇక్కడ 'దేవ' శబ్దానికి "దివ్యో దేవ ఏకో నారాయణః"- శ్రుతి రీత్యా, నారాయణుడని అర్థం. "జుష ప్రీతి సేవనయోః" అనే ధాతువు వల్ల, ఉదార దేవతయైన లక్ష్మియందు అత్యంత ప్రీతి కలవాడు 'కమలాక్షుడు'-

అంటే, లక్ష్మీదేవిని చూడకుండా క్షణమైనా ఉండనివాడు నారాయణుడన్నారు ఋషులు.

"నిత్యై వేషా జగన్మాతా విష్ణోః శ్రీ రనపాయినీ"– (వి.పు) సర్వ వ్యాపకుడైన నారాయణునందు లోకమాతయైన లక్ష్మీదేవి విశ్లేషం లేకుండా ఎల్లకాలముంటుంది అన్నాడు పరాశర మహర్షి. "మయా వ్యాప్తా తథాసాఽ పి తయా వ్యాప్తోఽ హమీశ్వరః ." లక్ష్మీ నారాయణులు ఇద్దరు ఒకరినొకరు ఎప్పుడూ విడిచియుండరని భగవచ్ఛాస్త్రం వెల్లడించింది. గాఢోప గూఢత్వం గల ద్వంద్వమిది. "అగల గిల్లేన్ ఇఱైయుమెన్ఱు అలర్మేల్మంగై ఉఱై మార్పా"–క్షణకాలం కూడా నిన్ను ఎడబాయజాలనని కమలవాసినియైన లక్ష్మీదేవి నిత్య నివాసం చేసే వక్షః స్థలం కలవాడు తిరువేంగడ ముడైయాన్ – అని కదా పూర్ణశరణాగతి చేసినారు నమ్మాళ్వార్లు. "భాస్కరేణ ప్రభాయథా"– ప్రభను గల వస్తువు నుంచి ప్రభను విశ్లేషించరానట్లే భగవత్తత్త్వం నుంచి శ్రీ తత్వం విశ్లేషించరానిది. కాబట్టి, అపృథక్ సిద్ధ సంబంధం కల ద్వంద్వమిది.

**విష్ణుః త్వం చ :–** "త్వయాచ విష్ణునాచాంబ ! జగద్వ్యాప్తం" అనే శ్రీ విష్ణు పురాణవాక్యం స్మారితం.

"లక్ష్మీ నారాయణాఖ్యం తత్ పరం బ్రహ్మ సనాతనమ్"–లక్ష్మీ నారాయణులనే దేవతా ద్వంద్వమే పరబ్రహ్మ అని అర్థం. "ఒణ్డొడియాల్ తిరుమగళుమ్ నీయుమే నిలానిఱ్ప" సర్వభూషణ భూషితయైన లక్ష్మీదేవి, (నీవు) భగవానుడు కూడా కలిసియున్న (ద్వంద్వం) మిథునమే సేవింపదగియున్నది అని నమ్మాళ్వార్ల శ్రీసూక్తి. ఒక్క శ్రీరాముణ్ణి కోరి సేవించి శూర్పణఖ చెడిపోయింది. ఒక్క సీతమ్మనే కాంక్షించి రావణుడు చెడిపోయాడు. సీతారాములనిద్దరినీ సేవించి విభీషణుడు సశ్రీకుడయ్యాడు కదా! లక్ష్మీ విశిష్టుడైన నారాయణుడే సర్వేశ్వరుడు.

అనవధి గుణం :– లెక్కింపరాని కల్యాణ గుణాలు కలది పరదేవతా ద్వంద్వం. ఒక్కొక్క గుణమే అంతం లేనిది. శ్రియః పతుల కల్యాణమయమైన, సౌందర్య సౌకుమార్యాది సర్వగుణ శోభితమైన దివ్యావయవ శోభయే పరస్పరం ఆనంద ప్రదమై ఆకర్షకమైనది. వీరి గుణకర్మలనుబట్టి వీరికి అనంత నామాలు ఏర్పడినాయి కదా!

"ఆదరాత్ అలోపః" (బ్ర.సూ) పరబ్రహ్మ స్వరూపానికి చెందిన గుణాలన్నీ

ఆదర పూర్వకంగా ఉపాసింప దగినవే గాని కల్పితాలు కావని వ్యాసోక్తి "యథారత్నాని జలధే రసంఖ్యేయాని పుత్రక! తథా గుణాహ్యనంతస్య అసంఖ్యేయా మహాత్మనః॥" (మత్స్య పురాణం) సముద్రంలో లెక్కింపరాని రత్నాలు ఉన్నట్లే పరమాత్మయందు కూడా ఉన్న గుణాలు అనంతాలే.

**"నహితస్య గుణాః సర్వే సర్వైర్మునిగణైరపి ।**

**వక్తుం శక్యా వియుక్తస్య సత్త్వాద్యై రఖిలైర్గుణైః॥"**

సత్త్వాది ప్రాకృత గుణాలు లేనందువల్ల నిర్గుణ శబ్దవాచ్యుడైన పరమాత్మ యొక్క గుణాలనన్నిటినీ వర్ణించడానికి జ్ఞాన సంపన్నులైన ఋషులందఱూ కలిసి ప్రయత్నించినా, అది సాధ్యం కాదని 'విష్ణు ధర్మ' మందు నిరూపితం.

**"సంఖ్యాతుంనైవ శక్యంతే గుణదోషాశ్చశార్ఙ్గిణః ।**

**అనంత్యాత్ ప్రథమోరాశి రభావాదేవ పశ్చిమః ॥**

శార్ఙ్గ మనే విల్లు గల విష్ణుమూర్తి యొక్క గుణదోషాలు లెక్కింప శక్యం కానివి. గుణాలు అంతం లేనివి, దోషాలు లేనే లేవు. కాబట్టి లెక్కపెట్ట శక్యం కానివని భావం.

భగవతి లక్ష్మీదేవి యొక్క స్వరూప రూప గుణ విభూతులు కూడా భగవానుని లాగా సాధారణమైనవే.

"ప్రశకన బలజ్యోతిర్ జ్ఞానేశ్వరీ విజయ ప్రధా ప్రణతవరణ--- తవ భగవతశ్చైతే సాధారణా గుణరాశయః" (శ్రీ గుణ.ర.కో.32)

ప్రశకన మంటే శక్తి, బలం, తేజస్సు, జ్ఞానం, ఈశ్వరత్వం, జయశీలత్వం, ఆశ్రితులను అంగీకరించడం, ఆశ్రితులయందు ప్రీతి, ఆశ్రితులకు అనిష్ట నివారణం, ఇష్ట ప్రాప్తి అనేవి దివ్యాత్మ స్వరూప గుణాలు.

సౌగంధ్యం, ప్రత్యవయవ సౌందర్యమనబడే కాంతి, సాముదాయిక శోభ అనబడే లావణ్యం, పరప్రకాశకమైన ఔజ్జ్వల్యం, ఇవి దివ్యమంగళ విగ్రహ గుణాలు.

ఈ బాహ్యాంతర గుణాలు శ్రీ శ్రియఃపతులకు సమానంగా ఉన్నాయి.

"యథా సర్వగతో విష్ణుః తథైవేయం ద్విజోత్తమ"- (వి.పు) "గుణతశ్చ

స్వరూపేణ వ్యాప్తిః సాధారణీ మతా । యథామయా జగద్వ్యాప్తం స్వరూపేణ స్వభావతః . తయావ్యాప్తం తథా సర్వం నియంత్రీచ తథేశ్వరీ । మయా వ్యాప్తా తథాసాపి తయావ్యాప్తో ౽ మామీశ్వరః ॥ ఇలాగా తుల్యశీల వయోవృత్తాలు గలవారు పరదేవతా దంపతులు అని భగవచ్ఛాస్త్రం వివరిస్తున్నది.

**అన్యోన్య లక్ష్యం :-** పరతత్త్వ వైభవం కలిగిన శ్రీ శ్రియః పతుల జంట ఒకరినొకరు చూస్తూ జగద్వ్యాపారాన్ని నిర్వహిస్తుంటారు.

"యద్భ్రూ భంగాః ప్రమాణం స్థిరచర రచనా తారతమ్యే మురారేః" (శ్రీ గుణర.కో.4)

ఆయా జీవుల కర్మలకు ప్రేరకాలైన లక్ష్మీదేవి యొక్క భ్రూభంగం- కనుబొమల కదలికను చూచి లక్ష్మీపతి జగత్తును సృష్టిస్తాడు. సృష్టిలో తారతమ్యానికి శ్రీదేవీ భ్రూభంగమే ప్రమాణం.

జగత్కర్తృత్వం శ్రీపతి దైతే, అనుమంతృత్వమూ, తన చూపులతో ఆమోదించడమూ లక్ష్మీదేవిది. అలాగే ప్రధానంగా రక్షకత్వం పరమాత్మకు సంబంధించింది. అయినా శ్రీదేవితో కలిసియున్నందువల్లనే శ్రీ పతికి రక్షకత్వ పూర్తి కలుగుతుంది. ఇందుకు "లక్ష్మ్యా సహ హృషీకేశోదేవ్యా కారుణ్య రూపయా । రక్షకః సర్వ సిద్ధాంతే వేదాంతేషుచ గీయతే ॥" (దయా రూపిణియైన లక్ష్మీదేవితో కూడియున్న హృషీకేశుడు రక్షకుడని సకల సిద్ధాంతాలు, వేదాంతాలు కీర్తిస్తున్నాయి) అనే శ్లోకమే ప్రమాణం.

సర్వేశ్వరుడు శరణాగతులను రక్షించే విధంగా సాధువాదాలను పలికే ఘటకురాలు కాబట్టి లక్ష్మీదేవి పురుషకారిణి- "లక్ష్మీ పురుషకారత్వేన నిర్దిష్టా".

లక్ష్మీదేవికి ఇష్టమైనదే లక్ష్మీపతికి ప్రియంగా ఉంటుంది. లక్ష్మీదేవిని సంతోష పరచడానికే సృష్ట్యాది క్రీడ. "అస్య రసదాస్యాదైకరస్యాత్తయా"-అని శ్రీ కూరేశులు శ్రీదేవిని (శ్రీస్తుతి.1) స్తుతించారు కదా!

"ఐకరస్యజుషోః శేషిదంపత్యోః" అన్నారు శ్రీ దేశికులు.

భగవానుడు, తాను చేసిన సృష్ట్యాదికార్యాలను భగవతి లక్ష్మీదేవి తన

చూపులతో ఆమోదించగా కృత కృత్యుడైనట్లు, ఆనందిస్తాడు. పరస్పరం శ్రీత్వం కల ద్వంద్వమిది. "శ్రియః శ్రీశ్చభవేదగ్ర్యా" శ్రీరాముడు సూర్యునికి ఆరాధనీయుడు, లక్ష్మికి లక్ష్మిలాంటివాడు అని సుమిత్ర రాముని పరత్వాన్ని కౌసల్యకు వివరించింది కదా!

"కః శ్రీః శ్రియః"– (స్తోత్ర రత్నం) లక్ష్మికి లక్ష్మి అంటే మహత్వాన్ని కల్పించినవాడు భగవానుడు. శ్రీదేవికి ఈశుడు అనీ, శ్రీదేవియే ఈశురాలుగా కలవాడని అర్థద్వయమున్న 'శ్రీశ' శబ్దం గమనార్హం. "పుం ప్రధానేశ్వరేశ్వరీ"– పురుష ప్రాధాన్యాన్ని బట్టి విష్ణుమూర్తి ఈశ్వరుడు. ఆయనను ప్రేమతో వశపరచుకొన్నందువల్ల ఆమె ఆయనకు కూడా ఈశ్వరి అని ఆగమశాస్త్రం తెల్పుతుంది. ఇలా ఉభయులకు పరస్పరం ఈశ్వరత్వమూ కల ద్వంద్వం. 'శ్రియఃపతి' యని ఆయనకు, విష్ణుపత్ని యని ఈమెకు వ్యవహార ప్రాచుర్యమున్నది. ఇలా అన్యోన్య స్వరూప నిరూపణీయమైన ద్వంద్వమిది.

**"మమ లక్ష్మాశ్చ సేనేశ! వైలక్షణ్యమిదం శ్రుణు ।**
**మచ్ఛేష భూతా సర్వేషా మీశ్వరీ వల్ల భామమ ।**
**తస్యాశ్చ జగతశ్చాహమీశ్వరో వేద విశ్రుతః ।**
**తస్యా మమచ శేషం హి విభూతి రుభయాత్మికా ॥"**

(ఓ విష్వక్సేనా! నాకూ, లక్ష్మికీ వైలక్షణ్యం (భేదం) వినుమన్నాడు శ్రీపతి. ప్రేమతో నన్ను ఆశ్రయించి సకల సేవలు చేస్తున్న లక్ష్మి నాకు శేషభూత. నా ప్రియురాలు కాబట్టి లక్ష్మి లోకులందరికి సేవించదగిన ప్రభ్వి. నిస్సమాభ్యధికుడు భగవానుడని వేదం ప్రతిపాదిస్తున్నది. అందువల్ల, లక్ష్మికీ, చరాచర జగత్తుకూ నేను ప్రభువును. నాకూ, ఆమెకూ నిత్యవిభూతి లీలా విభూతి–రెండూ– శేష భూతమైనవి కదా!) ఈ ప్రమాణం వల్ల, 'ఉభయాధిష్ఠానంచైకం శేషిత్వం' అంటారు. సర్వలోక శేషిత్వం లక్ష్మీనారాయణులనబడే పరదేవతా ద్వంద్వమందే పర్యాప్తం అని భగవచ్ఛాస్త్రం విశదపరచింది.

**సంపద్యంతే విహరణ విధౌ యస్యశయ్యా విశేషాః :-**

శ్రీ శ్రియఃపతులు అధిక ప్రేమతో విహరించే సమయంలో (శేషః) ఆది

శేషుడు సువాసనతో కూడిన తెల్లని, చల్లని, ఎత్తుగా ఉన్న మెత్తని సెజ్జగా ఉంటాడు. "ఫణి పతిః శయ్యాసనం" అన్నారు కదా శ్రీయామున మునులు.

**చిత్తం విమల మనసాం :-** నిర్మల మనస్కులైన సనక సనందాది యోగుల హృదయమూ ఈ దంపతులకు సుఖశయ్యాస్థానం. యోగులు లక్ష్మీవిశిష్టుడైన నారాయణున్ని తమ హృదయమందు ధ్యానిస్తారని భావం.

**మౌళయశ్చ శ్రుతీనాం :-** శ్రుతికాంతల శిరస్సులు కూడా ఈ దివ్య దంపతులకు శయ్యా స్థలాలు. ఉపనిషత్తులు శ్రీమన్నారాయణ తత్త్వాన్నే విశదంగా ప్రతిపాదిస్తున్నాయని సారాంశం. ధరాతలానికి ఆధారభూతుడైన శేషుడు పురుషుడు, చిత్తం నపుంసకం, శ్రుతులు స్త్రీలు. ధరాతలంనుంచి హృదయానికి, అక్కడి నుంచి శిరస్సు వరకు విహరణ క్రమం రసఘనమే కదా! జగత్కారణుడైన శ్రియఃపతికి ఎంత మహత్త్వమున్నదో, విష్ణుపత్నికి కూడా అంత మహత్త్వమున్నదని సుశ్లోకితం.

**6.** **ఉద్దేశ్యత్వం జనని! భవతోరుజ్ఝితోపాధి గంధం**
**ప్రత్యగ్రూపే హవిషి యువయోరేక శేషిత్వ యోగాత్ ।**
**పద్మే! పత్యుస్తవచ నిగమైర్నిత్యమన్విష్య మాణో**
**నా వచ్ఛేదం భజతి మహిమానర్తయన్మానసం నః ॥**

**అర్థం :-** హే జనని = ఓ తల్లీ! పద్మే = ఓ మహాలక్ష్మీ! ప్రత్యక్రూపే = (మాకు) ఆత్మ రూపమైన; హవిషి = హవిస్సునందు; ఉజ్ఝిత+ఉపాధిగంధం = కారణాంతరం లేకుండా స్వభావ సిద్ధమైన; ఉద్దేశ్యత్వం = ఉద్దేశింపబడిన దేవత యొక్క భావాన్ని; భజతోః = పొందుతున్న; యువయోః = మీ యిద్దరికి; ఏక శేషిత్వ యోగాత్= ఒక్క యజమానునికే సంబంధించినదవడం వల్ల; పత్యుః = (నీ) భర్త యొక్క; చ = మరియు; తవ = నీ యొక్క; మహిమా=గొప్పతనం; నిగమైః = వేదాలచేత; నిత్యం=ఎల్లప్పుడు; అన్విష్యమాణః = వెదుకబడుతున్నదై; నః = మా యొక్క; మానసం= మనస్సు; నర్తయన్ = ఆడుతూ; అవచ్ఛేదం = పరిమాణాన్ని; న,భజతి = పొందడం లేదు.

**తా॥** జననీ! ఓ లక్ష్మీదేవీ! మా ఆత్మ రూపమైన హవిస్సును సమర్పించే

యాగమందు ఉద్దేశ్యులైన దేవతలు మీరిద్దరే.

లక్ష్మీ నారాయణులనబడే మీ ఇద్దరియందున్న ఉద్దేశ్యత్వం ఔపాధికం కాదు. స్వభావ సిద్ధమైనది. శేషులైన ఆత్మలకు మీ ఇద్దరి యందే శేషిత్వం విశ్రాంతిని పొందినది. వేదాలు నీ యొక్క నీ భర్త యొక్క మహిమ(ల)ను నిత్యమూ వెదకుతున్నవి. కాని మీ యిద్దరి మహిమ మా మనస్సును నర్తింప చేస్తూ, ఇది ఇట్టిదని పరిచ్ఛేదింప రానిదై ఉన్నది.

**వ్యాఖ్య:**– లక్ష్మీ నారాయణులిర్వురికి ఏకశేషిత్వం కలిగిన నియతిని వర్ణించే శ్లోకమిది.

**హేజనని :**– ఓ తల్లీ అని అర్థం. మనచేత ఆశ్రయింపబడే శ్రీ శ్రియః పతులలో సులభంగా ఆశ్రయణ స్వభావం గల శ్రీదేవియే మాత. చాలాకాలం నుంచి అవిధేయుడైన పుత్రుడు ఒకప్పుడు తల్లిని ఉద్దేశించి నమస్కరించెనేని తత్క్షణమే ఆమె దానిని ప్రతి గ్రహిస్తుంది. కాదనదు. ఇంతవరకు అసత్కల్పుడు– లేనివానితో సమానుడుగా– ఉన్న పుత్రుని యొక్క ఉద్దేశంచేత, అతనిని ఇప్పుడు పుట్టినట్లే అంగీకరించే సులభురాలు శ్రీదేవి. ఆశ్రయణ సౌలభ్యానికి మాతృత్వం హేతువు. మన పుత్రుడు మనలను ఉద్దేశించి 'తవాస్మీతిచయాచతే'– 'నేను నీవాడను, నన్ను రక్షించే భారం నీదే' అని శరణాగతి చేశాడు. అతని భరన్యాసాన్ని స్వామిచే అంగీకరింపజేసే ఘటకురాలు. కాబట్టి, లక్ష్మీదేవి 'జనని' గా సంబోధింపబడినది.

పద్మే:– ఓ లక్ష్మీదేవీ! అని మరొక సంబోధన. "లక్ష్మీః, పద్మాలయా, పద్మా".(అమరం). 'పద్మ' శబ్దానికి 'నిధి' అనే అర్థమూ ఉంది. "మహా పద్మశ్చ పద్మశ్చ" (అమరం) "గుహాయాం నిహితః" శ్రుతి 'నిధి గుహలో ఉంటుం'దన్నది. నిధిలాగా హృదయ గుహలో నిక్షిప్తమైనందువల్ల ఆమె మహిమ వాక్కులకూ, మనస్సుకూ గోచరం కానిదని ద్యోతకమవుతున్నది.

ఉద్దేశ్యత్వం :– "యస్మై దేవతాయై హవిర్గృహీతంస్యాత్తాం మనసా ధ్యాయేత్ వషట్కరిష్యన్" అని సంస్కృత వ్యాఖ్య.

ఏ దేవతను గూర్చి– ఉద్దేశించి– హవిస్సును సమర్పిస్తామో ఆహవిస్సుకు ఆ దేవత 'ఉద్దేశ్యం' అనబడుతుంది. దేవతోద్దేశ్యకమైన ద్రవ్యత్యాగమే 'యాగం'

అనబడుతుంది. ఉద్దేశించబడిన దేవత యొక్క భావం ఉద్దేశ్యత్వం.

ఉజితోపాధిగంధం :- యజ్ఞమందు 'ఇంద్రాయ స్వాహా, అగ్నయే స్వాహా' అని ఇంద్రాగ్ని దేవతలను గూర్చిన ఉద్దేశ్యత్వం సోపాధికం. ఇంద్రాది దేవతలకు భగవంతుని శరీరత్వమనే ఉపాధిచేత సమర్పించబడే హవిస్సు యొక్క ఉద్దేశ్యత్వ రూపమైన దేవతా భావం ఉంటుంది. ఆ దేవతలకు అంతరాత్మయైన భగవానుడు వారి ద్వారా యాగఫలాన్ని అందజేస్తాడు. కాబట్టి ఇతర దేవతలను గురించిన ఉద్దేశ్యత్వం సోపాధికం, సద్వారకం. కాని, శ్రియఃపతిని గురించిన ఉద్దేశ్యత్వం ఉపాధి గంధరహితమైనది. సాక్షాత్తుగా భగవానుడే హవిర్భోక్త కాబట్టి శ్రియఃపతియందున్న ఉద్దేశ్యత్వం అద్వారకం, స్వాభావికం. ఇది శాశ్వతమైనది.

**ప్రత్యగ్రూపే హవిషి యువయోః ఏకశేషిత్వ యోగాత్ :-** ఆత్మ హవిస్సమర్పణ మనేది ఒక యజ్ఞంలో ఉద్దేశ్యులైన దేవతలు శ్రీ శ్రియఃపతులు. ఆత్మ సమర్పణమనే యాగం సర్వశ్రేష్ఠమైనది. దీన్నే న్యాసమనీ శరణాగతి అనీ పేర్కొంటారు.

"సన్న్యాసస్త్యాగ ఇత్యాహుః శరణాగతిరిత్యపి" అని భగవచ్ఛాస్త్రం బోధిస్తుంది.

"న్యాస మేషాం తపసా మతిరిక్తమాహుః"-

సత్య ధర్మదానాది తపస్సులలో కెల్ల న్యాస మనబడే ఆత్మ సమర్పణయాగం ఉత్కృష్టమైనదని నారాయణోపనిషత్తు తెల్పుతున్నది.

ఈ యాగమందు సమర్పింపబడే ద్రవ్యం-హవిస్సు-జీవాత్మ. హవిస్సుకు లక్ష్మీదేవితో కూడిన నారాయణుడే ఉద్దేశ్యం. అంటే, దివ్యదంపతులు ఇద్దరికీ ఉద్దేశ్యత్వం కలదు.

యజమానునికి సేవచేసే వ్యక్తిని కింకరుడంటారు. కింకరుడు చేసే పనికి కైంకర్యమని పేరు. కైంకర్యం చేసే సేవకుడు 'శేషుడు' అనబడుతాడు. ఆ కైంకర్యాన్ని అవధరించే యజమానుణ్ని 'శేషి' అని వ్యవహరిస్తారు. 'శేషి' గా ఉండే వ్యక్తియొక్క భావం-ధర్మం-శేషిత్వమనబడుతుంది. శేషభూతులమైన మనం చేసే భగవత్కైంకర్యమందు శ్రీ శ్రియఃపతులిద్దరూ మనకు ఉద్దేశ్యమవుతారు. అయితే, నారాయణుడు ఒక 'శేషి' గానూ, లక్ష్మీదేవి వేరొక 'శేషిణి'గానూ ఉంటారని

భావించరాదు. ఉభయులు చేరి ఒకే 'శేషి'గా ఉండడం స్వాభావికం, వేదాంతశాస్త్ర సమ్మతం.

**"అనన్య సాధారణ మీశితృత్వం**
**శ్రీశ్రీ శయోర్ద్వాచ సదైక శేషీ ॥"**

అని 'అహిర్బుధ్న్య సంహిత' నొక్కి చెబుతుంది. "ఉభయాధిష్ఠానం చైక శేషిత్వం" అంటే, శ్రీ శ్రియఃపతులనబడే మిథునమందు జగదీశ్వరత్వమూ, ఏకశేషిత్వమూ అధిష్ఠించి యున్నదని తాత్పర్యం.

**పత్యుస్తవచ మహిమా:**– ఓ లక్ష్మీదేవీ! నీ భర్త యొక్క మహిమ, నీ యొక్క మహిమ అపరిమితమైనదని స్తుతించారు నిగమాన్త దేశికులు.

"యువత్వా దౌతుల్యేఽపి" (శ్రీగుణరత్న కోశం.34) శ్రీ శ్రియః పతుల స్త్రీ పురుష లింగ భేదాన్ని బట్టి వారి స్వరూప రూప భేదాలను తెలియజేసే గుణాలను శ్రీ పరాశరభట్టర్ వర్ణించారు. ఆభేదం కూడా వారిద్దరి అవయవ సౌభాగ్యాది రూప గుణాలను అనుభవించడానికి ప్రదర్శించారు. కాని, వారిద్దరి గుణాలు–శీల వయో వృత్తాదులు– సమానమైనవి కాబట్టి వారి మహిమ వేర్వేరుగా నిర్దేశించి చెప్పరానిది. ఆ దివ్య మిథునం యొక్క మాహాత్మ్యం అపరిచ్ఛేద్యమే. అంతేకాదు, శ్రియఃపతి యొక్క స్వరూప స్వభావ వైభవాలను నిర్ణయించేది శ్రీదేవియే.

"తదంతర్భావాత్ త్వాం న పృథగభిధత్తే శ్రుతిరపి" (శ్రీ గుణ.28) భగవానుని పరతత్త్వ తా నిర్ణయకోటిలో లక్ష్మీదేవి అంతర్భాగమై ఉన్నందువల్ల, వేదం కూడా ఆమెను భగవానుని కంటె వేరుగా చెప్పలేదు.

"వసురణ్యో విభూరసి" అనే ప్రత్యగాత్మహవిః సమర్పణ మనబడే ప్రపదన కరణ భూత మంత్రం వసూపలక్షిత సర్వదేవతోపాస్యుడు శ్రియఃపతియే అని ప్రకాశింపజేసింది. ఆపైన "ఓ మిత్యాత్మానం యుంజీత"–అని భగవచ్ఛేషత్వాన్ని ప్రతిపాదించే 'ఓమ్' అనే మంత్రవిధి చేత ముముక్షువులు ఆత్మ సమర్పణం చేయాలని యాజ్ఞిక్యుపనిషత్తు బోధిస్తున్నది. ఓంకారంలోనే లక్ష్మి ఉన్నది.

"తస్య వాచకః ప్రణవః"– భగవద్వాచకమే ప్రణవం, అంటే 'ఓమ్' అని

అర్థం. "ప్రణవాద్యాస్తథా వేదాః ప్రణవే పర్యవస్థితాః । వాఙ్మయం ప్రణవం సర్వం తస్మాత్ప్రణవమభ్యసేత్ ॥

వేదాలు ప్రణవాన్ని మొదట కల్గి ఉన్నాయి. ప్రణవంలోనే లీనమయ్యేవి. వాఙ్మయమంతా ప్రణవ స్వరూపమే. కాబట్టి ప్రణవాన్ని అభ్యసించాలి. "ఓంకార ప్రభవా వేదాః ఓంకార ప్రభవాః స్వరాః । ఓంకార ప్రభవం సర్వం జగత్ స్థావర జంగమమ్ ॥" ఓంకారం నుంచి వేదాలూ స్వరాలూ, చరాచర ప్రపంచమూ పుట్టాయి! "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ". 'ఓమ్' అనేది ఒకే అక్షరమైననూ, సంహితాకారంకానప్పుడు అ, ఉ, మ అనే మూడు వర్ణాలను కలిగి ఉన్నది. "అ ఇతి భగవతో నారాయణస్య ప్రథమాభిధానమ్". అకారం సర్వరక్షకుడూ, సర్వశేషి, సర్వశరణ్యుడైన పరమాత్మ నారాయణునికి వాచకమని మహాభాష్యకారుడైన పతంజలి సూక్తి.

"అక్షరాణాం అకారోఽస్మి"- అని గీతాచార్యసూక్తి. 'తస్య ప్రకృతిలీనస్యయః పరః స మహేశ్వరః" అనే శ్రుతి 'సర్వస్య వేదజాతస్య ప్రకృతిః ప్రణవః, ప్రణవస్యచ ప్రకృతిః అకారః; ప్రణవ వికారో వేదః స్వప్రకృతి భూత ప్రణవేలీనః । ప్రణవోఽపి అకార వికార భూతః స్వప్రకృతౌ అకారేలీనః, తస్య ప్రణవ ప్రకృతి భూతస్య అకారస్య యః పరః ప్రణవ ప్రకృతి భూతస్య అకారస్య యః పరః వాచ్యః, స మహేశ్వరః" అని భగవద్రామానుజులు తమ 'వేదార్థ సంగ్రహం' లో వివరించారు.

సమస్త వేద సమూహానికి ప్రకృతి ప్రణవం. ప్రణవానికి ప్రకృతి అకారం. ప్రణవ వికారమైన వేదం తన ప్రకృతియైన ప్రణవంలో లీనమవుతుంది. ప్రణవం కూడా అకారం యొక్క వికృతియైనందువల్ల అకారంలో లీనమవుతుంది. ఇట్టి ప్రణవానికి ప్రకృతియైన అకారానికి వాచ్యుడైనవాడే సర్వేశ్వరుడు అని అర్థం.

ప్రణవానికి ప్రకృతియైన 'అ' అనే పదం "అవ-రక్షణే" అనే రక్షణార్థక ధాతువు నుంచి నిష్పన్నం. కాబట్టి రక్షకుడు అకార నిర్దిష్టుడైన శ్రియఃపతియే, అని అర్థం స్పష్టం.

సర్వ రక్షకుడైన పరమాత్మ లక్ష్మీ విశిష్టుడు. "లక్ష్మ్యాసహ హృషీకేశో దేవ్యా కారుణ్య రూపయా । రక్షకస్సర్వ సిద్ధాంతే వేదాంతేషు చ గీయతే ॥" దయా రూపిణియైన

లక్ష్మీదేవితో కూడియున్న హృషీకేశుడు రక్షకుడుగా సర్వసిద్ధాంతాల్లోనూ, ఉపనిషత్తుల్లోనూ కీర్తింపబడుతున్నాడు. లక్ష్మీ విశిష్టుడైన నారాయణునికే రక్షకత్వ పూర్తి కలుగుతుంది కాబట్టి అకారంలోనే లక్ష్మీ నారాయణులిద్దరూ ఉద్దేశ్యులు కదా!

ఈ, అకారం చతుర్థీ విభక్తి యొక్క అర్థంతో పదమే.

'అష్టాక్షరి'లోని ప్రణవార్థాన్ని ప్రణవ శేషం వివరిస్తుంది. అందు నారాయణ శబ్దానికి 'ఆయ'- చతుర్థీ విభక్తి చేరినట్లే, అకారం మీద కూడా చతుర్థీ విభక్తి చేరి ఉంది. అయితే వ్యాకరణ శాస్త్ర రీతిగా - "అవతేష్టిలోపశ్చ" "సుపాంసులుక్" అనే సూత్రాలవల్ల చతుర్థీ విభక్తి లోపించడంవల్ల 'అ' అనే రూపమే మిగిలి ఉంది. అకారార్థమైన శ్రియఃపతి కోసమే మకార వాచ్యుడైన జీవుడు దాసుడు, అని ప్రణవంలో అనుష్ఠించదగిన అర్థం ఉంది.

'అకారేణోచ్యతే విష్ణుః సర్వలోకేశ్వరో హరిః । ఉద్ధృతా విష్ణునా లక్ష్మీ ఉకారేణోచ్యతే తథా । మకారస్తు తయోర్దాసః, ఇతి ప్రణవలక్షణమ్ ॥'

మధ్యస్థమైన ఉకారం లక్ష్మీ వైభవాన్ని ప్రకటిస్తున్నది. శాబ్దికంగా చూస్తే కూడా స్పష్టమవుతుంది. అ+ఉ కలిస్తేనే (సంధ్యచ్చు) 'ఓ' అవుతుంది. "జాయాపత్యో రవి భాగః" అనే ఆపస్తంబీయ సూత్ర ప్రకారం దంపతులకు వేర్వేరు లేదు. వారిద్దరైనా ఒకటిగానే ఉంటారనే అర్థాన్ని ఓకారం తెల్పుతుంది కదా!

"అకారశ్చిత్ స్వరూపస్య విష్ణోర్వాచక ఇష్యతే । ఉకారశ్చిత్స్వ రూపాయాః శ్రియో వాచితథా విదుః । మకారస్తుతయోర్దాస ఇతి ప్రణవ లక్షణమ్ ॥" ఈ శ్లోకంవల్ల శ్రీ శ్రియః పతులిద్దరూ చిత్సురూపులని స్పష్టమవుతున్నది కదా! మకారం శేషభూత జీవాత్మకు సంకేతం. "మన-జ్ఞానే", "మను అవబోధనే" అనే ధాతువుల నుంచి నిష్పన్నమయిన 'మకారం' జీవవాచకం. కకారం నుంచి మకారం ఇరవై అయిదవ అక్షరం. ఇరవైనాల్గు తత్త్వాలున్న ప్రకృతి కంటె పరమైన 'జీవవర్గం' ది ఇరవై అయిదవ తత్త్వం.

లక్ష్మీదేవి జీవులందరికి 'జనని'.జగన్మాతృత్వ రూప సంబంధాన్ని బట్టి ఆమె తన పురుషకారం చేత జీవులను రక్షిస్తుంది. జ్ఞాన గుణకుడైన జీవునికి సంకేతంగా

ఉన్న మకారం చేత లక్ష్మీదేవి జీవకోటిలోనికీ అంతర్భవిస్తుంది. ప్రణవంలోని అకార,ఉకార, మకారాలు మూడు లక్ష్మీ వైభవాన్ని ప్రకటిస్తాయి. ప్రణవం సమగ్రంగా శ్రీమన్నారాయణ వైభవాన్ని వెల్లడిస్తుంది.

"తిరుమాలే! నాన్ ఉనక్కుప.ళ.వడియేన్"

భగవన్! నేను నీకు అనాదిగా శేషభూతుడను అని నమ్మాళ్వార్ల శ్రీ సూక్తి. భగవతికి కూడా దాసుడననే అర్థమూ ఉంది. ఓంకారార్థాన్ని 'షట్పదోఽయం ద్విఖండః 'అనబడే ద్వయమంత్రంలో పూర్వవాక్యం విశదీకరిస్తుంది. ఇలాగా, ఉద్దేశ్యత్వమూ, ఏకశేషిత్వమూ, జగదీశ్వరత్వమూ దివ్యదంపతులిద్దరికీ సాధారణం. వారి మహిమ మాత్రం ఎనలేనిది, ఎన్నరానిది.

**నిగమైః నిత్యమన్విష్యమాణః :–**

నిగమాలు అంటే వేదాలు నిత్య–శాశ్వతమైనవి. "సోఽన్వేష్ట వ్యః; స విజిజ్ఞాసితవ్యః". భగవానుడు వెదుక దగినవాడు; అతడు బాగా తెలియదగిన వాడు, అని వేదాలు ఎల్లప్పుడూ చెబుతుంటాయి. భగవంతుడు తెలియబడినాడు; పొందబడినాడు అని మాత్రం వేదాలచేత చెప్పబడలేదు.

**నావచ్ఛేదం భజతి మహిమా :–** శ్రీ శ్రియః పతుల మహిమ అపరిమితమైనది కాబట్టి అది 'ఇంతటిది' అని కొలువ రానిది. నిగమాలు నిత్యాలు. "యతోవాచో నివర్తంతే, అప్రాప్యమనసా సహ" (ఆనందవల్లి) వేదాలు ఇప్పటికీ పరబ్రహ్మనూ, బ్రహ్మానందాన్నీ తెలుసుకోవడానికి అన్వేషిస్తున్నాయి. కాని మాటలకు అందక, మనస్సుకు కూడా గోచరించనందువల్ల అవి వెనుదిరుగుతున్నాయి.

**నర్తయన్ మానసంనః :–**

మహిమ నిగమాలకూ దుర్లభమైనది, ఇంకా అవి అన్వేషించి తెలుసుకోదగినదే. తనకు మాత్రం ఉద్దేశ్యులైనా ఆశ్చర్యంతో స్మరిస్తున్న కొలది, అపారమైన శ్రీ శ్రియఃపతుల మహిమ నిగమాన్త దేశికుల మనస్సును నర్తింప జేస్తున్నది. శ్రీమన్నారాయణ మహిమ అద్భుతం, అపరిచ్ఛేద్యం కదా! అంటూ ప్రపన్నులు ఆనంద పరవశులవుతారని సారార్థం.

7. పశ్యంతీషు శ్రుతిషు పరితః సూరిబృన్దేనసార్ధం
మధ్యేకృత్య త్రిగుణఫలకం నిర్మితస్థాన భేదమ్ ।
విశ్వాధీశప్రణయిని! సదా విభ్రమద్యూత వృత్తౌ
బ్రహ్మేశాద్యా దధతియువయో రక్షశార ప్రచారమ్ ॥

**అర్థం :-** హే విశ్వాధీశ ప్రణయిని = జగన్నాథుని ప్రేయసివైన ఓ మహాలక్ష్మీ! శ్రుతిషు = వేదాలు; సూరి బృందేన సార్ధం = నిత్యసూరుల సమూహంతో కూడ; పరితః = పలుదిక్కుల నుంచి-అంతట; పశ్యంతీషు (సతీషు) చూస్తుండగా; నిర్మిత స్థాన భేదం = నిర్మింపబడిన ప్రదేశాలు-గదులు-కలిగియున్న; త్రిగుణ ఫలకం= మూడు గుణాలు కలిగిన ప్రకృతి అనే పలకను; యువయోః = నీ పతి, నీవు-మీ ఇద్దరి యొక్క ; మధ్యేకృత్య = నడుమ ఉంచుకొని; సదా = ఎల్లప్పుడు; విభ్రమ ద్యూత వృత్తౌ = విలాసంగా ఆడుతుండే జూద వ్యాపారమందు. బ్రహ్మ+ఈశ+ ఆద్యాః = చతుర్ముఖుడైన బ్రహ్మ, పంచాననుడైన శివుడు మొదలైన వారు; అక్ష, శార ప్రచారం = పాచికలను అనుసరించి, కాయలు త్రిప్పబడే విధానాన్ని; దధతి = వహిస్తున్నారు.

**తా॥** విశ్వాధిపతియైన విష్ణుమూర్తికి పత్నివైన ఓ లక్ష్మీ దేవీ! శ్రుతులు నిత్యసూరుల గుంపుతో పాటు పలువైపుల నుంచి చూస్తుంటే, పలు ప్రదేశాలు-గదులు నిర్మింపబడియున్న త్రిగుణాత్మక ప్రకృతి అనే ఆట పలకను దివ్యదంపతులైన మీ యిద్దరి నడుమ ఉంచుకొని వేడుకగా జూద మాడుతున్నారు. మీరు నిరంతరంగా ఆడే ఈ జూదమందు బ్రహ్మేశానాది చేతనులు, పాచికలకు సంబంధించి ఆయా స్థానాలలో త్రిప్పబడే పావులు-కాయలుగా ఉపయోగింపబడుతున్నారు.

**వ్యాఖ్య:-శ్రీ శ్రియః పతులిర్వురు ఐకరస్యంగా నిర్వహించే విశ్వసృష్ట్యాది లీల, వారికి విలాసార్థమైన క్రీడగా చమత్కరించే శ్లోకం.**

**విశ్వాధీశ ప్రణయిని :-** శ్రీ పరాశరభట్టర్ "తత్తే శ్రీరంగరాజ ప్రణయిని" (శ్రీ గుణర.కో.16) అని స్తుతించారు. ఈ స్తుతి మాత్రం అర్చా విశేష విషయం కలది కాదు. సామాన్యంగా శ్రీదేవీ విషయకమైన స్తుతి కదా!

విశ్వ సృష్టి స్థిత్యాది ప్రస్తావం వల్ల 'విశ్వ' శబ్దం, దానికి 'అధీశ' శబ్దమూ ప్రయోగింపబడింది.

**"వేశనా ద్విశ్వమిత్యాహుః లోకానాం కాశిసత్తమ ।**

**లోకాంశ్చ విశ్వమేవేతి ప్రవదన్తి నరాధిప ॥"**

(భారతం-మోక్షధర్మం)

విశ్వ శబ్దానికి అన్ని రకాలుగా నిండుతనంగల పరమాత్మ అని అర్థం. సర్వతో ముఖంగా పరిపూర్ణుడైన భగవానుడు సృష్టిలో అంటే చరాచర వస్తువులకు, మండుతుండే ఇనుపగుండులోని అగ్గిలాగా వెలుపల, లోపల గూడా స్వరూప రూప గుణాలతో వ్యాపించియున్నందువల్ల విశ్వ శబ్దవాచ్యుడు. 'విశ్' అనే ధాతువు మీద 'క్వన్' (వ) అనే ప్రత్యయం చేరడం వల్ల, అంతటా ప్రవేశించిన భగవానునికే కాక, ప్రవేశింపబడిన సర్వ ప్రపంచానికి కూడా విశ్వశబ్దం వర్తిస్తుంది.

తాను స్వయంగా విశ్వ శబ్ద వాచ్యుడైనా, తన చేత వ్యాప్తమైన విశ్వాన్ని-సర్వ ప్రపంచాన్ని- "సర్వస్యేశానః"-అన్నట్లు స్వాధీనమందుంచుకొని శాసించేవాడు కాబట్టి భగవానుడు 'విశ్వాధీశుడు' విశ్వాధీశుని ప్రేమను పోషించేది లక్ష్మీదేవి, ఆమె యందలి ప్రీతికోసం భగవానుడు సృష్ట్యాది లీల-జగత్క్రీడ-ను నిర్వహిస్తుంటాడు. కాబట్టి, లక్ష్మీదేవి 'విశ్వాధీశ ప్రణయిని' అని సంబోధింపబడింది.

**"లీలా జగత్పతే స్తస్యఛందతః సంప్రవర్తతే ।**

**మోదతే భగవాన్ భూతైర్బాలః క్రీడనకైరివ ॥"**

జగన్నిర్మాణ లీల జగత్పతియైన భగవానుని ఇచ్ఛ-సంకల్పం-వల్ల నిర్వహింపబడుతున్నది. బాలుడు ఆటవస్తువులచే ఆనందపడిన విధంగా, భగవానుడు చరాచర పదార్థాల చేత ఆనందపడుతుంటాడు, అనే ప్రమాణం ఉంది. కాని అందు లక్ష్మీదేవి అన్వయించినట్లు చెప్పబడలేదు కదా! అని అడిగితే –

**"క్రీడేయం ఖలు నాన్యథాఽస్యర సదా స్యాత్**

**ఐకరస్యాత్తయా"**- (శ్రీ కూరేశుల శ్రీ స్తుతి. 1)

భగవానుడు సృష్టి స్థిత్యాదులను చేస్తున్నప్పుడు, ఆయా చేతనులు చేసిన

కర్మలయొక్క ఫలాలను వారు అనుభవించడానికి, స్వర్గ నరకాద్యనుభవ స్థానాలను, శాశ్వతానంద స్థానమైన పరమపదాన్ని, ఇతర భోగ్య భోగోపకరణ, భోగ్య స్థానాలైన సకల పదార్థాలను వారి వారికి అనుగ్రహిస్తున్నప్పుడు "యస్యావీక్ష్య ముఖం తదింగిత పరాధీనో విధత్తేఽ ఖిలమ్" లక్ష్మీదేవి యొక్క ముఖమందలి భ్రూభంగాదుల కదలికల సూచనలకు పరాధీనుడై-ఆమె ఇంగితాలను అనుసరించే అన్నీ చేస్తుంటాడు. లక్ష్మికి ప్రియమైనదేదో, అదే లక్ష్మీపతికి ప్రియమైనది. పాచికలను వేయడమే విచిత్రం. దీని యందు ఆమె ప్రణయమే నియామకం. అలా కాక, లక్ష్మీదేవి యొక్క ముఖకవళికల ననుసరించక, భగవానుడు స్వతంత్రుడై చేస్తే ఆమె రసం వేరై, తన రసం-అభిమతం-వేరై ఐకరస్యం లేకుండా పోతుంది కదా! కాబట్టి లక్ష్మీదేవి ముఖ చిహ్నాలను అనుసరించి, ఐకరస్యంతో అఖిల భువన జన్మస్థేమ భంగాది లీలలను చేయడం భగవానునికి అత్యంతావశ్యకం; ఆనందదాయకం. "లోకవత్తు లీలా కైవల్యమ్" అని బ్రహ్మ సూత్రకారుడు "క్రీడతో బాలకస్యేవ చేష్టాం తస్యనిశామయ" అని శ్రీ పరాశర మహర్షి; "ఇన్నుబుఱు మివ్విళైయాట్టుడైయాన్"- "నళిర్ మామలరున్ది వీట్టెప్పణ్ణి విళైయాడుమ్" అని ఆళ్వార్లు కూడా, భగవానునికి సృష్ట్యాదులు లీలా మాత్రములే అని లోక దృష్టాంతాన్ని ఉపపాదించారు. ఈ ప్రమాణాలవల్ల, ఒక మండలాధిపతియైన రాజుకు ప్రణయిని లేకుండా ఆటలయందు ఆనందమే కలుగదు కదా! కాబట్టి విశ్వాధీశునికీ సృష్ట్యాది లీలను అతని ప్రణయినియైన లక్ష్మీదేవితో కూడి నిర్వహించడం అత్యంతావశ్యకమని ప్రతీయమానమవడమే సమాధానం.

ఈ విషయాన్ని సుశ్లోకించే శబ్ద రచనా సౌందర్యం కమనీయమైనది.

**పశ్యంతీషు శ్రుతిషు పరితః సూరి బృన్దేన సార్ధమ్ :-** యత్రపూర్వే సాధ్యాస్సన్తి దేవాః" (పు.సూ) అనే శ్రుతిరీత్యా సృష్టికి ముందు కూడా శ్రుతులూ, నిత్యసూరులూ ఉన్నందువల్ల, వారందరు సృష్టి స్థితి లయాది క్రీడను చూస్తుంటారు.

**"మౌళయశ్చ శ్రుతీనాం"-** దివ్య దంపతులకు శ్రుతిమౌళులు శయ్యగా (5శ్లో) చెప్పబడింది. "పత్యుస్తవచ నిగమైః" - ఈ దివ్య మిథునం యొక్క మహిమ నిగమా-శ్రుతు-లచేత నిత్యం అన్వేషింపబడుతున్ననూ పరిచ్ఛేదింపరానిదై ఉన్నది,

అని (శ్లోకం. 6) చెప్పబడింది.

ఈ మాటలు పరస్పర విరుద్ధంగా ఎలా చెప్పబడినాయి? 'శ్రుత్యేక గమ్యం' 'దివ్య మిథునమ్'। ఈ మిథునాన్ని దర్శించడానికి శ్రుతులే మనకు కన్నులు కదా! దివ్య దంపతులను ఆ శ్రుతులు కూడా చూడలేనప్పుడు, శ్రుతులే కన్నులుగా గల మనకు ఆ దివ్య మిథున దర్శనం ఎలా సంభవిస్తుంది?

అందుకే "పశ్యంతీషు శ్రుతిషు"– అని శ్రీ నిగమాన్త దేశికులు స్పష్టంగా చెబుతున్నారు. శ్రుతులు (పరితః) పలువైపుల నుంచి చూస్తున్నాయి. (సదా) నిరంతరం చూస్తున్నాయి కూడా.

"సదా పశ్యంతి సూరయః"–నిత్యసూరులు ఎల్లప్పుడు చూస్తున్నారు–అని శ్రుతియే సాక్షిణిగా చెబుతున్నది. శ్రుతి నిరంతరం చూడకుంటే నిత్యసూరులు సదా చూస్తున్నారని సాక్ష్యమెలా పలుకుతుంది?

శ్రుతులు ఎల్లప్పుడు శ్రీ శ్రియఃపతులను చూస్తున్నాయి. కాని వాటికి ఆ దివ్య దంపతుల మహిమ ఇట్టిదని చెప్పే సామర్థ్యం లేదు.

**"నావచ్ఛేదం భజతి మహిమా"**– "ఈశ్వర మిథున మహిమ పరిచ్ఛేదింపరానిది" అని మాత్రమే చెప్పబడింది కదా! కాబట్టి, విరోధం లేశమైనా లేదు. శ్రుతులు సూరి బృందంతో కూడి చూస్తున్నా యనడం గమనార్హం.

లోకంలో ఆటనాడే వారిద్దరు ముగ్గురే అయినా, ఆటను చూచేవారు ఎందరో ఉంటారు కదా ।' ఇక్కడ దివ్య దంపతులిద్దరే జూదమాడుతున్నారు. "అనంతావై వేదాః" – అన్నట్లు అనంత శ్రుతులు అసంఖ్యాకులైన నిత్యసూరుల బృందంతో కూడి చూస్తున్నాయి.

శ్రుతికాంతలు, శ్రీదేవి పక్షం వారనీ, సూరి పురుషులు శ్రియఃపతి పక్షాన ఉన్నవారనీ భావించే అవకాశమూ లేదు కదా! చూస్తున్న వాళ్ళలో నిత్యసూరులకంటె కూడా శ్రుతులకే ప్రాధాన్యమని 'సార్థం' అనే పదంవల్ల గోచరమవుతున్నది. భగవానుని నిశ్వసిత రూపాలైనవి కాబట్టి శ్రుతులు ముఖ్యప్రాణాలు. తత్ఫలితంగా శ్రుతులే పరమ పురుషుని సత్తాను మనకు తెల్పుతున్నాయి. నిత్యసూరులు నిత్యం నీచభావం–

భృత్య భావం కలవారు. సర్వశేషి యొక్క నిశ్వసితభూత శ్రుతులే అగ్ర్యాసనమందు స్థాపింపబడుతున్నాయి. నిత్యసూరులు నిత్యం భగవానుణ్ని చూస్తున్నట్లు అవగతమవుతున్నది.

సూరిబృందేన :- నిత్య సూరులు లింగులు అంటే స్త్రీలు గానీ, పురుషులుగానీ-కారు. వారు శుద్ధాన్త విహార దర్శన యోగ్యులని చెప్పడం కోసమే నపుంసకలింగమైన బృందశబ్దం ప్రయోగింపబడింది కదా! వీరందరు చూచేవారే కాని ఆటలో ఉపయోగింపబడే వారు కారు.

**మధ్యేకృత్య త్రిగుణ ఫలకం :-** అచేతన శరీరంతో కూడియున్న చేతనులు-ప్రజలు- తల్లిదండ్రుల మధ్యన ఉండి లాలింపబడుతుంటారు. దివ్య మిథునమందు ఆధేయమైనది ప్రకృతి.

మూడు గుణాలు - సత్త్వరజస్తమో గుణాలు కలది ప్రకృతి. సత్త్వగుణం శుక్ల-తెల్లని వర్ణం కలది. రజోగుణం పీత వర్ణంగానూ, తమో గుణం కృష్ణ-నల్లని వర్ణంగానూ ఉంటుందని శాస్త్రం. దివ్యదంపతులు సృష్ట్యాది క్రీడకు ప్రకృతిని చతురంగమనే ఆట పలకగా వారి నడుమ ఉంచుకొన్నారు.

**నిర్మిత స్థాన భేదం :-** ప్రకృతి అనే ఆట పలకయందు బ్రహ్మలోకాది స్థానాలు అనే గదులు-ఉన్నాయి. చతుర్దశ (14) భువనాత్మకమైనది ప్రకృతి అన్నమాట. గుణ విభాగాన్ని బట్టి జీవులు ఆయా స్థానభేదాన్ని పొందుతారు.

చతురంగపు ఆటయందు రాజు, మంత్రి, శకటం, గుఱ్ఱం, ఏనుగు అనబడే బలమే జీవ వర్గం. జీవులు తాము చేసిన పుణ్య పాపాల ఫలితంగా, ఆయా వర్ణ స్థానాల-గదుల-యందు త్రిప్పబడుతారు. (సమాసమందు 'క్త్వా' ప్రత్యయానికి మాఱుగా 'ల్యప్' ప్రత్యయం చేరినందువల్ల 'మధ్యేకృత్య' అనబడినది.)

**సదా :-** ఈ ఆటకు ముగింపు సాధారణంగా ఉండదు. సర్వ చేతనుల ముక్తి కోసమే దివ్య మిథునం యొక్క దయారూపమైన ఈ లీలా విహారం ఎల్లప్పుడు సాగుతూంటుంది. "విహరణా విరతిః స్వేచ్ఛయా నైవ దోషః" శ్రీ శ్రియఃపతులు తమ ఇష్టంతో ఆడే ఈ ఆటకు ముగింపు లేకపోవడం దోషం కాదు, అని దేశికులు 'తత్త్వ ముక్తాకలాపం'

అనే గ్రంథమందు నుడివినారు. ఈ ఆటను చాలించడం ఆ దివ్య దంపతుల స్వేచ్ఛ మీద ఆధారపడియున్నది. సర్వ ప్రజలు ముక్తి పొందిన తర్వాత ఆ దివ్య మిథునానికి కర్తవ్య శేషం - చేయవలసిన పని- ఏదీ మిగిలి ఉండదు కదా!

**విభ్రమ ద్యూత వృత్తౌ :-** 'విభ్రమ' మంటే విలాసం, విహారం అని అర్థం. పరస్పర జయాపజయార్థం పందెం కట్టి ఆడే ఆటయే జూదం. కాని ఈ ద్యూత వృత్తి- సృష్టి స్థితి లయాలకు సంబంధించినది కాబట్టి ఆడేవారికీ చూచేవారికీ ఎలాంటి భ్రమను కలిగించదు. దివ్యదంపతులు ఐకరస్యంగా- ఒకే అభిప్రాయంతో ఆడే ఆట ఇది.

అయితే, ఒకరికి జయాన్ని మరొకరికి అపజయాన్ని కోరక, పందెం కట్టక, ఐకరస్యంతో జూదమాడడం ఎలా సంభవం? అంటే -

ఈ జూదం 'లీలా కైవల్యం'. లీలా విభూతి రహస్యమిది. పక్షపాత రహితుడైన భగవానుడు చేతనులను వారి వారి సుకృత దుష్కృతాలనుబట్టి ఆయా స్థానాలయందు ప్రవేశ పెట్టడానికి ముందు 'దేవీ ప్రమాణం' అని- వీరిని ఎక్కడెక్కడ చేర్చాలి అని- దేవిని అడుగుతాడు.

అజ్ఞాత- నిగ్రహ, కరుణైక రూపిణియైన లక్ష్మీ దేవి ప్రాణుల స్థానాలను కొద్దిగా మార్చే ఉదార భావాన్ని తన నాథునికి వాల్లభ్యంతో విన్నవిస్తుంది. భగవతి యొక్క ఇచ్ఛానుసారంగా, భగవానుడు ప్రాణులకు వారు చేసిన కర్మ కంటె కొద్దిగా ఎక్కువ భోగ్యమైన స్థానాన్ని ప్రసాదిస్తాడు. ఇలాగా, ఐకరస్యంతో ఆడే జూదమిది. నిరంతరం దేవి యొక్క దయ చేత ప్రయుక్తమైన అభిప్రాయానికే జయం; దేవునికి అపజయమే.

"పుత్రాదిచ్ఛేత్ పరాజయమ్" అనే వాక్యంలోని 'పుత్ర' శబ్దం చేత కళత్రం (భార్య) కూడా ఉపలక్షింపబడుతుంది. రసికుడైన ప్రతి వ్యక్తి విభ్రమ క్రీడయందు ప్రేయసి నుండి పరాజయాన్నే కోరుతాడు కదా!

**బ్రహ్మేశాద్యాః దధతియువయో రక్షశార ప్రచారమ్ :-**

"కాలః కాల్యా భువన ఫలకే క్రీడతి ప్రాణిశారైః". అని విశ్వాధీశత్వాన్ని

నిరూపించిన భర్తృహరి వాక్యమిక్కడ స్మరింపదగినది.

బ్రహ్మ రుద్రాదులు లోక నియంతలు, వారిచే నియమింపబడేవారు దేవ మనుష్యాదులు. 'అక్ష' శబ్దానికి పాచికలని అర్థం. 'శార' శబ్దానికి కాయలు–త్రిప్పబడే పావులని అర్థం. పాచికలను పారించిన తర్వాత, వాటి ననుసరించి పావులు (కాయలు) ఆయా స్థానాల(గదుల)యందు త్రిప్పబడుతాయి.(అక్ష సంబంధినః శారాః అక్ష శారాః).

దివ్యదంపతుల (ఇద్దరి) సంకల్పాలే రెండు పాచికలు, దివ్య దంపతులచే అనుగ్రహింపబడిన అధికారులైన బ్రహ్మరుద్రుల ద్వారా ఇతర సంసారులు ఒక స్థానం నుంచి మరొక స్థానానికి మార్చి మార్చి త్రిప్పబడుతారు.

శ్రీ శ్రియఃపతుల సంకల్పాయత్తమైనది సృష్టి స్థితిలయాది లీల అని సారార్థం. ఉపమానాన్ని చెప్పి, ఉపమేయాన్ని మరుగుపరచినట్లైతే రూపకాతిశయోక్త్యలంకారం అవుతుంది. ఈ శ్లోకమందు ఉపమేయాలు ఉపమానాల రూపతచే అధ్యవసింపబడినాయి.

"రూపకాతివయోక్తిః స్యాత్ నిగీర్యాధ్యవసానతః" అని లక్షణం.

ఉపమానాలను బట్టి ఉపమేయాలను గ్రహించాలి.

| | |
|---|---|
| ఉపమానం | ఉపమేయం (మరుగున ఉన్నది) |
| ద్యూతవృత్తి | సృష్ట్యాది లీలా వ్యాపారం |
| ఆట పలక | ప్రకృతి. |
| నిర్మిత స్థాన భేదం | కల్పిత చతుర్దశ లోకాత్మకం. |
| అక్ష–పాచికలను బట్టి | దివ్యదంపతుల సంకల్పాలబట్టి, |
| శార–కాయలు/ పావులు | జీవరాశులు. |
| ప్రచారం – | సంచరింపబడే వ్యవస్థ. |

ఇలాగా, ఉపమేయాలకు ఉపమానతాద్రూప్యం చెప్పబడింది. ధ్వని గల ఉత్తమ కావ్యమిది.

8. అస్యేశానా త్వమసిజగతః సంశ్రయన్తీ ముకుందం
లక్ష్మీః పద్మా జలధి తనయా విష్ణుపత్నీందిరేతి ।
యన్నామాని శ్రుతి పరిపణాన్యేవ మా వర్తయంతో
నా వర్తంతే దురిత పవన ప్రేరితే జన్మ చక్రే ॥

**అర్థం :–** ఓ లక్ష్మీ దేవీ! ముకుందం = ముక్తినీ భుక్తినీ ఇచ్చే భగవానుణ్ని; సంశ్రయంతీ= ఆశ్రయించి యుండే; త్వం= నీవు; అస్య = ఈ; జగతః = ప్రపంచానికి; ఈశానా= ఈశ్వరిగా; అసి = ఉన్నావు. లక్ష్మీః = లక్ష్మి, పద్మా = పద్మ, జలధి తనయా = కడలి కూతురు; విష్ణుపత్నీ = విష్ణుపత్ని; ఇందిరా=ఇందిర; ఇతి = అని; శ్రుతి పరిపణాని = వేదాలకు మూల ధనంగా ఉన్నట్టి; యత్+నామాని = ఏ నీ పేర్లను; ఏవం = ఇట్లు; అవర్తయంతః = పదే పదే పల్కువారు–జపించేవారు; దురిత పవన ప్రేరితే = పాప కర్మలనే గాలిచేత తిరుగుతున్నట్టి; జన్మ చక్రే = సంసారమనే చక్రమందు; న+అవర్తంతే = చిక్కితిరుగరు.

**తా॥** ఓ లక్ష్మీ దేవీ! ఐహికా ముష్మిక సుఖాలనిచ్చే సర్వేశ్వరుణ్ని ఆశ్రయించి నీవు అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకిగా ఉన్నావు. లక్ష్మి, పద్మ, జలధితనయ, విష్ణుపత్ని అని వేదాలకు మూలధనంగా ఉన్న నీ నామాలను సర్వదా జపించే వ్యక్తులు, పాపరాశి అనే గాలిచే తిరుగుతున్న జనన మరణ రూపమైన చక్రంలో పడి తిరుగరు. పునర్జన్మను పొందరని తాత్పర్యం.

**వ్యాఖ్య:– లోకేశ్వరియైన లక్ష్మీ నామ మాహాత్మ్యం సుశ్లోకితం.**

పూర్వశ్లోకమందు బ్రహ్మేశాది చేతనులను జగచ్చక్రమందు నిమ్నోన్నత స్థానాలలో నియమించడం చెప్పబడింది. ఈ శ్లోకం మోక్ష ప్రదత్వాన్ని చెబుతున్నది.

ముకుందం :– ముకుందదాతీతి=ముకుందః. 'ముకుం' అనే పదం అవ్యయం. 'ము' అంటే మోక్షం; 'కు' అంటే భూమి–భోగం. ఈ రెండు ఫలాలను ప్రసాదించే శ్రియఃపతికే 'ముకుందు'డని పేరు. "మోక్షదాతా జనార్దనః" అనే మాట ప్రసిద్ధం కదా! "శ్రేయః సమేదిశతు శాశ్వతికం ముకుందః" శంఖ, పద్మాది నవ నిధులలో 'ముకుంద' అనే పేరు గల నిధి కూడా కుబేరుని దగ్గర ఉంటుంది. 'ముకుంద'

శబ్దానికి భగవానుడు, నిధి అని అర్థ ద్వయం. ముకుందుడనేనిధి నాకు శాశ్వతమైన మోక్షాన్ని ప్రసాదించుగాక! అని అప్పయ్య దీక్షితులు కంచి వరదరాజ స్వామిని స్తుతించారు. ఛాందోగ్యోపనిషత్తు 'హిరణ్యనిధి' తో పరమాత్మను పోల్చి వివరించింది.

నమ్మాళ్వార్లు "వైత్తమానిది"- (పూర్వికులచే ప్రతిష్ఠింపబడిన మహా నిధి) అని తిరుక్కోళ్ళూర్ అనే దివ్య క్షేత్రమందు వెలసియున్న సుందరబాహు స్వామిని కీర్తించారు.

**సంశ్రయంతీ ముకుందం:-** లక్ష్మీదేవి ముకుందుణ్ని ఆశ్రయించియున్నది. 'వక్షః పీఠం' (శ్లో.1) అనే చోట వివరింపబడింది కదా! అందువల్ల-

**అస్యేశానా త్వమసి జగతః :-**

ఈ జగత్తుకు లక్ష్మీదేవి ఈశ్వరియై విరాజిల్లుతున్నది. "అస్యేశానా జగతో విష్ణుపత్నీ" (తై.సంహిత. 4-4-12-37) అనే వేద వాక్యమే, అందరు స్తుతించడానికి తగినట్లు (సర్వాధికారత్వం కోసం) వేద శబ్దాల నడుమ 'త్వమసి' అని వేరే పదాలు ప్రయుక్తమై, రచింపబడిన శ్లోక పాదమిది.

"ఈశానో భూత భవ్యస్య" (కఠోపనిషత్తు 4-12)

పూర్వం ఉండిన వాటికీ, ముందు ఉండబోయే వాటికీ శ్రియఃపతి ఈశానుడు (ప్రభువు) అని వేదం బోధిస్తున్నది. శ్రీదేవి ఈశాన (ప్రభ్వి). సర్వశేషియైన విష్ణుమూర్తికి పత్నియైన లక్ష్మి, పతికి శేష భూతురాలు. చక్కెర (శేష వస్తువు) కలిసిన పాలకు (శేషికి) మాధుర్యం అతిశయించినట్లు, శ్రీదేవి ఆశ్రయించినందువల్ల శ్రియఃపతికి వైభవం అతిశయించింది. శ్రీ శ్రియఃపతుల కిద్దరికీ జగత్తు శేష భూతమైనది. ముకుందుణ్ని ఆశ్రయించిన లక్ష్మీదేవి పతికి పరత్వాన్ని కల్పించింది. ఈ దివ్య దంపతులు పుష్ప పరిమళ న్యాయంగా అవినాభూతులు. శ్రీ శ్రియః పతులిద్దరికీ సమాన ప్రాధాన్యమున్నది.

పతి ధనం కూడా పత్నికి వర్తించడం పరిపాటి కదా! కాబట్టి, లక్ష్మీదేవి, ఆమె భర్తలాగా జగన్నియంతృత్వమూ, భుక్తి ముక్తి ప్రదానత్వమూ ఇత్యాది ప్రభావం కలిగియున్నదని విశదీకరిస్తున్నది వేదవాక్యం.

లక్ష్మీదేవి సాధారణ జీవాత్మ కాదు, జగదీశ్వరియే. "మాం ప్రాణమమృత మిత్యుపాస్వ" – "నన్నే ప్రాణంగానూ, అమృతంగానూ ఉపాసింపుము" అని ఇంద్రుడు ప్రతర్దనునికి బోధించాడని (ప్రతర్దన విద్య) కౌషీతక బ్రాహ్మణం తెలుపుతున్నది. "కారణం తుధ్యేయః". కారణమైన పరమాత్మయే ఉపాస్యుడు అని వేదాంత శాస్త్రం బోధిస్తుంది.

జీవ విశేషుడైన ఇంద్రుణ్ని ఉపాసిస్తే అమృతత్వం (ముక్తి) సాధింపబడదు. కాబట్టి 'శరీర వాచక శబ్దాలు శరీరి పర్యంతం బోధిస్తాయి' అనే శాస్త్ర దృష్టితో, ఇంద్రుడు 'మాం' అని స్వశరీరక పరమాత్మోపాసనను బోధించాడని అర్థం.

ఇలాగా, సామాన్య జీవాత్మయే అయితే, మోక్షమీయడం అసంభవం కదా! అనే శంక కలుగకుండా, లక్ష్మీదేవి చేతనులైన బ్రహ్మేంద్రాదుల వంటిది కాదని, ఆమె విష్ణుపత్నియైనందువల్ల 'లోకేశ్వరి' అని శ్రుతి వాక్యం బోధిస్తున్నది. "ఈశ్వరీ (గ్ం) సర్వభూతానాం" అని శ్రీ సూక్తం స్పష్ట పరచింది.

లక్ష్మీః :– "హ్రీశ్చతే లక్ష్మీశ్చపత్నౌ" అని లక్ష్మీ నామం పురుష సూక్తంలోని ఉత్తరానువాకమందు ప్రశంసింపబడింది.

పద్మా :– "పద్మప్రియే, పద్మిని, పద్మహస్తే, పద్మాలయే, పద్మదళాయతాక్షి" అని శ్రీ సూక్తంలో ధ్యాన శ్లోకం.

"శ్రీః లక్ష్మీ కమలాదేవీ మా పద్మాకమలాలయా"– అని శ్రీ పాంచరాత్రా గమాంతర్గత లక్ష్మీ స్తోత్రం.

జలధి తనయా:– క్షీరోద సంభవా, సముద్ర రాజ తనయా; అని లక్ష్మ్యష్టోత్తర శతనామాలలో ప్రసిద్ధ నామం.

విష్ణు పత్నీ :– "మహాదేవ్యైచ విద్మహే, విష్ణు పత్నైచ ధీమహి, తన్నో లక్ష్మీః ప్రచోదయాత్" అని లక్ష్మీ దేవి మంత్రం.

ఇందిరా :– "ఇందిరా, లోకమాతా, మా, రమా, మంగళదేవతా" అని (అమరం)

లక్ష్మీదేవికి పర్యాయనామం. పరమైశ్వర్యవతి అని అర్థం.

**యన్నామాని శ్రుతి పరివణాని :-**

విష్ణు సహస్ర నామాలవలె లక్ష్మీ సహస్ర నామాలు కూడా ఆమె మాహాత్మ్యాన్ని ప్రకటిస్తాయి. ఈ శ్లోకంలో ఐదు (5) పేర్లు ఉన్నాయి. పర, వ్యూహ, విభవాన్తర్యామ్యర్చావతారాలనే భగవానుని పంచావతారాలకు అనుగుణంగా పేర్కొనబడిన శ్రీదేవీ నామాలివ్వి.

(1) లక్ష్మీ అర్చారూపం (2) పద్మ అంతర్యామి రూపం. (3) జలధితనయ వ్యూహ రూపం (4) విష్ణుపత్నీ విభవ రూపం (5) ఇందిర పర రూపం.

సర్వైశ్వర్య ప్రదయైన శ్రీదేవి యొక్క నామాలు వేదాలకు మూలధనంగా ఉన్నాయి. మూలధనం వడ్డీ, లాభాన్ని చేకూర్చుతూ నిధినీ, కుటుంబాన్ని సంరక్షిస్తుంది. వేద ప్రతిపాదితులైన దివ్య దంపతులలో భగవానుడు మహానిధి అయితే భగవతి మూలధనం. శ్రియఃపతి నామ మహిమకు శ్రీ దేవీ నామమే కారణం కదా!

"సర్వే వేదా యత్పదమా మనంతి". వేదాలకు అక్షయమైన సంపదనొసగడం వల్ల, వేదాలన్నీ ఈ దివ్య మిథునం యొక్క నామావళిని కీర్తిస్తుంటాయని ఈ శ్రుతి వాక్యార్థం.

**ఏవం ఆవర్త యంతః నావర్తంతే :-** లక్ష్మీదేవి యొక్క నామాలను పునః పునః జపించే వ్యక్తులు ముక్త పురుషులవుతారు. ఆ వృత్తి చేసే వారికి ఆవృత్తి లేదు అనడం అందమైన మాట. నామ మంత్ర జపం చేత లక్ష్మీదేవి ప్రసన్నురాలవుతుంది, ముక్తినిస్తుంది. సర్వ పాపాలను నశింపజేసేది లక్ష్మీ నామావళి. 'భవభంగాపహారిణి, సకల పాప ప్రణాశని' అని లక్ష్మీ సహస్ర నామాలలో ఆమె మాహాత్మ్యం కీర్తింపబడింది. "ఆ వృత్తి రసకృదుప దేశాత్" అనే బ్రహ్మ సూత్రంతో ఫలాధ్యాయం ఆరంభమై "అనావృత్తిః శబ్దా దనావృత్తిః శబ్దాత్" అనే సూత్రం (4-4-22)తో వ్యాసరచిత బ్రహ్మ సూత్ర గ్రంథం అంతమవుతుంది. ఆవృత్తి అంటే నామ సంకీర్తనం సాధనయని అర్థం. ఆవృత్తి చేత పొందే ఫలం అనావృత్తి; అంటే తిరిగి సంసారంలోకి రాదని సూత్రంలో అనావృత్తి శబ్దాన్ని ఆవర్తింపజేశాడు సూత్రకారుడు. దేశికులు కూడా సూత్రరీతిగా ఆ శబ్దాలను సుశ్లోకించారు.

**దురిత పవన ప్రేరితే జన్మచక్రే :-** చక్రం గాలి చేత కిందికి వస్తూ, మీదికి పోతూ గుండ్రంగా తిరుగుతుంది. గాలి ఎక్కువ అయితే చక్రం కూడా ఎక్కువగా తిరుగుతుంది. అనశ్వరమైన జీవాత్మ నశ్వరమైన శరీరంలో బంధింపబడి అధో లోకంలోకి రావడమే జననమన్నమాట. దేహయాత్ర ముగియగానే ఊర్ధ్వలోకానికి పోవడమే మరణం. జనన మరణాలు మళ్ళీ మళ్ళీ జీవునికి సంభవించి పరిభ్రమించడంవల్ల జన్మచక్రమనబడింది. పాపరాశి అనే గాలి అధికంగా సోకిన జీవుడు అనేక జన్మలెత్తుతూ, చక్రాకారంగా తిరుగుతుంటాడు. ఇదంతా శాస్త్రం వల్ల తెలుస్తున్నది.

జీవుడు రావడం, పోవడమనే విధానం మన కంటికి కనబడదు. కాబట్టి పాపరాశిని గాలితోనూ, జనన మరణాలను చక్రంతోనూ పోల్చి నిరూపించడం సాహిత్య లక్షణం. దురితమే పవనం, జన్మమే చక్రం అనడం రూపక సమాసం. పవన ప్రేరితమైన చక్రాకారమే ఆవర్తం. పరబ్రహ్మ తత్త్వం తెలియడానికి శబ్దమే ప్రమాణం కాబట్టి "ఇమం మానవ మావర్తం నావర్తతే". అని శ్రుతి (శబ్దం)వల్ల పునరావృత్తి తిరిగిరావడం-లేదని తెలుస్తున్నది.

వేదాలలో శ్రీ సూక్తం, శ్రద్ధా సూక్తం, మేధా సూక్తం, కౌషీతకీ బ్రాహ్మణం లక్ష్మీదేవి యొక్క వైభవాన్ని తెలుపుతాయి.

**"యశ్చైత త్కీర్తయేన్నిత్యం శ్రుణుయాద్వాపి పద్మజ !**
**శుచిః సమాహితో భూత్వా భక్తి శ్రద్ధా సమన్వితః ।**
**ఐహికా ముష్మికం సర్వం లభతే శ్రీ ప్రసాదతః ।**
**దారిద్ర్యం నశ్యతే తస్య సర్వపాపాత్ ప్రముచ్యతే ॥**

లక్ష్మి నామావళిని శుచిర్భూతుడై శ్రద్ధా భక్తులతో పఠించినా, విన్నా, అతనికి పేదరికం పోతుంది. అతడు సర్వ పాపాల నుంచి విముక్తుడవుతాడు. జీవితంలో సకల భోగాలను అనుభవిస్తాడు. దేహాంతమందు వైకుంఠంలో శాశ్వతానందాన్ని పొందుతాడు, అని సనత్కుమార సంహిత తెల్పుతున్నది.

"వేరి మారాద పూమేలిరుప్పాళ్ విన్నై తీర్కుమే" (తి.వా.మొళి.4-5-11) అని నమ్మాళ్వార్ల శ్రీ సూక్తి ప్రకారం, లక్ష్మీదేవి పాపరాశిని తొలగించి, విశుద్ధ

జీవునిగా చేస్తుంది. విశుద్ధ జీవుడే ముక్తిని పొందుతారు. "సోఽ శ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా"- ముక్తపురుషుదు భగవత్స్వ రూపాన్ని పొంది, భగవంతునితో కూడి, భగవద్గుణాలను అనుభవించడమే మోక్షానందం. రూపకాలంకార ప్రాణిత వాక్యార్థ హేతుక కావ్యలింగాలంకారం.

**9. త్వామే వాహుః కతిచిదపరేత్వత్ప్రియం లోకనాథం**
**కింతైరన్తః కలహమలినైః కించిదుత్తీర్య మగ్నైః**
**త్వత్సం ప్రీత్యై విహరతి హరౌసమ్ముఖీనాం శ్రుతీనాం**
**భావా రూఢౌ భగవతి! యువాందైవతం దంపతీ నః ॥**

**అర్థం:-** హే భగవతి = ఓ లక్ష్మీదేవీ! కతిచిత్ = కొందరు; త్వాం, ఏవ=నిన్నే; అపరే= మతికొందరు; త్వత్ ప్రియం = నీ ప్రియుడైన నారాయణున్నే; లోకనాథం= జగదీశ్వరునిగా; ఆహుః=చెబుతారు. అంతః కలహ మలినైః = అంతః కలహం చేత కలుషితులైనట్టి; కించిత్ = కొంచెం; ఉత్తీర్య = పైకి తేలివచ్చి; మగ్నైః= మునిగి పోయే; తైః = వారి చేత; కిం = ఏమి ప్రయోజనం? త్వత్సంప్రీత్యై = నీ సంతోషం కోసం; విహరతి = విహరించే; హరౌ; భగవంతుని యందు; సంముఖీనాం = అభిముఖంగా ఉన్న; శ్రుతీనాం= శ్రుతులయొక్క; భావ+ఆరూఢౌ = భావమందు అధిష్టించియున్న; దంపతీ = దంపతులైన; యువాం=మీరిద్దరు; నః =మాకు; దైవతం= దైవతమే-ఉపాసింపదగినవారే.

**తా॥** షాడ్గుణ్య పూర్ణయైన ఓ భగవతీ! కొందరు నిన్నే లోక నాయకి అంటారు. మరికొందరు నీ వల్లభుణ్ని మాత్రమే లోకనాథుడంటారు. ఇట్టి అంతః కలహం చేత మలినులై, నదీ ప్రవాహంలో పైకి తేలి వచ్చి మునిగిపోయే వారిచేత ఏమి ప్రయోజనం? నీ సంతోషం కోసం విహరించే భగవానుని యందు అభిముఖులైన శ్రుతుల భావమందు ఆరూఢులైన మీరిద్దరే మాకు ఉపాస్యులైన పరదేవతలు.

**వ్యాఖ్య:- లక్ష్మీ నారాయణులనే పరదేవతా ద్వంద్వమే ఉపాస్యమని స్తుతి.**

నారాయణుడు లోకేశ్వరుడైనట్లు, లక్ష్మీ దేవి కూడా లోకేశ్వరిగా స్తవనీయ. భగవతి :- జ్ఞానం, శక్తి, బలం, ఐశ్వర్యం, వీర్యం, తేజస్సు అనే ఆరుగుణాలు

భగవంతునికి ఉన్నట్లే లక్ష్మీ దేవికీ ఉండడంవల్ల 'భగవతి' అని ఆమె సంబోధింపబడింది.

**"జ్ఞానశక్తి బలైశ్వర్య వీర్యతేజాంస్య శేషతః ।**

**భగవచ్ఛబ్దవాచ్యాని వినాహే యైర్గుణాదిభిః ॥"** (వి.పు.)

భగవానుడైన నారాయణుడు (పైన చెప్పిన) షడ్గుణ పరిపూర్ణుడనీ, 'వినాహేయైః' అనడంవల్ల హేయ గుణాలు (దోషాలు మాత్రం) ఆయనలో లేవనీ, భగవచ్ఛబ్దం ఉభయలింగత్వాన్ని తెల్పుతున్నది.

**"ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః**

**జ్ఞాన వైరాగ్యయోశ్చైవషణ్ణాం భగ ఇతీరణా ॥"**

'భగ' అనే పదానికి జ్ఞాన శక్త్యాది షడ్గుణాలని అర్థం. విష్ణు పురాణంలో ఆరవ అంశమందు తెలిపిన ఈ రెండు శ్లోకాలలో కొద్దిగా భేదమున్నట్లు కనబడుతుంది. కాని యశస్సంటే తేజస్సు, శ్రీ అంటే శక్తి, వైరాగ్యం అంటే దృఢమైన బలమని అర్థం. కాబట్టి ఆరుగుణాలు సమన్వయమవుతున్నాయి. భేదం లేదు.

"భగవాన్, భగహా" అని విష్ణుసహస్ర నామాలలో 'షడ్గుణాలు కలవాడు' (భగం-హన్తి = హన-హింసా గత్యోః అనే ధాతువును బట్టి హింసా రూపమైన అర్థం కాదు. (గచ్ఛతి) షడ్గుణాలను పొందినవాడు) అనే అర్థాన్ని ఈరెండు నామాలు బోధిస్తున్నాయి.

భగవద్రామానుజులవారు 'ఓమ్ భగవన్నారాయణాభిమతాను రూప' అనే 'శ్రీ గద్య' లో "పద్మవనాల యాంభగవతీం శ్రియం దేవీం" అని లక్ష్మీదేవిని స్తుతించారు కదా!

ఇక్కడ భగవచ్ఛబ్దం తర్వాత నారాయణ పదాన్ని ప్రయోగించడమెందుకు?

**"తత్ర పూజ్య పదార్థోక్తి పరిభాషా సమన్వితః ।**

**శబ్దోయం నోపచారేణ హ్యన్యత్రహ్యుపచారతః ॥"**

'పూజ్యపదార్థోక్తి' అంటే ఆదరింపదగిన ప్రకృతి ప్రత్యయాల వ్యుత్పత్తి; 'పరిభాష' అంటే వ్యుత్పత్తి లేకుండా ఆ పదం అర్థాన్ని బోధించే రూఢి శక్తి. రూఢి, వ్యుత్పత్తులనుబట్టి, భగవచ్ఛబ్దం విష్ణువునే బోధిస్తున్నది. అయినా కొద్దిగా గుణసామ్యం

ఉన్నందువల్ల భగవచ్ఛబ్దం 'భగవాన్ వశిష్టః, భగవాన్ వేదవ్యాసః' అని ఔపచారికం అంటే అముఖ్యం.)

"పూర్వ పదాత్ సంజ్ఞాయామగః" – అనే సూత్రం చేత 'నార+అయన' సమాసపదంలోని మొదటి పదమందలి రేఫాన్ని బట్టి, రెండవ పద మందున్న నకారానికి సంజ్ఞావాచకమైనప్పుడే ణత్వం వస్తుంది. కాబట్టి నారాయణపదం విష్ణువుకే సంజ్ఞావాచకమని సూత్రార్థం. కాబట్టి భగవానుడంటే నారాయణుడే అని భగవద్రామానుజులవారు స్పష్టపరచారు.

'పద్మవనాలయాం' పద్మంలాగా భోగ్యమై లోకనాథుణ్ని పరిమళింపజేస్తూ "సర్వగంధః, సర్వరసః" అని ఆయనకు కీర్తిని కలిగించింది లక్ష్మీదేవి.

భగవానునికి కూడా పూజ్యమైనందువల్ల 'భగవతీ' అని లక్ష్మీదేవికి పేరు. షడ్గుణ స్వరూపురాలని ముఖ్యార్థం. 'శ్రియం' అంటే భగవంతుణ్ని ఆశ్రయించింది.

భక్తులచే ఆశ్రయింపబడేది. భగవంతుణ్ని విడిస్తే భగవతికి స్థితిలేదు. భగవతి లేకుంటే భగవంతునికి పరత్వం లేదు. కాబట్టి అవినాభూతులైన వీరిద్దరు మనకు–జగత్తుకే మాతాపితరులు–రక్షకులు. ఇద్దరిలో ఏ ఒక్కరికీ హెచ్చుతగ్గులు లేకుండా, ఉభయ ప్రాధాన్యాన్ని తెలిపే ఈ (9) శ్లోకభావాన్ని పూర్తిగా ఈ 'భగవతి' అనే ఒక్కపదమే వివరిస్తున్నట్లు గోచరిస్తుంది కదా!

**త్వామేవాహుః కతిచిత్ :–** కొందరు లక్ష్మీదేవి మాత్రమే జగదీశ్వరి అంటారు. 'నరనారీమయో హరిః'– భగవానుడే శ్రీదేవీ రూపంలోనూ ఉంటాడనీ; "నారాయణాత్మికా దేవీ" అని భగవానుని స్వరూపమే శ్రీదేవి అనీ; దైత్యులను మోహింపజేసే కాంతావేషాన్ని ధరించాడు కాబట్టి శ్రీ శ్రియఃపతులకు భేదమే లేదనీ, ఈ నిర్వాహ భేదంవల్ల వీరిద్దరికి స్వరూపైక్యాన్ని సమర్థిస్తూ వాదిస్తారు కొందరు. అంటే, లక్ష్మీదేవి భగవానుని సత్త అనీ, అహంతా మాత్రమే అనీ, ప్రత్యేక తత్త్వం కాదంటారు.

"హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ" అంటూ వేదం భగవానుని కంటె లక్ష్మి భిన్నురాలని తెల్పింది. తత్త్వ త్రయానికి ఈశ్వరి 'పుంప్రధానేశ్వరేశ్వరీ' అనీ; లక్ష్మీదేవియే మూల

ప్రకృతి. అంతేకాదు, "తథైవైకా పరాశక్తిః" (అనీ బ్ర.పురా)

**"ఏకైవ వర్తతే భిన్నా జ్యోత్స్నే హిమదీధితేః ।**
**సర్వశక్త్యాత్మికాచైవ విశ్వంవ్యాప్యవ్యవస్థితా ॥"**
**"శక్తీనాంచైవ సర్వాసాం యోనిభూతా పరాకళా ॥"**

లక్ష్మీదేవి మహోత్కృష్టమైన శక్తి స్వరూపిణి; ఆమె ఏక శక్తి స్వరూపురాలైనా లక్ష్మీ రూపాన ఉన్న పరశక్తి; ఇతర సర్వవస్తు స్వరూపంగా ఉన్న అపరశక్తి; సర్వ శక్తులకు నాయకురాలై ప్రపంచంలో వ్యాపించి ఉంది; విష్ణువుతో ఏకీభూతురాలైనా, చంద్రునికి చంద్రికలాగా ధర్మ ధర్మిభావాన్నిబట్టి ఆయనకంటె వేరై ఉన్నది. సర్వప్రాణులయందు జీవన హేతువైన ప్రాణశక్తి ఆమెయే. సర్వశక్తులకు మూల కారణం ఆమెయే. ఎవరికి ఆమె ప్రసన్నురాలవుతుందో వారికి కోరిన సర్వశక్తులు లభిస్తాయని లక్ష్మీసహస్ర మనబడే పాంచరాత్ర గ్రంథమందు తెల్పబడినది. కాబట్టి, లక్ష్మీదేవియే లోకేశ్వరి అని వాదన చేస్తారు.

అపరే త్వత్ప్రియం లోకనాథం :-

మరికొందరు శ్రియఃపతినే లోకనాథుడంటారు. "న దైవం కేశవాత్పరమ్" కేశవుని కంటె పరదైవం లేదు; "మామేకం శరణం వ్రజ" నన్ను మాత్రమే శరణు పొందుము. "మామైవేష్యసి"- నన్నే పొందగలవు, అనీ (భ.గీ) చెప్పబడింది కదా! లోకనాథులు ఇద్దరు ఉండడం విడ్డూరం కాదా? కాబట్టి భగవానుడే లోకనాథుడని కొందరు వాదిస్తారు.

**కింతైః అంతః కలహమలినైః కించి దుత్తీర్యమగ్నైః :-** భగవంతుణ్ని విడిచి భగవతియే లోకేశ్వరి అనడమూ భగవతిని విడిచి భగవానుని మాత్రమే లోక నాథుడనడమూ పరస్పరదూషణమే అవుతుంది.

దంపతుల మధ్య కలహ కారణోద్యమమే ఇది. సయూథ్య కలహంతో పరస్పర వాదవివాదాలను చేస్తూ కలుషితులయ్యేవారు అజ్ఞాన సాగరం నుంచి పైకి లేచినట్లే ఉన్నా, తమ వాదనను సిద్ధాంతపరచే జ్ఞానం లేనందువల్ల మళ్ళీ అందే మునిగిపోతారు.

ఈతరానివాడు నదీ ప్రవాహంలో మునిగిపోతాడు. ఈత నేర్చిన వాడు కూడా ప్రవహంలో తేలుతూ వచ్చి, దరికి కొంతదూరంలో దేహబలం చాలక మునిగిపోతాడు కదా! అలాగా, జ్ఞానహీనులకూ, శాస్త్ర చర్చ చేసి తమ సిద్ధాంతమిట్టిదని తీర్మానించే తెలివి లేని వారికినీ ఫలంలో ఎలాంటి భేదం లేదు. కాబట్టి పరస్పర దూషణలతో వాద వివాదాలను చేసే వ్యక్తుల మాటలను పట్టించుకోరాదని తాత్పర్యం.

**త్వత్సం ప్రీత్యై విహరతి హరౌ :-**

దేశికులవారు కలుషితుల వాద వివాదం నిష్ఫలమని నిరసిస్తూ, తమ సిద్ధాంతాన్ని ఈ ఉత్తరార్ధంలో ప్రకటిస్తున్నారు.

లక్ష్మీ ప్రీతికోసం విహరించేవాడు అంటే సృష్టి స్థితిలయాలను చేసేవాడు హరి. (విహరతీతి హరిః) అని జగత్కారణత్వాన్ని 'హరి' పదం తెల్పుతుంది. రుక్మిణిని హరించడంవల్ల హరి అని పేర్కొనబడినాడు - "రుక్మిణీం హరతా హరే" అని మాఘకావ్యంలో బలరాముడు కృష్ణుణ్ని గూర్చి పలుకుతాడు. "ఉపహరతీతి హరిః" సృష్టించిన జగత్తును లక్ష్మీదేవికి కానుకగా ఇచ్చేవాడు హరి అనబడుతున్నాడు.

"అనుశిఖినిశిఖీవ క్రీడసి శ్రీ సమక్షమ్" - (శ్రీరంగరాజస్తవం-ఉ.శ.44) ప్రియురాలైన ఆడ నెమలి యొక్క సంతోషం కోసం చిత్ర వర్ణశోభిత పింఛంగల మగ నెమలి తన తోకను విప్పి ఉల్లాసంగా నాట్యమాడుతుంది. ఉల్లాసం తీరగానే మళ్ళీ తోకను ముడుచుకొంటుంది. అట్లే భగవానుడు విచిత్ర చిదచిత్ప్రపంచ సృష్టి ప్రళయ రూపమైన ఆటను తన ప్రేయసియైన లక్ష్మీదేవి చూచి వినోదించడం కోసం ఆడుతాడని శ్రీ పరాశరభట్టర్ అందంగా ప్రబోధించారు.

**సం ముఖీనాం శ్రుతీనాం భావారూఢౌ :-** సతీపతుల ఆటను శ్రుతులు చూస్తుంటాయని (7వ శ్లోకము) చెప్పబడింది కదా! "పతిం విశ్వస్య" అనే శ్రుతి రీత్యా భగవానుడు లోకనాథుడు. "అస్యేశానా జగతో విష్ణుపత్నీ" అనే శ్రుతి ప్రకారం భగవతి లక్ష్మీదేవి లోకనాయకి. వీరి కుటుంబమే జగత్తు. సృష్ట్యాది లీలలో అనుమంతృత్వం లక్ష్మిదైతే, సాక్షాత్కర్తృత్వం లక్ష్మీపతిది. వ్యక్తి భేదమున్నప్పటికీ, వీరిద్దరు కలిసి 'ఏకమేవాద్వితీయం" అని శ్రుతి పలికినట్లు, దేవతా ద్వంద్వంలాగా

ఏకదైవతమే. ఇలాగా శ్రుతుల భావమందు ఆరూఢులు.

**యువాం దైవతం దంపతీనః :–** ఏ వ్యక్తి ఎవరిప్రీతి కోసం కర్మ నాచరిస్తాడో, అతనికి అదే దైవతం. శ్రీ శ్రియఃపతుల పరతత్త్వం శ్రుతుల భావమందు ఆరూఢమైనది కాబట్టి ఆ పరదేవతా మిథునమే దేశికుల హృదయా రూఢమైనదనడం స్వారస్యం. లక్ష్మీ విశిష్టైక్య పరత్వమే దైవతం అని నిర్ధారితం.

**"ఇయంతు భవతోభార్యా దోషైరేతైర్వివర్జితా"**

నీ పత్నియైన సీత దోషగంధం లేని శుభకర గుణాలు కలది అని అనసూయ శ్రీరామునితో చెప్పింది. కాబట్టి లక్ష్మి మంగళదేవత. "అర్థో విష్ణురియం వాణీ" జగత్తులోని పదార్థాలన్నీ భగవదధీనాలైతే వాటిని బోధించే శబ్దరాశి అంతా లక్ష్మీదేవికి అధీనమైయున్నది. ఆమె పురుషకారిణి, అంటే చేతనులకు చాలా గొప్ప ఫలాన్ని తన నాథుడు ఇచ్చే రీతిగా– (పురుసనోతీతి పురుషః) – పురుషణ్ని–చేస్తుంది. ఇది సర్వవిభూతినాయకుడైనా సర్వేశ్వరుని రాసిక్యానికీ, పురుషోత్తమత్వానికి సూచకం. కాబట్టి, ఈ శ్లోకం భగవతికి భగవానుడు అధీనుడై యుండే ఒక వైభవాన్నీ అనురణింప జేస్తున్నది. ముఖ్యంగా, చరాచర జగత్తుకు దివ్యదంపతియే శరణమనడం నిర్వివాదాంశం.

**10.** **అపన్నార్తి ప్రశమన విధౌబద్ధ దీక్షస్య విష్ణోః**
**అచఖ్యుస్త్వాం ప్రియసహచరీమైక మత్యోపపన్నామ్**
**ప్రాదుర్భావైరపి సమతనుః ప్రాధ్వమన్వీయ సేత్వం**
**దూరోత్క్షిప్తైరివ మధురతా దుగ్ధరాశేస్తరంగైః ॥**

**అర్థం :–** ఆపన్న–విధౌ । ఆపన్న+ఆర్తి = ఆపన్నుల కష్టాలను; ప్రశమన = తీర్చునట్టి; విధౌ=కార్యమంచు; బద్ధ దీక్షస్య = నియత వ్రతుడైన; విష్ణోః = భగవానునికి; త్వాం= నిన్ను; ఐకమత్య+ఉపపన్నాం = ఏకాభిప్రాయం గల; ప్రియ సహచరీం = ప్రేమ పాత్రమైన సహధర్మచారిణిగా; ఆచఖ్యుః = చెబుతారు. త్వం = నీవు; దూర+ఉత్క్షిప్తైః= దూరంగా ఎగురగొట్టబడిన; దుగ్ధరాశేః = పాలకడలియొక్క; తరంగైః = అలలతో పాటు; మధురతా, ఇవ = మాధుర్యం వలె; ప్రాదుర్భావైః, అపి

= (భగవానుని) అవతారాలతో కూడ; సమతనుః = సమాన శరీరం కలదానవై; ప్రాధ్వం = అనుకూలంగా; అన్వీయసే = అనుసరిస్తావు.

**తా॥** ఓ లక్ష్మీదేవీ! ఆపన్నుల కష్టాలను పోగొట్టడం కోసం కంకణం కట్టుకొన్న విష్ణుమూర్తికి ఐకమత్యం, ప్రీతి కల్గిన సహధర్మచారిణివని నిన్ను కీర్తిస్తుంటారు. క్షీరాబ్ధిలో పైకి లేచి దూరంగా ఎగసిపోయిన కెరటాలతో పాటు మాధుర్యం కూడా కలిసిపోయినట్లే, నీవు కూడా భగవంతుని అవతారాలకు తగిన దేహాలను ధరిస్తూ, అతనికి అనుకూలంగా అవతరించి అనుసరిస్తుంటావు.

**వ్యాఖ్య:- భగవంతుని అవతారాలలోనూ లక్ష్మీదేవి యొక్క అవినాభూత సహయోగాలను తెలిపే శ్లోకమిది.**

భగవానుని సృష్ట్యాది లీలయందు లక్ష్మీదేవి సహరించడమే కాక, సకల జగద్రక్షణ కోసం ఆవిర్భవించే భగవదవతారాలలో కూడా లక్ష్మీదేవి భర్తకు అనుకూలమైన స్వరూప రూప గుణాలతో అవతరించి ఆయనను అనుసరిస్తుంటుంది.

**ఆపన్నార్తి ప్రశమన విధౌ :-** ఆపదలలో చిక్కుకొన్న అసహాయులను ఆపన్నులంటారు. ఆర్తులంటే బాధలచేత పీడితులై చాలా దుఃఖపడే దీనులని అర్థం. "ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ" (భ.గీ.త) భగవంతుణ్ని ధ్యానించే వారు ఆర్తులు, జిజ్ఞాసువులు, అర్థార్థులు, జ్ఞానులు, అనీ; ఈ నలుగురిలో ఆర్తులే మొదట పేర్కొనబడినారు.

"పరమా పదమాపన్నో మనసాచింతయద్ధరిమ్" గొప్ప ఆపత్తులో చిక్కుకొన్న గజేంద్రుడు నిండు మనస్సుతో హరిని ప్రార్థించాడు. "మహత్యాపది సంప్రాప్తే స్మర్తవ్యో భగవాన్ హరిః" గొప్ప ఆపదను పొందినవాడు ఆపదను తొలగించే హరిని ధ్యానించవలెను; (వసిష్ఠగీత) "ఆపన్నానాం పరాగతిః". ఆపన్నులకు పరమ రక్షకుడు శ్రీరాముడు, అని తార తన భర్తయైన వాలికి హిత బోధ జేసింది. "ఆర్తానాం ఆర్తి హంతారం" దీనుల దుఃఖాన్ని పోగొట్టేవాడు భగవానుడని ప్రమాణ వాక్యాలున్నాయి. ఆర్తిని ఉపశమింపజేయడమే మొదటి విధిగా పరిగణింపబడినది.

"తావదార్తి స్తథా వాంఛా తావన్మోహస్తథా సుఖం। యావన్నయాతి శరణంత్వా

మశేషాఘనాశనమ్ ॥" ఎంతవరకు హరిని శరణుపొందదో, ఎంతవరకు పాపరాశి నశించదో, అంతవరకే బాధ, కోరిక; అంతవరకే మోహం, తర్వాత సుఖం ఉంటుంది. శరణాగతుడైన వ్యక్తి కోరిన ఫలమంతా సిద్ధిస్తుందని అర్థం. 'విధి' శబ్దం చేత ప్రజల ఆర్తిని శమింప జేసే కార్యమందు భగవంతునికి ఎంతో శ్రద్ధ, ఆదరం ఉంటుందని వ్యక్తమవుతున్నది.

"సత్కర్మనిరతాః శుద్ధాః సాంఖ్యయోగ విదస్తథా। నార్హంతి శరణస్థస్య కలాం కోటితమీ మపి ॥" కర్మయోగ నిష్ఠులుగానీ, సాంఖ్యయోగనిష్ఠులుగానీ, శరణాగతుడైన వ్యక్తి యొక్క మహిమలో ఒక కోటివంతు భాగానికైనా సమానులు కారు అని చెప్పబడింది.

**బద్ధ దీక్షస్య విష్ణోః :–** 'దీక్ష' అంటే నియమం, వ్రతం, దృఢమైన సంకల్పం. భగవానుడు నిత్యముక్తుడు. ఆశ్రితుల బంధ విముక్తి కోసం భగవానుడు తన దీక్షచే కట్టుబడి ఉంటాడు. ఆయనకు వేరే బంధకం లేదు. "ఏత ద్వ్రతం మమ". "ఇది నా నియమం." అని తాన్నే చెప్పినాడు కదా! విష్ణువు అంతటా వ్యాపించి ఉన్నందువల్ల, ఎక్కడ ఆర్తి ఉంటే అక్కడ త్వరగా దాన్ని తొలగించడం సంభవమే.

"అనాథాం కిం ఉపేక్షసే". దీనురాలిని కాపాడవా? కృష్ణా! అని ద్రౌపది వేడుకొన్న వెంటనే బద్ధ దీక్షుడై అక్షయమైన వలువలనిచ్చి కాపాడినాడు కదా!

'దీక్ష' అనే శబ్దం వల్ల ఆపన్నుల ఆర్తిని ప్రశమింప జేయడమే యజ్ఞమనీ ధ్వనిస్తున్నది. ఆయజ్ఞమందు "పత్యుర్నోయజ్ఞ సంయోగే" అనే ప్రమాణాన్ని బట్టి దీక్షితుడు పత్నితో కూడి యుండడం ఆవశ్యకమని వస్త్వంతరమూ అనురణిస్తున్నది.

**ఐకమత్యోపపన్నాం ప్రియ సహచరీంత్వాం ఆచఖ్యుః :–** ఆపన్నార్తి ప్రశమన వ్రతమందు లక్ష్మీదేవి పతితో సమాన భావమే కలిగి ఉంటుంది, భక్త రక్షణమందు ప్రియమైన సహచారిణి అని తత్త్వవిదులు కీర్తిస్తుంటారు. "అర్థో విష్ణుః, ఇయం వాణీ", విష్ణువు వస్తువైతే, ఆ వస్తువును తెలిపే సంజ్ఞావాచకం శ్రీదేవి. "యజ్ఞోవై విష్ణుః" విష్ణువు యజ్ఞం, శ్రీదేవి దక్షిణ. విష్ణువు న్యాయశాస్త్రం. శ్రీదేవి నీతి.

**"సహధర్మచరీతవ"–** సీతాదేవి నీకు సహధర్మచారిణి–అన్న జనకుని మాట

స్మరణీయం. అలౌకిక శ్రేయస్సాధనమే ధర్మం. "స ఉశ్రేయాన్ భవతి జాయమానః" అని శ్రుతి. భగవానుడు అవతరించడమే శ్రేయస్సు. దాన్ని సాధించడమే ధర్మం. ఆ ధర్మమే ఆయన దీక్ష. ఆ దీక్ష ఈమెచే సహచరింపబడుతుంది.

**ప్రాదుర్భావైరపి సమతనుః :-** 'ప్రాదుర్భావం' అంటే కర్మ బంధకమైన జన్మ కాక, కేవలం తమ సంకల్పం చేతనే ఇష్టమైన రీతిగా జన్మించడమని అర్థం. భగవానుడు దేవ దేహాన్ని దాల్చితే లక్ష్మి కూడా దేవతాదేహాన్నే దాల్చుతుంది. ఆయన మనుష్య శరీరాన్ని ధరిస్తే ఈమె కూడా మానుష శరీరాన్నే ధరిస్తుంది. "విష్ణోః శ్రీరనపాయినీ"- (వి.పు) అన్నట్లు, ధర్మ సంస్థాపన కోసం ధరించే రామకృష్ణాద్యవతార దశలోనూ ఈమె సీతా రుక్మిణ్యాదిగా అవతరించింది. ఈ దివ్యదంపతులు ఎడబాటు లేకుండా, ఏక సంకల్పంతో కలసి ఉంటారు.

**ప్రాధ్వమన్వీయసే త్వం :-** 'ప్రాధ్వం' ఆనుకూల్యమని అర్థం. "ఆనుకూల్యార్థం ప్రాధ్వం" (అమరం) "అనుగుణాన్ భావాన్ స్వయంబిభ్రతీ" అన్నట్లు, యజ్ఞాన్ని నిర్వహించడం కోసం దంపతులు ఒకే సంకల్పంతో, అన్యోన్య రూప గుణశీలాదులు కలిగియుండడం అత్యావశ్యకం. "ఛాయే వాను గతా సదా". సూర్యుణ్ని ప్రభవలె, వ్యక్తిని నీడ లాగా, లక్ష్మీదేవి తన భర్తను సర్వదేశ దశాకాలాలలో విడనాడక అనుసరిస్తుందని అర్థం.

**దూరోత్క్షిప్తైరివ మధురతా దుగ్ధరాశే స్తరంగైః :-** లక్ష్మీదేవి యొక్క సాహచర్యానికి రమ్యమైన దృష్టాంతం మధురంగా చెప్పబడింది.

"మధ్యే విరించి గిరిశం ప్రథమావతారః". శ్రీ మహావిష్ణువు యొక్క మొదటి అవతారం పాలకడలియందు పరవాసుదేవ రూపం. అక్కడ, ఆ పర వాసుదేవ రూపం నుంచి దేవతల ఆర్తిని విని, దేవితో కూడి వివిధ తనువులను పరిగ్రహించి, విభవం, అర్చాదిరూపాలతో అక్కడక్కడ వెలసియున్నాడు.

క్షీరాబ్ధి శాయియైన దేవుని అవతారాలు పాలకడలి కెరటాలుగా వర్ణింపబడినాయి. భర్తతో సహచరించే దేవి క్షీర మాధుర్యంగా వర్ణింపబడింది. భగవానుడు పాలు; భగవతి లక్ష్మి మాధుర్యమనడం అద్భుతమైన నిరూపణం.

మాధుర్యం కలిగియుండడమే పాలకు ప్రాశస్త్యం. అలాగే, లక్ష్మీదేవి చేతనే భగవానునికి గౌరవం. భగవానుడు మధురుడు కాడా? మధురైకాన్తుడు కాడు. ఆయన చండశాసనుడైన దండధరుడు కూడా. లక్ష్మీదేవి మాత్రం మధురై కాంత. భగవానుడే దేవిని "మధురా మధురాలాపా" అని పేర్కొన్నాడు కదా! శ్రీదేవి యొక్క సహయోగం చేత శ్రియఃపతికి మాధుర్యమబ్బినదని స్పష్టమవుతున్నది.

పాలకడలినుంచి పైకి ఎగసి దూరంగా దరివైపు వీచిపోయే అలలను పాలయందు విడువక ఉండే మాధుర్యం కూడా అనువర్తించినట్లే, భగవానుని అవతారాలతో పాటు లక్ష్మీదేవి కూడా ఆయనకు అనుకూలమైన రూపాలతో అవతరించి అనువర్తిస్తుంది.

భగవదవతారాలకు క్షీరసాగర తరంగాలు ప్రతిబింబాలు. శ్రీదేవి అవతారాలకు అపృథక్సిద్ధమైన మాధుర్యం ప్రతిబింబత్వం. "అన్వీయసే"– సహచరించడం సాధర్మ్యం.

దయా దేవీ స్తోత్రమందు "జలధేరివ శీతతా" అన్నట్లే, శ్రీ దేవీ స్తుతియందు "దుగ్ధరాశే రివ మధురతా" అని క్షీర సముద్ర తనయకు క్షీర మాధుర్యమే దృష్టాంతం.

**"యత్రవాక్యద్వయే బింబ ప్రతిబింబత యోచ్యతే ।**
**సామాన్యధర్మో వాక్యజ్ఞైః సదృష్టాన్తో నిగద్యతే ॥"**

రెండు వాక్యాలలో సామాన్యధర్మం బింబ ప్రతిబింబ భావంగా వర్ణింపబడడం 'దృష్టాంతాలంకార' లక్షణం.

**11.** **ధత్తేశోభాం హరిమరతకే తావకీ మూర్తిరాద్యా,**
**తన్వీతుంగస్తన భరనతా తప్త జాంబూనదాభా ।**
**యస్యాంగచ్ఛంత్యుదయ విలయైర్నిత్యమానందసింధా**
**విచ్ఛా వేగోల్లసితలహరీ విభ్రమం వ్యక్తయస్తే ॥**

**అర్థం :**– ఓ లక్ష్మీ దేవీ! తప్త, జాంబూనద+ఆభా= పుటం వేసిన (కాల్చిన) బంగారం లాంటి వన్నె కల్గిన; తుంగ, స్తన, భర, నతా = ఎత్తైన చన్నుల బరువు చేత కొంచెం వంగిన; తన్వీ = సన్నని; తావకీ = నీదైన; ఆద్యా=మొదటి, మూర్తిః = రూపం; హరి

మరతకే = హరి అనే మరతకమణియందు; శోభాం = ప్రకాశాన్ని; ధత్తే= (వృద్ధి చేస్తున్నది) కలిగిస్తున్నది. నిత్యం = ఎల్లప్పుడు, ఆనంద సింధౌ = ఆనంద సాగరమైన; యస్యాం = ఏ (నీ) రూపమందు; తే= నీ యొక్క; వ్యక్తయః = (అవతార) రూపాలు; ఉదయ విలయైః = ఆవిర్భావ తిరోభావాలతో; ఇచ్ఛా వేగ+ఉల్లసిత, లహరీ విభ్రమం = (నీ) సంకల్పాతిశయం చేత ఏర్పడిన, అలల విలాసాన్ని; గచ్ఛన్తి = పొందుతున్నవి.

**తా॥** ఓ శ్రీదేవీ! అపరంజి బంగారు వన్నె కలిగిన, ఉన్నత స్తనాల భారంచేత కొద్దిగా వంగిన, సన్నని నీ మూల రూపం మరకతమణి కాంతి వంటి కాంతి కలిగిన భగవానుని రూపమందు అధిక శోభను కలిగిస్తున్నది. నిత్యం ఆనందసాగరమైన నీ పర రూపమందు ఏర్పడిన నీ అవతారాలు నీ సంకల్ప వేగం చేత ఉద్భవించి లయమయ్యే తరంగాల విలాసాన్ని పొందుతున్నాయి.

**వ్యాఖ్య:- శ్రీదేవి రూప లావణ్యాన్ని వర్ణించే శ్లోకమిది.**

శ్రీదేవీ స్వరూప వర్ణనానంతరం ఆమె రూపాన్ని వర్ణిస్తున్నారు దేశికులు. స్వరూపం ఆత్మకు సంబంధించింది. కాబట్టి గత శ్లోకంలో మాధుర్యంతో పోల్చబడింది. మాధుర్యం కంటికగుపడేది కాదు. రూపం-దివ్యావయవ సామూహిక శోభ నయనగోచరమయ్యేది కదా! కాబట్టి బంగారంలాంటి భౌతిక ద్రవ్య కాంతితో పోల్చబడింది. లక్ష్మీదేవి దివ్యమంగళ తేజస్సు తప్తమైన సువర్ణచ్ఛాయగలది. "రుక్మం కార్త స్వరంజాంబూనద మష్టాపదోఽ స్త్రియామ్"- జాంబూనదమంటే బంగారమని అమర నిఘంటువు.

**"హేమ్నః సంలక్ష్యతేహ్యగ్నౌ విశుద్ధిః శ్యామికాపివా"**

బంగారం చొక్కమో, కేటి బంగారమోదాన్నిమూసలో పెట్టి అగ్నిలో కాల్చితే తప్ప స్వచ్ఛమైన బంగారమని తెలియదు కదా! కాబట్టి లక్ష్మి నామావళిలో "ధన్యాం హిరణ్మయీాం లక్ష్మీమ్" అనీ, "హిరణ్య వర్ణాంహరిణీమ్" అని శ్రీ సూక్తం మొదటనే పేర్కొన్నది. కాబట్టి, లక్ష్మీదేవి రూపం పుటం వేసిన బంగారంలాంటి వన్నె కలది అని వర్ణితం. లక్ష్మీదేవి శరీరం బలిసిన, ఎత్తైన స్తనాలభారంతో కొంచెం వంగియున్నది. తన్వీ అంటే సన్నని శరీరం కలది. "తన్వీశ్యామా" అనేది కాళిదాస కవి 'మేఘసందేశ

కావ్యం' లో ఒక శ్లోకం. అక్కడ "శ్యామా యౌవనమధ్యస్థా" అని మల్లినాథుని వ్యాఖ్య. సాముద్రిక శాస్త్రరీత్యా యువతుల దేహం సన్నగా ఉండడం ఉత్తమ స్త్రీ లక్షణం. దేశికులు 'గోదాస్తుతి'లోనూ 'స్తనభర నమితాంగీ" అని గోదాదేవిని వర్ణించారు. "నీవారశూకవత్ తన్వీ" అని వేదం కూడా "తన్వీ" అని వర్ణించింది. ఇది లక్ష్మీదేవి యొక్క "ఆద్యామూర్తిః"– తొలి రూపం అంటే పరదేవతా రూపం–వైకుంఠంలో వెలసియున్న మంగళదేవత యొక్క దివ్య రూపం అని స్పష్టపరిచారు దేశికులు.

**ధత్తే శోభాం హరిమరతకే :**–మరకతమణి పచ్చగా ఉంటుంది. బంగారంతో పొసగియున్న మరతకమణికాంతి శోభాయమానంగా ఉంటుంది. 'మరతకమణి వంటి హరి' అంటే ఉపమానోత్తర పదకర్మధారయ సమాసమవుతుంది. 'హరియే మరతకమణి' అంటే రూపక సమాసపదం. పరమపద నాథుడైన హరిమరతకానికి తప్త జాంబూనదాభయైన ఆదిలక్ష్మి యొక్క రూపం అప్రమేయ తేజస్సును కలిగిస్తున్నది. స్వతః సుందరుడై పురుషుల దృష్టి చిత్తా పహారియైన హరియొక్క వక్షః స్థలమందు నివసించిన లక్ష్మీదేవి హరికి శోభాతిశయావహ సౌందర్య అని అభివ్యక్తం.

**నిత్యం ఆనంద సింధౌ :**– ఆనంద నిలయమందు ఎల్లప్పుడు ఆనందమయుడై ఉండే నారాయణునికి పత్నియైనందువల్ల లక్ష్మీదేవి రూపం ఆనంద సాగరమే. "జ్ఞానానంద మయా లోకాః"– శుద్ధ సత్త్వ ద్రవ్యాలన్నిటికి స్వయంప్రకాశత్వం చేత జ్ఞానత్వం, ఆనందత్వమని "న్యాయసిద్ధాంజ"నాది గ్రంథాలయందు బోధింపబడింది. భగవానుడు జ్ఞానానందాత్మకుడైనట్లే అయన దివ్య మంగళ విగ్రహం కూడా జ్ఞానానందాత్మకమే. అలాగే లక్ష్మీదేవి యొక్క రూపం కూడా జ్ఞానానందాత్మకమైనదే కదా! ఈ దివ్యదంపతుల మూల రూపాలు నిత్యమైనవి. కార్యకారణ రూపాలుగా భాసించేవి.

**యస్యాం గచ్ఛంత్యుదయ విలయైః– లహరీ విభ్రమం వ్యక్తయస్తే :**– సముద్రం నుంచి వాయువేగం చేత పర్వతాల వంటి తరంగాలు పుట్టి, మళ్ళీ సముద్రంలోనే కలిసిపోతాయి. అలాగా, పరవాసుదేవ రూపం నుంచే వ్యూహ, విభవ, హార్ద, అర్చ అనే ఇతర అవతారాలు కలుగుతాయి. ఆదిమూర్తియైన లక్ష్మీదేవి రూపం నుంచి

కూడా ఆమె సంకల్పబలం చేతనే ఇతర అవతారాలు– సీత, రుక్మిణి మొదలైన, ఆమె యొక్క వేర్వేరు మూర్తులు ఆవిర్భవించి, ఆదిలక్ష్మి మూర్తియందే లీనమవుతాయి. నారాయణుని అవతరాల రీతిగా, ఆదిలక్ష్మి యొక్క అవతారాలు కూడా జ్ఞానానందాత్మకమైనవని సూచితం.

రూపకోప మాలంకార సజ్జిత శ్లోకమిది.

**12.** **ఆసంసారం వితత మఖిలం వాఙ్మయం యద్విభూతిః,**
**యద్భ్రూ భంగాత్కుసుమధనుషః కింకరోమేరుధన్వా ।**
**యస్యాం నిత్యం నయన శతకై రేకలక్ష్యో మహేంద్రః**
**పద్మే! తాసాం పరిణతిరసౌభావలేశై స్త్వదీయైః ॥**

**అర్థం :–** ఆ సంసారం = సృష్టి మొదల్కొని అంతట; వితతం = వ్యాపించిన; అఖిలం= సమస్తమైన; వాఙ్మయం = శబ్దరాశి; యత్+విభూతిః = ఏ సరస్వతి యొక్క సంపదయో; మేరుధన్వా = మేరు పర్వతాన్ని ధనుస్సుగా కలిగిన శివుడు; యత్+భ్రూభంగాత్= ఏ పార్వతి యొక్క కనుబొమల కదలిక వల్ల; కుసుమ ధనుషః = (పువ్వులే ధనుస్సుగా కలిగిన) మన్మథునికి; కింకరః = దాసుడాయెనో; మహేంద్రః = దేవేంద్రుడు; యస్యాం= ఏ శచీదేవి యందు; నిత్యం=ఎల్లప్పుడు; నయన శతకైః = వందల కన్నులతో; ఏక లక్ష్యః= ఒకే లక్ష్యం కలవాడో; పద్మే = ఓ లక్ష్మి! త్వదీయైః = నీకు సంబంధించిన; భావ లేశైః = కొద్దిపాటి సంకల్పం చేత; తాసాం = వారికి (సరస్వతి, పార్వతి, శచీదేవి అనే దేవేరులకు) అసౌ = ఇట్టి; పరిణతిః = భాగ్య పరిపాకం; కలిగినది.

**తా॥** ప్రపంచమందంతట విస్తరించిన సమస్త వాఙ్మయం ఏ సరస్వతీ దేవి సంపదయో, పరమశివుడు ఏ పార్వతి యొక్క భ్రూభంగవల్ల మన్మథునికి వశుడైనాడో, దేవరాజు ఏ శచీదేవియందు వేయి కన్నులతో ఏకలక్ష్యం కలవాడో; ఆ ముగ్గురికి, ఓ లక్ష్మీదేవీ! నీ అనుగ్రహంలేశం చేతనే కదా ఇట్టి వైభవం కలిగింది.

**వ్యాఖ్య:– సౌభాగ్యదాయిని యైన లక్ష్మీదేవి మాహాత్మ్యం వర్ణితం.**

**ఆసంసారం వితత మఖిలం వాఙ్మయం యద్విభూతిః :–** లక్ష్మీదేవి అనుగ్రహంవల్ల సరస్వతి వాగ్దేవతగా విరాజిల్లుతున్నది. వాఙ్మయం అంటే వర్ణ పద

వాక్యాత్మక శబ్ద వికారం.'మయట్' ప్రత్యయం వికారార్థకం. నాడుగానీ నేడుగానీ ప్రపంచమంత మాటచేతనే వ్యవహరిస్తున్నది.

"చత్వారి వాక్పరిమితా పదాని । తానివిదుర్బ్రాహ్మణా యే మనీషిణః । గుహాత్రీణి నిహితా నేంగితాని। తురీయం వాచో మనుష్యా వదంతి" ॥ అని వేదవాణి వాగ్విభూతిని వర్ణించింది.

వాగ్రూపాలు నాలుగు. సహృదయులైన వేదవిదులకు తెలుస్తాయి. వీటిలో మూడు అంతరంగంలో రూపుదాల్చి, నాల్గవది బహిరంగమై ప్రకటితమవుతుంది. ఈతురీయ రూపమే మనుష్యులచే భాషింపబడుతుంది.

1. పరా :- ప్రాణమందు స్ఫురణ రూప జ్ఞానంగా ఉంటుంది.
2. పశ్యంతీ :- మనస్సున సంకల్ప రూపాన్ని ధరించేది.
3. మధ్యమా :- ధ్వన్యాత్మకమైన హృద్గత భావనా రూపం.
4. వైఖరీ :- అక్షరాత్మకమైన వాక్కుగా ప్రకటితరూపం. జ్ఞాన ద్రవ్యమైనందువల్ల 'వాగ్వైఖరి' చెవుల ద్వారా లోన ప్రవేశించి హృదయాన్ని స్పందింప జేస్తుంది.

ఈ వాగ్విభూతి "సహస్రా క్షరా పరమేవ్యోమన్" అన్నట్లు, ఆయా భాషలలో ఆకాశ గుణకమైన శబ్ద రూపమై అభిధా, లక్షణా, వ్యంజనా శక్తులతో విస్తరించి, సరసాలం కృతయై వ్యవహృతమవుతున్నది.

వాస్తవంగా, సంసారంలో వాగ్భూషణమే భూషణం.

రసాత్మికయైన సరస్వతీ సౌందర్యాన్ని జూచి ముగ్ధుడైన బ్రహ్మదేవుడు తన నాలుగు నోళ్ళను వెళ్లబెట్టాడు. తన రూప సంపదకు వశుడైన చతుర్ముఖుని రసనాగ్రమందు నర్తించి బ్రాహ్మీదేవత స్వాధీన పతికయై భాసిస్తున్నది.

"దేవతిర్మఙ్మనుష్యేషు పుంనామాభగవాన్ హరిః ! స్త్రీ నామ్నా లక్ష్మీర్మైత్రేయ! నానయోర్విద్యతే పరమ్ ॥" (వి.పు) దేవ, మానవ, పశు, పక్షి జాతులలో భగవానుడైన హరియే పురుష శబ్దవాచ్యుడు. ఓ మైత్రేయ! లక్ష్మీదేవియే స్త్రీ శబ్ద వాచ్యురాలు. శీలవయోవృత్తులలో సమానులైనా, స్త్రీ, పుంలింగ భేదంచేత లక్ష్మీ నారాయణులుగా వ్యవహరింపబడుతున్న వీరిద్దరియందే 'పరత్వం' నియతంగా ఉంది. మరొకరి యందు

లేదు, అని భావం. పరదేవతయైన లక్ష్మీదేవి కృపా కటాక్షంవల్ల సరస్వతికి వాగ్విభూతి లభించింది. "విభూతిర్భూతిరైశ్వర్యం"– (అమరం).

**యద్భ్రూభంగాత్ కుసుమధనుషః కింకరో మేరుధన్వా :–**

"మేరుధన్వా"– (ధనుషశ్చ ఇతి అనఙ్ సమాసాన్తః.)

త్రిపురాసుర సంహార సమయంలో మేరు పర్వతాన్ని ధనుస్సుగా మలచుకొన్న శివుడు (ఎంతో దృఢమైన శరీరం కలవాడు) అని అర్థం. "కుసుమ ధనుషః"– (వాసంజ్ఞాయాం ఇతి అనఙో వికల్పాత్.) పుష్పమే ధనురాయుధంగా కల మన్మథుడు (ఎంతో సుకుమారుడు) అని అర్థం. పరమశివుడు పార్వతీదేవి యొక్క భ్రూ విలాసం వల్ల మన్మథునికి దాసుడయ్యాడు. శివుని కోపానికి దగ్ధుడయినా, మన్మథుడు పార్వతీ సౌందర్యాన్ని తన అస్త్రంగా మల్చుకొని పరమేశ్వరుణ్ని గెల్చాడు. పరమేశ్వరుడు కామవశుడయ్యాడు.

ఇక్కడ 'కుమార సంభవ' మనే మహాకావ్యంలోని శ్లోకం స్మరింపదగినది.

**"తవ ప్రసాదాత్ కుసుమాయుధోఽపి**
**సహాయ మేకం మధుమేవ లబ్ధ్వా ।**
**కుర్యాం హరస్యాపి పినాక పాణేః**
**ధైర్యచ్యుతిం; కే మమధన్వినోఽన్యే ॥"**

పుష్పాయుధుడు (మన్మథుడు) కూడా నీ అనుగ్రహం వల్ల ఒక్క మకరంద బిందువును మాత్రమే సహాయంగా పొంది "పినాక మనే విల్లు చేతియందు కలిగియున్న హరుని ధైర్యాన్ని కూడా సడలింపజేస్తాను. ఇతర ధానుష్కులు నాకేపాటివారు?" అన్నాడు మన్మథుడు.

కుసుమ, మేరు శబ్దాలకున్నంత భేద స్ఫూర్తి కుసుమ, పినాక, శబ్దాలలో లేదు. దేశికులు ఈ 'శ్రీ స్తుతి'లో 'కుసుమాయుధః' అనే చోట 'కుసుమ ధనుషః' అనీ 'పినాక పాణేః' అనే స్థానంలో 'మేరుధన్వా' అనీ ఉభయత్ర ధను శ్శబ్దాన్ని ప్రయోగించి ఔచిత్యాన్ని పాటించడం స్పృహణీయం కదా!

కాముడు మొదట ఒక్క మధుబిందువునే సహాయంగా తలచాడు. స్థాణువు

యొక్క ఆశ్రమానికి వెళ్ళి, ఆయన తపోదార్ఢ్యాన్ని చూడగనే భయపడినందువల్ల నిరాశుడయ్యాడు. తర్వాత ఈశ్వరునికి సేవచేసే కోరికతో ఆశ్రమంలోకి ప్రవేశిస్తున్న పార్వతీదేవిని కాముడు చూశాడు; మళ్ళీ తన కార్యసిద్ధి కోసం పూనుకొన్నాడు. పార్వతీదేవి పరమేశ్వరునికి నమస్కరించిన వెంటనే కాముడు ఆ దేవినే సహాయంగా భావించి సమ్మోహనాస్త్రాన్ని ప్రయోగించాడు. వెంటనే స్థాణువైన ఈశ్వరుడు కలత చెందాడు. "బృహత్సహాయః కార్యాంతం క్షోదీయానపిగచ్ఛతి"– అల్పుడైననూ, గొప్ప సహాయం కలవాడై కార్యసిద్ధిని పొందుతాడు అనే న్యాయమున్నది కదా! కాబట్టి, పార్వతీ దేవి భ్రూభంగ సహాయంవల్ల మన్మథుడు ఈశ్వరుణ్ని జయించాడని చెప్పబడింది. కు.సం.లోని పంచమ సర్గం చివర–ఈశ్వరుడు "అద్య ప్రభృత్యవనతాంగి! తవాస్మిదాసః" – ఓ అవనతాంగీ! ఇప్పటి నుండి నీకు దాసుడను అని పార్వతితో పల్కాడు. దేశికులీ శ్లోకంలో 'దాస' శబ్ద స్థానమందు కింకర శబ్దాన్ని ప్రయోగించారు. పరమేశ్వరుడు పార్వతికి మాత్రమే దాసుడు కాదు, ఆమె భ్రూవిలాసాన్ని అనుసరించి మన్మథునికి కూడా దాసుడయ్యాడని స్వారస్యం.

**"యస్యాం నిత్యం నయన శతకై రేకలక్ష్యో మహేన్ద్రః"–**

'ఇంద్ర' శబ్దం 'ఇది–పరమైశ్వర్యే' అనే ధాతువు నుంచి నిష్పన్నమై 'త్రిలోకాధిపతి' అనే అర్థాన్ని తెల్పుతుంది. "మహాన్వై అయమభూత్‌యో వృత్రమవధీత్ ఇతి, తన్మహేంద్రస్య మహేంద్రత్వమ్"– ఇంద్రుడు వృత్రాసురుణ్ని వధించినందువల్ల 'మహేంద్ర' శబ్దవాచ్యుడయ్యాడని శ్రుతి బోధిస్తున్నది. కాబట్టి, మహేంద్రుడు పరిపూర్ణ శక్తి కలిగిన త్రిలోకాధిపతి అనే అర్థాన్ని తెల్పుతుంది. 'నయన శతకైః' అనడం వల్ల ఒక్క ముఖమందే వందల కన్నులున్నాయని కాదు; గౌతముని శాపంవల్ల ఇంద్రుడు తన శరీరం నిండా–ముందు, వెనుక, ఇరుప్రక్కల–వేయి కన్నులు కలవాడయ్యాడు. చాలా కన్నులుండడం వల్ల దర్శన సౌకర్యమధికం కదా! "ఆఖండలః సహస్రాక్షః" (అమరం) స్త్రీలకు ప్రియులపట్ల సౌభాగ్యమే పురుషార్థం. మహేంద్రుడు వేరే విషయాలను వదలిపెట్టి, తన పత్నియైన పులోమజను వేయి కన్నులతో ఎల్లప్పుడు తదేక లక్ష్యంగా చూస్తుంటాడు. "పులోమజా శచీంద్రాణీ" – (అమరం).

**తాసాం పరిణతి రసౌ భావలేశైస్త్వదీయైః :-** సరస్వతికీ, పార్వతికీ, ఇంద్రాణికీ విభూతిమత్త్వం, స్వాధీన పతికత్వం, సౌందర్యాతి శయంతో కూడియున్న విగ్రహవత్త్వం లక్ష్మీదేవి యొక్క కటాక్ష లేశం చేతనే కదా! ఆ ముగ్గురికి ఇలాంటి సౌభాగ్యఫలం శ్రీదేవి యొక్క తేజోఽంశ సంభవమే.

ఈ శ్లోక రచనలో 'సబ్రహ్మా సశివస్సేంద్రః' అనే శ్రుతినీ "బ్రహ్మా స్వయంభూశ్చతురాననోవా" అనే రామాయణ శ్లోకాన్ని అనుసరించిన క్రమం గోచరిస్తుంధి.

**13. అగ్రేభర్తుః సరసిజమయే భద్రపీఠే నిషణ్ణా,**
**మంభోరాశేరధిగత సుధా సంప్లవా దుత్థితాం త్వామ్ ।**
**పుష్పాసారస్థగిత భువనైః పుష్కలావర్తకాద్యైః**
**క్లుప్తారంభాః కనకకలశైరభ్యషించన్ గజేన్ద్రాః ॥**

**అర్థం:-** అధిగత సుధాసంప్లవాత్ = వెన్వెంటపొందిన అమృత ప్రవాహం కలిగిన; అంభోరాశేః = పాలకడలినుంచి; ఉత్థితాం=అవతరించినట్టి; భర్తుః = భర్త యొక్క; అగ్రే = ఎదుట; సరసిజమయే= కమల రూపంగా ఉన్న; భద్రపీఠే=సింహాసనమందు; నిషణ్ణాం = ఆసీనవైన; త్వాం=నిన్ను; పుష్ప+ఆసార, స్థగితభువనైః=పూల వానచే కప్పబడిన లోకాలు కలిగిన; పుష్కల+ఆవర్తక+ఆద్యైః=పుష్కలం, ఆవర్తకం మొదలైన మేఘాలతో కూడి; క్లుప్త+ఆరంభాః= కల్పింపబడిన ఆరంభంకలవై; గజ+ఇంద్రాః= శ్రేష్ఠమైన ఏనుగులు; కనక కలశైః = బంగారు కలశాల చేత; అభ్యషించన్= స్నానం చేయించినవి; అభిషేకం చేశాయి.

**తా॥** అమృత ప్రవాహానికి ఉత్పత్తి స్థానమైన క్షీరసాగరం నుంచి ఉద్భవించి, ఉపేంద్రుని యెదుట పద్మరూపంగా ఉన్న సింహాసనమందు కూర్చున్న ఓ లక్ష్మీదేవీ! నిన్ను పుష్కలావర్తక మేఘాలు పుష్పవృష్టిచే లోకాలు ఆచ్ఛాదింపబడునట్లు అభిషేకించాయి. వెంటనే భద్రగజాలు స్వర్ణ కలశాలతో నీకు అభిషేకం చేశాయి.

**వ్యాఖ్య:- లక్ష్మీదేవి పట్టాభిషేకం వర్ణితం.**

శ్రీ మహాలక్ష్మి యొక్క ఆవిర్భావమూ, పట్టాభిషేక వైభవమూ వివరించే

శ్లోకమిది.

**అంభోరాశేరధిగత సుధాసంప్లవాదుత్థితాం :-** 'అధిగత' అనడం వల్ల క్షీర సముద్రాన్ని మథించినప్పుడు కామధేనువు, కరీంద్రం, అప్సరసలు, అమృతం జనించిన వెంటనే లక్ష్మీదేవి ఉద్భవించిందని తెలుస్తున్నది. 'ఉత్థితాం' అనే పదం కలశోదధి నుంచి లక్ష్మీదేవి పైకి లేచింది అనే అర్థమిస్తుంది, పుట్టిందని కాదు. అమృత కలశం తేలిన వెంటనే దానితోపాటు లక్ష్మీదేవి ఆవిర్భవించింది.

**"తతో ధన్వంతరిర్దేవః శ్వేతాంబరధరః స్వయమ్ ।**
**బిభ్రత్కమండలుం పూర్ణమమృతస్య సముత్థితః ॥**
**తతః స్ఫురత్ కాంతి మతీ వికాసికమలే స్థితా ।**
**శ్రీదేవీ పయసస్త స్మాత్ ఉద్భూతా ధృతపంకజా ॥"**

(వి.పు. 1-9-98,100)

తర్వాత, తెల్లని దుస్తులు ధరించిన, భగవానుడైన ధన్వంతరి అమృతం నిండియున్న కమండలువును పట్టుకొని పైకి లేచాడు. ఆ తర్వాత, తేజో విరాజమానయై, వికసించిన పద్మమందు ఆసీనయైన లక్ష్మీదేవి చేతులతో కమలాలను ధరించి ఆపాల కడలి నుంచి లేచింది.

సముద్ర మథనానికి ముఖ్యోద్దేశ్యమైన అమృతకలశం, ప్రకటిత మవడమే తడవుగా 'పద్మాలయ' ఆవిర్భవించడం జగన్మంగళదాయకమని అభివ్యక్తం. బలాత్కారంగా అమృత కలశాన్నిలాగుకొన్న దైత్యులను మోహింపజేయడానికి విష్ణుమూర్తి తనలాగా స్త్రీ వేషాన్ని దాల్చడం శ్రేయోదాయకమని లక్ష్మీదేవి సంకల్పమేమో అన్నట్లు ద్యోతకమవుతున్నది. దూర్వాసముని శాపం వల్ల నష్టపడిన స్వర్గసీమ శ్రీదేవి ఆవిర్భావంవల్ల మళ్ళీ సశ్రీకమయింది కదా!

**అగ్రే భర్తుః సరసిజమయే భద్ర పీఠేనిషణ్ణామ్ :-** విష్ణుపత్నియైన లక్ష్మీదేవి సుకుమారమైన శరీరం కలది కాబట్టి, ఆమెకు కమలాసనం స్వాభావికమైనది. "అగ్రే భర్తుః" అనడంవల్ల ఇంతవరకు కనబడక ఉన్న లక్ష్మి పాలకడలినుంచి పైకి లేచినప్పుడు ఆమెను సేవించిన వాళ్ళల్లో మొదటివాడు విష్ణువే.

సరసిజమయే – (తత్ప్రకృతవచనే మయట్) 'భద్రపీఠ' మంటే సింహాసనం. మంగళకరమైన పీఠం తామరపువ్వు రూపంలో ఉన్నది. "శివం భద్రం కల్యాణం మంగళం శుభమ్" (అమరం).

పద్మరూప భద్ర పీఠమందు ఆసీనయైన లక్ష్మీదేవికి క్షీరసాగరం నుంచి పైకి లేచిన సమయమందే అభిషేక మంగళం వర్ణింపబడింది. రామాయణంలో 'సహసీత' మన్న మాటకు అంత ప్రాధాన్యం లేదు. 'అగ్రేభర్తుః' అనడంవల్ల భర్తకు నిరూపకత్వమే మహిషికి – పట్టంపు రాణికి–ప్రాధాన్యం. లక్ష్మి మంగళదేవతయే కదా!

**పుష్పా సారస్థగిత భువనైః పుష్కలావర్తకాద్యైః :–** ఆ సమయాన బృందారకులందరు లక్ష్మీదేవికి సముచిత సేవలను చేస్తుండగా, పుష్కలావర్తకాది నామాలు కలిగిన ప్రసిద్ధ మేఘాలు పూలవానను కురిపించాయి. "ధారా సంపాత ఆసారః" (అమరం) 'ఆసారః' అంటే జడివాన. మేఘాలు వర్షించిన పూలచేత లోకాలన్నీ ఆచ్ఛాదింపబడినాయి." మేఘచ్ఛన్నేఽహ్నిదుర్దినం"– సూర్యరశ్మి సోకకుండా మబ్బులుపడిన దినాన్ని దుర్దినమంటారు. పుష్కలంగా పుష్పవృష్టి రూప కైంకర్యం చేస్తూ ఆనందాన్ని (ఆవర్తింప) అతిశయింపజేస్తున్న పుష్కలావర్తకాది మేఘాలు ఆవరించిన దినం దుర్దినం కాదు, సుదినమే.

"శరీరిణాం స్థావర జంగమానాం సుఖాయతజ్జన్మదినం బభూవ"– అన్నట్లు పూలవాన కురియడంతో సుదినమే అది. దేహధారులకూ, చరాచర వస్తువులకూ సుఖం కలిగించడానికే మేఘచ్ఛన్నమైనది కాబట్టి, ఆదినం–శ్రీదేవి ఆవిర్భవించిన దినం–సుదినమే.

**క్లృప్తారంభాః కనక కలశై రభ్యషించన్ గజేంద్రాః–** 'క్లృప్త+ఆరంభ' శబ్దానికి ఆరంభించి, మొదలుపెట్టి, అని అర్థం. మేఘాలు పుష్పవృష్టిని ఆరంభించగానే దిగ్గజాలు స్వచ్ఛమైన సువర్ణకలశ జలాలతో లక్ష్మీదేవిని అభిషేకించాయి.

'కనకకలశైః' అనీ 'సౌవర్ణాన్ చతురో ఘటాన్' అనీ 'సీతరామ పట్టాభిషేక ఘట్టం'లో దిగ్గజాలవంటి వానర వరులు జలపూర్ణ సువర్ణ ఘటాలను తీసుకొని

వస్తే, వసిష్ఠాది ఋషులు అభిషేకించారని ఉన్నది. ఇక్కడ మేఘాలు పుష్పవర్షంతోనూ, గజేంద్రాలు కనకకలశోదకాలతోనూ ఒకే సమయంలో లక్ష్మీదేవిని అభిషేకించడం గజలక్ష్మి వైభవం. గజాలను మేఘాలతో, మేఘాలను గజాలతో పోల్చడం కవి సమయం; కావ్యాలలో ప్రేక్షణీయం.

"ఐరావతం గజేంద్రాణామ్" అని నిర్ధారితం. పూర్వం 'ఐరావతం' పైన ఆరూఢుడై ఊరేగుతున్న దేవేంద్రుడు దూర్వాసుడిచ్చిన పూలమాలను గౌరవంగా ఆఘ్రాణించి, ఆ గజ కుంభస్థలం మీద విసరివేశాడు. ఐరావతం ఆ పుష్పమాలను తీసి కాళ్ళకింద వేసి తొక్కింది. ఆ ఐరావత గజేంద్రం కూడా ఇప్పుడే క్షీరాబ్ధి నుంచి జనించింది.

"అభ్యషించన్ గజేంద్రాః" అనడంవల్ల ప్రధానమైన ఐరావతం, పుండరీకం, వామనం, కుముదం, అంజనం, పుష్పదంతం, సార్వభౌమం, సుప్రతీకం అనే అష్ట దిగ్గజాలు తమ తొండాలచే బంగారు కలశాలను ఎత్తి మంగళదేవతకు పవిత్ర జలధారలతో మంగళస్నానం చేయించాయి.

"గంగాద్యాః సరితస్తోయైః స్నానార్థముపతస్థిరే ।
దిగ్గజా హేమపాత్రస్థ మాదాయ విమలంజలమ్ ।
స్నాపయాం చక్రిరే దేవీం సర్వలోక మహేశ్వరీమ్ ॥" గంగాది నదులు తమ జలాలచే స్నానం చేయించడం కోసం అక్కడికి చేరవచ్చాయి. లక్ష్మీదేవికి దిగ్గజాలు సువర్ణ కలశాలలో నిండియున్న నదుల పరిశుద్ధ జలాలతో సర్వలోక మహేశ్వరియైన శ్రీ లక్ష్మీదేవిని అభిషేకం చేశాయి- అని శ్రీ పరాశర మహర్షి - పురాణరత్న-సూక్తి.

**14.** **ఆలోక్యత్వామమృత సహజే! విష్ణు వక్షః స్థలస్థాం,**
**శాపాక్రాన్తాః శరణమగమన్ సావరోధాస్సురేన్ద్రాః ।**
**లబ్ధ్వా భూయస్త్రి భువనమిదం లక్షితం త్వత్కటాక్షైః**
**సర్వాకార స్థిర సముదయాం సంపదం నిర్విశంతి ॥**

**అర్థం:-** అమృత సహజే = అమృతానికి తోబుట్టువైన ఓ లక్ష్మీదేవీ! విష్ణు వక్షః స్థల

స్థాం = విష్ణువుయొక్క వక్షః స్థలమందు ఉన్న; త్వాం = నిన్ను; ఆలోక్య=సందర్శించి; శాప+ఆక్రాంతాః = శాపాన్ని పొందిన; సుర+ఇంద్రాః = దేవ ప్రముఖులు; స+అవరోధాః = పత్నులతో కూడిన వారై; శరణం=శరణు; అగమన్= పొందిరి. త్వత్ కటాక్షైః = నీ కడకంటి చూపులచేత; లక్షితం = చూడబడిన; ఇదం=ఈ; త్రిభువనం= మూడు లోకాలను; భూయః = మళ్ళీ; లబ్ధ్వా = పొంది; సర్వ+ఆకార, స్థిర, సముదయాం = అన్ని విధాలా శాశ్వతమైన అభివృద్ధి గల; సంపదం=ఐశ్వర్యాన్ని; నిర్విశంతి=అనుభవిస్తున్నారు.

**తా॥** అమృతం జనించిన వెంటనే ఆవిర్భవించిన ఓ లక్ష్మీ దేవీ! విష్ణు వక్షః స్థలమందు నివసించిన నిన్ను జూచి, శాపగ్రస్తులైన ఇంద్రాది దేవ ప్రముఖులు తమ భార్యలతో కూడిన వారై శరణుజొచ్చినారు. నీఅపాంగ వీక్షణాలచే అనుగ్రహింపబడిన ఈత్రైలోక్య సామ్రాజ్యాన్ని మళ్ళీపొంది సర్వప్రకారాలచే పూర్ణమైన, స్థిరమైన అభ్యుదయం గల ఐశ్వర్యాన్ని అనుభవిస్తున్నారు.

**వ్యాఖ్య:- శాపగ్రస్తులైన సురేంద్రులు లక్ష్మీదేవి కటాక్షం చేత సశ్రీకులైన వర్ణన.**

**అమృత సహజే :-** లక్ష్మీదేవిని సంబోధించే పదమిది. అమృతంతో కూడ పుట్టిన పదార్థాలకన్న విలక్షణమైన మహత్త్వం లక్ష్మీదేవికి కలదని ప్రశంసిస్తున్న పదమిది. అమృతం దేవతలను మరణభయం నుంచి కాపాడేది. దానితోడ ఆవిర్భవించిన లక్ష్మీదేవి అమరులకు సకల సంపదలనిచ్చి రక్షించేదనే భావాన్ని ప్రకటిస్తున్న సంబోధన.

**శాపాక్రాంతాః సురేంద్రాః :-** దూర్వాసమహర్షి అనుగ్రహించిన పుష్పమాలను దేవేంద్రుడు స్వీకరించి, తానధిష్ఠించిన ఐరావత నాగం యొక్క తలమీద అనాదరంగా వేశాడు. ఆ గజం ఆ మాలా ప్రభావం తెల్యక దాన్ని తన తొండంతో లాగి తన కాళ్ళక్రింద వేసి త్రొక్కి పెట్టింది. దేవరాజు చేసిన ఈ అపరాధానికి దూర్వాసుడు క్రుద్ధుడయ్యాడు.

"తస్మాత్ ప్రణష్ట లక్ష్మీకం త్రైలోక్యం తే భవిష్యతి"- (వి.పు) మర్యాదను అతిక్రమించడంవల్ల నీ మూడు లోకాల ఐశ్వర్యం భ్రష్టమవుతుందని మహర్షి

శపించాడు.

"తతః ప్రభృతి నిశ్శ్రీకం సశక్రం భువనత్రయమ్". అప్పటినుంచి దేవతలూ, ముజ్జగాలూ నష్టైశ్వర్యంతో – అష్టదరిద్రంతో–అలమటించిన వృత్తాంతం సూచితం.

**ఆలోక్యత్వాం విష్ణు వక్షః స్థల స్థాం :–** క్షీర సముద్రమథనమప్పుడు అమృత కలశం జనించిన వెంటనే ప్రాదుర్భవించి, అభిషిక్తయై, భూషణభూషితయై, సమస్త దేవతా గణం చూస్తుండగా లక్ష్మీదేవి హరి యురః స్థలమనే మరతక సింహాసనమందు ఆసీనయైనది. శాపంవల్ల నిస్తేజులై, నిర్వీర్యులై, దైత్యులచే పరాభవింపబడిన సురేంద్రులు సనాథయై, ఆకారత్రయ సంపన్నయైన లక్ష్మీదేవిని కరణత్రయ పరిశుద్ధులై సందర్శించారు.

**శరణ మగమన్ సావరోధాః :–** "పత్నీభిరను గచ్ఛేమ దేవాన్" అనే శ్రుతి ప్రకారం, ఎవరైనా, తమతమ పత్నులతో కూడి శరణాగతులైతే ఫలం సిద్ధిస్తుంది. కాబట్టి, దేవ ప్రముఖులందరు తమ తమ భార్యలతో చేరి లక్ష్మీదేవిని ప్రపత్తి చేశారు. గజేంద్రులు ఐరావతం యొక్క అపరాధాన్ని క్షాళనం చేసినట్లే, దేవేంద్రాపరాధాన్ని సురేంద్రులు క్షాళనం చేయడానికి సావరోధులై శరణుచొచ్చారు.

"సిద్ధ గంధర్వ యక్షాశ్చ తతస్త్వాం శరణం గతాః" అని 'రామాయణం'లో దేవ ప్రభృతులు శరణాగతి చేశారు. అలాగా, సురేంద్రులు తమ శాపనివృత్తి కోసం, లక్ష్మీ కటాక్షం లేకపోతే తమకు సౌఖ్యమే ఉండదని తమ తమ దారలతో కూడి, భర్తృ సంశ్లేషణం చేత ప్రసన్నంగా ఉన్న శ్రీదేవిని శరణుపొందారు.

**లబ్ధ్వా భూయ స్త్రి భువనమిదం లక్షితం త్వత్కటాక్షైః :–** "తతోఽ వలోకితా దేవాః హరి వక్షః స్థలస్థయా" విష్ణు వక్షః స్థలమందున్న శ్రీదేవిచేత దేవతలు చూడబడినారు. "శ్రియాజుష్టం చత్రైలోక్యం బభూవ మునిసత్తమ"–మూడు లోకాలు లక్ష్మీ కటాక్షవీక్షణం చేత మళ్ళీ సకల సంపదలతో విలసిల్లాయని శ్రీ పరాశర మహర్షి వాక్యానుసారంగా శ్రీమద్వేదాన్త దేశికులు కూడా శ్రీదేవిని స్తుతించారు.
**సర్వాకార స్థిర సముదయాం సంపదం నిర్విశంతి :–** లక్ష్మీ దేవి యొక్క చల్లని కడకంటి చూపులచే త్రైలోక్య సామ్రాజ్యం, శాపం పొందకముందు భోగోపకరణ,

భోగస్థానాది సర్వప్రకారాలతో ఎలా శోభించి ఉండిందో, మళ్ళీ అలాగే అన్ని విధాలా స్థిరమైన అభ్యుదయంతో విరాజిల్లుతున్నది. కాబట్టి, దేవతలు సకల సంపదలను శాశ్వతంగా అనుభవిస్తున్నారు.

"శ్రియాజుష్టం చ త్రైలోక్యంబభూవ"అని ఆర్షవాక్యం. శ్రీమద్యామున మునులు "త్రిభువనం సంప్రత్యనంతోదయమ్" అన్నారు. (చతుఃశ్లోకి). 'సురవ్రజ స్త్వద్దాస దాసీగణః' అనే భావాన్ని "సావరోధాస్సురేంద్రాః" అని దేశికులు సంవదించారు. శ్రీ నిగమాన్త దేశికులు పరిశుద్ధ సంప్రదాయ ప్రవర్తకులు కదా!

**15. ఆర్తత్రాణ వ్రతిభిరమృతా సారనీలాంబువాహైః**
**అంభోజానాముషసిమిషతామంతరంగైరపాఙ్గైః ।**
**యస్యాం యస్యాం దిశి విహరతే దేవి! దృష్టిస్త్వదీయా**
**తస్యాం తస్యామహమహమికాంతన్వతే సంపదోఘాః ॥**

**అర్థం:-** హేదేవి = విహరణ శీలవైన ఓ లక్ష్మీదేవీ! ఆర్తత్రాణ వ్రతిభిః = బాధలు పొందిన వారిని కాపాడడమే వ్రతంగా కల్గినట్టి; అమృత+ఆసార, నీల+అంబువాహైః = అమృతాన్ని వర్షించే నల్లని మేఘాలవంటి; ఉషసి = ప్రాతఃకాలమందు; మిషతాం= వికసించిన; అంభోజానాం= కమలాలకు; అంతరంగైః = సమీపమందు ఉన్నట్టి; అపాంగైః = కడకంటి చూపులతో; త్వదీయా=నీదైన; దృష్టిః = చూపు; యస్యాం యస్యాం = ఏయే; దిశి=దిక్కునందు; విహరతే= ప్రసరిస్తున్నదో; తస్యాం తస్యాం= ఆయా దిక్కునందు; సంపత్+ఓఘాః = ఐశ్వర్యం యొక్క ప్రవాహాలు; అహమహమికాం= నేను ముందు నేనేముందు అనే భావంతో; తన్వతే=బాగా విస్తరిస్తున్నాయి.

**తా॥** ఓ లక్ష్మీదేవీ! ఆర్తులను రక్షించడమే దీక్షగా కలిగియున్న, అమృతాన్ని వర్షించే నీలమేఘాలను పోలియున్న, ఉషఃకాలాన వికసించిన తామర పూలకు సన్నిహితాలైన కటాక్షాలతో నీ దృష్టి ఎటువైపు విహరిస్తుందో ఆచోట సంపదలు నేనేముందు నేనేముందు అనే భావంతో రాశులు రాశులుగా వ్యాపిస్తున్నాయి.

**వ్యాఖ్య:- లక్ష్మీ కటాక్షం వల్ల చేతనులకు కష్టాలు తొలగి సకల సంపదలు కల్గునని**

**వర్ణితం.**

లక్ష్మీదేవి యొక్క కడకన్నులు ఆర్తులను రక్షించే దీక్షగలవి. అవి నీలాంబువాహాలనూ, పద్మాలను పోలి ఉన్నాయి.

**1. ఆర్తత్రాణ ప్రతిభిః :-** "ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ"- (భ.గీత) భగవంతుణ్ని భజించేవారు నాలుగు రకాలుగా ఉంటారని శ్రీ భగవానువాచ. వీరిలో మొదటివారే ఆర్తులు. "ఆర్తిః పీడా" (అమరం) సంసారంలో కష్టాలచేత బాధపడే వారెక్కువగా ఉన్నారు. ఏది కష్టం? ఏది సుఖం? అనే ప్రశ్న సంసారుల మానసానుభవానికి సంబంధించింది. కనీసం కూడు, గుడ్డ, వసతి లేకుండా దేహబాధలను పొందుతున్న జీవులు ఆర్తులనబడుతారు. అందరు సాధారణంగా ఐశ్వర్యాన్ని కోరుతారు. ఉన్న సంపదలు ఊడిపోయిన వారు నష్టైశ్వర్యులు. తమకు లేని సంపదలు కావాలనే వారు అర్థార్థులు. కాబట్టి ఐశ్వర్యార్థులు రెండు విధాలుగా ఉంటారు. ఐశ్వర్యం కూడా ధనరూపంగానూ, ఆధిపత్యంగానూ ద్వివిధమైనది.

"అర్ద్యతే ఇతి ఆర్తిః". చేయరాని పనులు చేసినందువల్ల కలిగిన ఫలరూపమైన పీడచే దుఃఖించడమే 'ఆర్తి' యని వ్యుత్పత్త్యర్థం. ఆర్తిచే మొరపెట్టుకొనే వారిని రక్షించడమే ఆర్తత్రాణవ్రతం.

ఆర్తత్రాణ పరాయణుడు శ్రీమన్నారాయణుడే.

భగవత్కృపచేత సృజింపబడిన ప్రపంచంలో తమకేమి కావాలన్నా భక్తితో ప్రార్థించి దాన్ని పొందేవారిని 'ఉదారులు' అని గీతాచార్యులన్నారు. ఆర్తులను రక్షించడమనేది లక్ష్మీకటాక్షం యొక్క ఔదార్యమే!

శరణాగతి చేసిన సర్వప్రాణులకోసం అభయమిస్తున్నాను "ఏతద్వ్రతంమమ" అని సీతాపతి తన హృదయాన్ని ఆవిష్కరించాడు.

"అపాంగా భూయాం సో యదుపరి పరం బ్రహ్మ తదభూత్ అమీయత్ర ద్విత్రాః సచశత మఖాది స్తదధరాత్"- (శ్రీగుణరత కోశం.30)

లక్ష్మీ కటాక్షం నిండుగా ప్రసరించినందువల్ల పరబ్రహ్మ పదార్థంగా పరిణమించిందని, కొంచెం తక్కువగా ప్రసరించడంవల్ల బ్రహ్మేంద్రాదులయ్యారని

శ్రీ పరాశర భట్టర్ స్తుతించారు. ఆర్తత్రాణ వ్రతాన్ని చేబట్టినవి లక్ష్మీదేవి కడ కన్నులే అని కవి కేసరి ఆశయం.

"అపాంగౌ నేత్రయోరంతౌ"– 'అపాంగ' శబ్దానికి "కడకన్ను" అనీ "కటాక్షోఽపాంగ దర్శనే"– కటాక్షమంటే 'కడకంటి చూపు' అని అమర నిఘంటువు.

'దృక్ దృష్టి' పదాలు నయనైకార్థబోధకాలే కదా!

**2. అమృతాసార నీలాంబువాహైః :-**

అంబువాహమంటే నీటిని వహించే మేఘాలు. అవి నీలవర్ణంతో శోభిస్తాయి. నీలవర్ణం చలువకూ, అనంతత్వానికీ సంకేతం. నీలమేఘశ్యాముడంటే 'విష్ణుమూర్తి' అని అర్థం. శ్రీనివాసుని దయా స్వరూపానికి చిహ్నమది. "పూర్ణతా గౌరవాయ"– నీటితో నిండియున్న మేఘాలకు గురుత్వముంటుందని కాళిదాసమహాకవి సూక్తి. "రూపమే వాస్మిన్ మహిమానం వ్యాచష్టే"– అని దివ్య రూప సంపద యొక్క లక్షణమని వేదం ఉద్ఘోషిస్తున్నది.

లోకాభిరామ రూప నీలమేఘాలు అమృతాన్ని వర్షిస్తాయి. అమృతవర్షం ప్రకృతి నయనాలకు అమృత ద్రవం. దేశసంపద, దాని అభివృద్ధి కూడా అమృత వృష్టి మీదనే ఆధారపడియున్నది. జగజ్జన జీవనాధారమైనది అమృతం.

'అమృత' శబ్దానికి జలమనీ, మోక్షమనీ, దేవతల ఆహారమనీ నానార్థాలున్నాయి. "పయఃకీలాల మమృతం జీవనం భువనం వనమ్" (అమరం) "అమృతం మోక్షే దేవాన్నే"– (వి.ని)

**"స్యాద్యజ్ఞ శేషాంబు నభో రసాయన**
**క్షీరాజ్య సోమాన్న సుధాసుచామృతమ్ ।**
**పథ్యా గుడూచ్యామలకీ ష్వయం స్త్రియాం**
**దేవేషు నాఽఽస్వాద్య వినాశినోఽస్త్రిషు"॥** (నా.ర)

కాబట్టి, అమృతాసారమంటే జలవర్షమని సామాన్యమైన అర్థం. మేఘాలు పుష్పాలను వర్షించాయని (13) సుశ్లోకితం. "కృతేచ ప్రతికర్తవ్యం" (రా) అన్నట్లు కృతజ్ఞ సార్వభౌమియైన శ్రీదేవి యొక్క నేత్రాంతాలు నీలాంబువాహాలయ్యి

పుష్పాసారానికి మారుగా అమృతాసారంగా ప్రవర్తిస్తున్నాయి. "ఐశ్వర్యమక్షరగతిం పరమంపదం వా". (శ్రీగుణ.ర) అన్నట్లు, ఆయా అధికారులకు సంపదను, మోక్షాన్ని ప్రసాదిస్తుంటాయని విశేషంగా మాన్యమైన అర్థం.

"సంతప్తానాం శరణమసి"- (మే.సం.1-7) నీలాంబువాహాలకు శరణాగత రక్షణమనే సౌశీల్యమున్నదన్నాడు కాళిదాస మహాకవి. బ్రహ్మణ్యత్వం, దేవ పితృభక్తి, సౌమ్యత్వం, అపరోపితాపిత్వం, మృదుత్వం, అపారుష్యం, మిత్రత్వం, ప్రియ వాదిత్వం, కృతజ్ఞత, శరణ్యత, కారుణ్యం, ప్రశాంతత్వమనే 12 గుణాలు శీలానికి సంబంధించినవని- హారీతుని వచనం.

అమృత వృష్టికోసం అనుకూలమైన పవనుని ప్రేరణ ఆవశ్యకం :- "యాం దిశం వాయురేతి తాందిశం వృష్టిరన్వేతి"- (శతపథ బ్రాహ్మణం) ముఖ్యంగా, ఏ దిక్కున గాలి మందం మందంగా వీచునో ఆ దిక్కున అమృత (జల) వృష్టి జరుగుతుంది. కాబట్టి, దేశికులవారు శ్రీదేవి యొక్క అపాంగాలను 'నీలాంబువాహాలు' అని ప్రస్తుతించారు.

"మందం మందం నుదతి పవనశ్చానుకూలో యథాత్వం". (మే.సం) మేఘాన్ని అనుకూల వాయువు మెల్లమెల్లగా నడుపుతుందని కవికులగురువైన కాళిదాస సూక్తి.

**"దద్యాద్దయాను పవనో ద్రవిణాంబుధారాం**
**అస్మిన్నకించన విహంగ శిశౌ విషణ్ణే ।**
**నారాయణ ప్రణయినీ నయనాంబు వాహః" ॥**

(కనకధారాస్తవం-8) - దయ అనే అనుకూల పవనం కలిగిన, నారాయణుని ప్రేయసియైన లక్ష్మీదేవి యొక్క చూపు అనే జలపూర్ణ మేఘం, దుష్కర్మమనే వేడిమిని చిరకాలం దూరంగా తొలగించి, దుఃఖితయైన ఈ దరిద్రచాతక పక్షి శాబకమందు (భక్తుని మీద) ధనమనే జలధారను ప్రసరింపజేయుగాక - అని శ్రీ శంకర భగవత్పాదులు లక్ష్మిని స్తుతించారు.

**3. అంభోజానా ముషసిమిషతా మంతరంగై రపాంగైః :-**

అంభోజాలంటే నీటియందు పుట్టిన వస్తువులు అని శబ్దార్థం. అయినా

కమలాలూ, కలువలూ అని రూఢి. 'ఉషసి మిషతాం' అనే విశేషణంవల్ల ప్రభాతంలో వికసించిన తామరపూవులనియే వాచ్యార్థం. కలువలు సాయంకాలాన వికసించడం కవి సమయం.

"సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్" - ఇంద్రియాలన్నిటిలో నేత్రేంద్రియానికే ప్రాముఖ్యమని ఆర్యోక్తి. లక్ష్మీదేవి నేత్ర సౌందర్యం నిరూపమానం. అయినా అందం, చందం, గంధం, శుచి, రుచి (కాంతి) శైత్యం, మార్దవం, సౌభాగ్యం, సంపద మొదలైన వాటికి ప్రతీక పద్మం. కాబట్టి కన్నులను పద్మాలతో పోల్చడం పరిపాటి.

"శ్రియ మున్నిద్ర పద్మాక్షీమ్"- 'వికసించిన పద్మం వంటి కన్నులు కలది' అని శ్రీదేవిని ఇంద్రుడు స్తుతించాడని ఆర్షవచనం (వి.పు)

"దృష్టిః ప్రహృష్ట కమలోదర దీప్తిః" (క.ధా.స్త:9)

సమగ్రంగా వికసించిన పద్మంలోపలి కాంతిలాంటి కాంతి కలది లక్ష్మీదేవి చూపు అని స్తుతించారు శ్రీ శంకరాచార్యులు.

అలాగే, లక్ష్మీదేవి దృష్టి వికసించిన అంభోజాల అంతరంగాల వంటి కటాక్షాలతో కూడియున్నదని శ్రీ దేశికులు స్తోత్రం చేశారు.

ఉషఃకాలంలో తామర మొగ్గలు రేకులు విచ్చుకొంటాయి. అప్పుడు విప్పారిన పద్మాలపైన ఉన్న కాంతికంటె లోపల ఉన్న కాంతి ఎంతో చిక్కణంగా ఉంటుంది. అంతటి సౌహార్దం, నైగనిగ్యం కలది లక్ష్మీదేవి కడకంటిచూపు.

**విహరతే దేవి! దృష్ట స్త్వదీయాః**- శ్రీదేవి శీలాన్ని అనుసరించి ఆమె దృష్టి కూడా స్వేచ్ఛగా విహరిస్తుంది. 'విహరతే' అని ఆత్మనే పదప్రయోగాన్ని బట్టి దృష్టి విహరణం ఆమె దయాలీలయే అని అభివ్యక్తం.

**యస్యాం యస్యాం దిశి** - తస్యాం తస్యాం అహమహమికాం తన్వతే సంపదోఘాః :- లక్ష్మీదేవి దయతో ఏయే దిక్కులను చూస్తున్నదో ఆయా దిక్కులనిండా ధనధాన్యాది సంపదలు పరస్పర స్పర్ధతో పరుగెత్తుతున్నాయి. పదాల ద్విరుక్తి వల్ల, దేవి ఆజ్ఞాపించకముందే, ఆయా దిగంతాలవరకున్న జనుల మీద కృపతో కటాక్షాన్ని

ప్రసరింపజేసిన వెంటనే, సకల సంపదలు ఏకకాలంలో వారికి చేరిపోతున్నాయని వ్యక్తమవుతున్నది. ఆర్తులను రక్షించే లక్ష్మీకటాక్ష వీక్షణం యొక్క అనన్య మహత్వాన్ని తెలిపే ఈ శ్లోకం వాచకలుప్తోపమాలంకార సజ్జితం.

**16.** **యోగారంభత్వరిత మనసోయుష్మదైకాంత్యయుక్తం,**
**ధర్మం ప్రాప్తుం ప్రథమ మిహయే ధారయంతే ధనాయామ్ ।**
**తేషాం భూమేర్ధన పతి గృహాదంబరాదంబుధేర్వా,**
**ధారానిర్యాంత్యధిక మధికం వాంఛితానాం వసూనామ్ ॥**

**అర్థం:-** ఇహ = ఈ జగమందు; యే = ఏ భక్తులు; యోగ+ఆరంభ త్వరిత మనసః = భక్తి యోగాన్ని ఆరంభించడానికి త్వరపడిన మనస్సు కలవారై; యుష్మత్+ఐకాంత్య యుక్తం = మీ ఇద్దరి యందే ఏకాంత భక్తి గల; ప్రథమం = మొదటి, శ్రేష్ఠమైన; ధర్మం = యాగాది ధర్మాన్ని; ప్రాప్తుం = పొందడానికి; ధనాయాం= ధనాశను; ధారయంతే = (ధరించి) కలిగి ఉంటారో; తేషాం= (ఆద్రవ్యాశ కల) వారికి; భూమేః = భూమి నుంచి గానీ; ధనపతి గృహాత్ = కుబేరుని భవనం నుంచిగానీ, అంబరాత్= ఆకాశం నుంచి గానీ; అంబుధేః వా = సముద్రం నుంచి గానీ; వాంఛితానాం= కోరుకొన్న; వసూనాం=ధనధాన్యాది సంపదలయొక్క; ధారాః = ప్రవాహాలు; అధికం అధికం = మిక్కిలి ఎక్కువగా; నిర్యాంతి = వచ్చి చేరుతుంటాయి.

**తా॥** ఓ పూజ్యలక్ష్మీ! ఈ లోకమందు ఏ భక్తులు యోగానుష్ఠానాన్ని ఆరంభించడానికి త్వరపడిన మనస్సు కలిగినవారై మీ ఇద్దరిని మాత్రమే ఉద్దేశించిన శ్రేష్ఠమైన ధర్మాన్ని పొందాలని ధనాశాపరులవుతారో వారికి భూమి నుంచిగానీ, కుబేరుని కోశాగారం నుంచిగానీ, ఆకసం నుంచిగానీ, అబ్ధి నుంచి గానీ సకల సంపదలు సమృద్ధిగా లభిస్తాయి.

**వ్యాఖ్య:- అర్థార్థులకు కలిగే ఫలాన్ని నిరూపించే శ్లోకమిది.**

ఐశ్వర్యార్థులు భక్తులెలా అవుతారు? వారు స్వార్థపరులు కదా! అంటే, ఫలాపేక్ష లేకుండా శాస్త్ర విహిత ధర్మాన్ని అనుష్ఠించడానికి ద్రవ్యం అవసరం. కాబట్టి, స్వార్థం అనే కళంకం లేని పరార్థ పరులైన అర్థార్థులను భగవద్భక్తులుగా కీర్తించాడు

శ్రీకృష్ణ భగవానుడు.

"వివిదిషంతి యజ్ఞేనదానేన తవసాఽనాశకేన" భక్తులు మోక్షసాధనమైన యజ్ఞాన్నీ, దానాన్నీ, ఆహార నియమంతో కూడిన తపస్సునూ చేయగోరుతారు అని శ్రుతి బోధిస్తున్నది.

**యోగారంభ త్వరిత మనసః** :- యోగమంటే భక్తి యోగం. కర్మజ్ఞాన సహకృతమైనది భక్తి. కర్మలు తమంత తాము భగవత్ప్రాప్తిని కలిగించవు. కేవలం వేదాంత వాక్యార్థ జ్ఞానం జ్ఞానం అనబడదు.

ఇష్టాపూర్త కర్మలు పుణ్యకర్మలు. ఆలయ తటాకారామాది నిర్మాణాలు,యజ్ఞాది కర్మలు పావనం చేస్తాయి. అంటే పాపాలను తొలగిస్తాయి.

"భగవంతుడు స్వామి. నేను అతని సొత్తును, తొత్తును" అంటే, శేష శేషి భావ సంబంధం తెలిసి మెలగాలి.

''వ్యవసాయాత్మికాబుద్ధిరే కేహకురునందన''- (భ.గీ.2-41) నిశ్చయాత్మకమైన బుద్ధి అంటే కామ్యకర్మలు చేయని దృఢాధ్యవసాయం కలవాడై ఉండాలి కదా!

**"శ్రేయః సృతిం భక్తి ముదస్యతే విభో**
**క్లిశ్యంతియే కేవలబోధ లబ్ధయే ।**
**తేషామసౌ క్లేశల ఏవ శిష్యతే**
**నాన్యద్యథా స్థూలతుషావఘాతి నామ్ ॥**

(భాగ.10-14-4)

భక్తిని వృద్ధి చేయడానికి సాయపడే జ్ఞానం సార్థకమైనది. భక్తియే శ్రేయః సాధనం. సకల శుభాలకు ఉద్గమస్థానం. భక్తిని వదలి ఆత్మజ్ఞానం కోసం పాటుపడే వారికి ఉనుకను (పొల్లును) దంచితే బియ్యం లభించని విధంగా శ్రమయే మిగులుతుంది.

యోగం, భక్తి, ధ్యానం, ఉపాసన అనేవి వేర్వేరు కావు, పర్యాయపదాలే.

"యోగకృత్యంతు యోగానాం ధ్యానమేవ పరం బలమ్" - (మహాభారతం.

289-7-8)

'యోగా' అని ఆరోగ్యం కోసం పడుతున్న పాట్లకు ఉపయోగిస్తున్న 'అసాధుపదం' యోగబలమనబడదు.

స్థిరమైన చిత్త వృత్తితో భగవన్నామాన్ని స్మరించడం, భగవద్గుణాలను చింతన చేయడమే యోగబలం.

"తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్" (యోగ సూత్రం. 3-2) దేవతను ఆలంబనంగా చేసుకొని చలించని విశ్వాసం కలిగిన ఏకాగ్రతయే ధ్యానం.

**"ద్రుతస్య భగవద్ధర్మాత్ ధారావాహి కతాంగతా ।**
**సర్వేశే మనసో వృత్తిః భక్తిరిత్యభిధీయతే ॥"**

భగవానుని గుణ మహిమను స్మరించడం వల్లగానీ, వినడంవల్లగానీ హృదయం ద్రవించి ధారావాహికంగా సర్వేశ్వరుని యందు వర్తించే చిత్తవృత్తియే భక్తి-యోగం.

'ఆరంభం' అంటే ఫలసాధనమైన కృషిని లేదా క్రతువును చేసే యత్నం.

**"జ్ఞానంచ వ్యవసాయశ్చ ద్వావ్పర ప్రతిపాదకౌ ।**
**వ్యవసాయా దృతే బ్రహ్మాన్నాసాదయతి తత్పరమ్ ॥"**

జ్ఞానం, దృఢాధ్యవసాయం అనే భగవత్ర్పాప్తికి హేతువులైన రెండింటిలో అధ్యవసాయం లేకపోతే భక్తి రూప జ్ఞానం సులభంగా కలుగదని శ్రీ శుక మహర్షి జనక మహారాజుకు బోధించారు.

భగవదారాధన రూపమైన కర్మానుష్ఠానానికి మనస్సు త్వరపడితే ఆరంభింపబడిన భక్తి పరిపూర్ణభక్తికి హేతువు అవుతుంది.

**యుష్మదైకాంత్య యుక్తం ధర్మం ప్రాప్తుం ప్రథమమ్ :-** బోధన రూపమైన ధర్మమే ఆచరింపబడితే కర్మ అనబడుతుంది.

'యజ-దేవ పూజాయాం' అనే ధాతువును బట్టి "యజ్ఞో వైవిష్ణుః"- విష్ణుమూర్తి అధియజ్ఞుడు, యజ్ఞమందు ఆరాధింపబడేవాడని అర్థం. భక్తులేకాగ్రచిత్తులై లక్ష్మీ నారాయణులిద్దరిని ఉద్దేశించి కైంకర్య రూప కర్మను ఆచరిస్తారు. ఈ దివ్య దంపతులను

వేర్వేరుగా పూజించే భావన గానీ, ప్రక్రియగానీ ఉండదు.

"ఉన్నాలల్లాల్ యావరాలుమ్ ఒన్నుమ్ కుఱై వేండేన్". (తి.వా.మొ) శ్రీ శఠకోప దివ్యసూరి శ్రీ సూక్తి రీతిగా, శ్రీ శ్రియః పతుల జంటను తప్ప వేరెవ్వరినిగానీ, వేరే ఫలాన్ని గానీ కోరరు. భక్తులు, జగత్తు భగవంతుని కార్యరూపమని లేదా జగచ్ఛరీరుడు భగవానుడనే భావనతోనే సమాజానికి బహుముఖ సేవనూ చేస్తారు. మానవ సేవకైనా, మాధవసేవకైనా వినియోగపరచే ధనం అవసరమైతే ఆ దివ్యదంపతులనే ప్రార్థించి పొందుతారు అని "ఐకాంత్య" శబ్దం తెల్పుతుంది.

సర్వభూత హిత రతితో మిత హిత సత్య వచస్కులై సముచిత సేవచేసే భాగ్యం దివ్య మిథున కైంకర్యంగానే మనస్కరించే ఈ యోగులకు "నమ్యంతేఽ స్మై కామాః" అని ఉపనిషత్తు ఉద్ఘోషించినట్లు భగవత్కామేతర కామాలు నమస్కరిస్తుంటాయి. లోకం మోకరిల్లుతుంది.

భక్తియోగానికి అంకురంగా చెప్పబడే కర్మ భగవత్కైంకర్యమే. భక్తియోగ దశలలో భగవత్కర్మానుష్ఠానం కంటె పూర్వదశలేదు. కాబట్టి తదారాధన, తదీయారాధనయే ప్రథమధర్మం. ప్రథమయుగధర్మం. మనో నిగ్రహయుక్తమైన ఈ కర్మ వల్ల భగవద్దర్శన మనే పరభక్తి, దానివల్ల పరజ్ఞానమనబడే భగవత్సంగమ రూపమైన మానసానుభవమూ, తత్ఫలితంగా పరమభక్తి అంటే భగవంతునితో ఎడబాటు కల్గుతుందేమో అని భయపడడం నైసర్గికం. సర్వకర్మ ఫలత్యాగనిరతి రూపమైన నివృత్తి ధర్మమే కలియుగ ధర్మం. అదే ప్రథమమైన, శ్రేష్ఠమైన ధర్మం."ఆదౌ ప్రధానే ప్రథమః" (అమరం).

**ఇహయే ధారయంతే ధనాయామ్ :-** ప్రపంచంలో అన్యాశ్రయమే లేని ఏకాంత భక్తి గల ధర్మప్రాప్తి కోసం ధనాశ కలవారని అర్థం. భక్తినీ, జ్ఞానాన్నీ లేదా "శేముషీ భక్తి రూపా" అన్నట్లు, భక్తి రూప జ్ఞానాన్ని ప్రసాదించుమని భగవంతుణ్ని యాచించడం బాగుంటుంది కానీ ధనాన్ని యాచించడం విడ్డూరం కాదా? అంటే, ద్రవ్యం భౌతికం, దైవికం అని రెండు విధాలు. కంటితో చూడదగినది భౌతికద్రవ్యం దైవికమనేది జ్ఞాన ద్రవ్యం. ఇది చెవులతో వినదగినది. "శ్రోతం దైవం, శ్రోత్రేణ హితద్ద్విందతే"

– ద్రవిణం బ్రహ్మవర్చసం'– బహుధా శ్రోతవ్యం, బహుభిః శ్రోతవ్యం" అని (బృ.ఆ.ర) ఉపనిషద్వాణి.

భౌతిక ద్రవ్యాన్నైనా, జ్ఞానద్రవ్యాన్నైనా దైవానుగ్రహంవల్లనే పొందగలం కదా! అయితే, వీరు ధనాన్ని ఆశించడం పరోపకారార్థమే. కాబట్టి పరార్థమే వీరి స్వార్థం. దైవారాధన రూపమైన యాగాదికర్మలు ధనం సమృద్ధిగా లేకపోతే నిర్విఘ్నంగా నిర్వహింపబడవు. పూర్వం రాజాధిరాజులు శత్రువులను జయించి తెచ్చిన ద్రవ్యంతోనే యజ్ఞాలు చేశారని మనకు ఇతిహాస పురాణాలవల్ల తెలుస్తున్నది కదా!

భగవదనుగ్రహం వల్ల పొందిన ద్రవ్యాన్ని భగవత్ప్రీత్యర్థం సమర్పించడంతోనే మానవత వికసిస్తుంది, పరిమళిస్తుంది.

**"య ఆత్మదా బలదా యస్య విశ్వ**
**ఉపాసతే ప్రశిషం యస్య దేవాః ।**
**యస్యఛాయాఽమృతం యస్యమృత్యుః**
**కస్మై దేవాయ హవిషా విధేమ" ॥** (తై.నా.ఉ)

ఎవడు జ్ఞానం, దేహబలం ప్రసాదిస్తుంటాడో, ఎవ్వని ఆజ్ఞను సర్వ దేవతలు, మానవులు శిరసావహించి ఆచరిస్తుంటారో, ఎవని నీడ మోక్ష హేతువో, ఎవనిని ఆశ్రయించక పోతే నరకప్రాప్తియో, అట్టి పరమాత్మను తప్ప ఏ దేవుణ్ని హవిర్దాన రూపమైన యజ్ఞం చేత ఆరాధిస్తాం?

'క' కారం 'పరబ్రహ్మ' వాచకం.కస్మై – పరబ్రహ్మనే ఆరాధిస్తామని వేద పురుషులు నిశ్చయించి యజ్ఞాలు చేసి ధన్యాత్ములయ్యారు కదా!

**'ధనాయా' అంటే, ధనం యొక్క ఆశ. (ధనేచ్ఛ)**

**"అశనాయోదన్యా ధనాయా బుభుక్షా పిపాసా గర్ధేషు"**

అనే సూత్రం చేత 'అశనాయా' శబ్దం బుభుక్షయందు, ఉదన్యా, పిపాసయందు, ధనాయా శబ్దం (గర్ధే) యందు నిపతింపబడింది. కాబట్టి, ఈ సూత్రంచే, ఈత్వాభావమై, 'అప్రత్యయాత్' అనే సూత్రం చేత 'ఆ' ప్రత్యయం వచ్చింది. సుప 'ఆత్మనః క్యచ్' అను సూత్రంచే 'క్యచ్' ప్రత్యయం చేరింది. నిపాత శబ్దమిది. "సన్యాసినోఽపి దధతే

మహతీం ధనాయామ్"- (సం.సూ). "అక్షం సౌదర్శనం తత్ క్షపయతు భవతా మేధ మానాం ధనాయామ్". (సుదర్శన శతకం.62) అని ఇతరత్ర ప్రయోగాలున్నాయి.

**తేషాం భూమేర్ధన పతి గృహాత్-- వసూనామ్ :-** భగవత్కైంకర్యార్థమైన ఆశాపరులకు వసుధారలు ఆవిర్భవిస్తుంటాయని వర్ణింపబడింది. ఈ ధారలకు అహంప్రథమికాపేక్ష- 'నేనేముందు' అనే పరస్పర స్పర్ధ లేదు. కాని ఒక్కొక్క ధార చరమికా రూప స్పర్ధతో - పూర్వ పూర్వాధికంగా ధార వృద్ధి చెందుతూ ప్రవహిస్తుండడం స్పృహణీయం. వసుధారలు వసుంధర-భూమి- నుంచి నిర్గమించడం మొదట నిర్దేశింపబడింది. భూమిలో అనేక ద్రవ్యాల నిధులున్నాయి కదా! వసుధ సీతామహాలక్ష్మికి తల్లి కాబట్టి అనేక వసుధారలు వచ్చి చేరుతున్నాయి. కృషి ఫలమిచ్చేది కదా!

ధనపతి గృహాత్ :- లక్ష్మీదేవి కుబేరుణ్ని కోశాధిపతిగా నియమించింది. కాబట్టి కుబేర భవనం- లక్ష్మి కోశాగారం- నుంచి ద్రవ్యధారలు ప్రవహిస్తున్నాయి.

(రఘు మహారాజు విశ్వజిద్యాగం చేసి రిక్తహస్తుడై యున్నప్పుడు వరతంతు ముని శిష్యుడైన కౌత్సుడు వచ్చి గురుదక్షిణ కోసం ద్రవ్యం కావాలని రాజును కోరినాడు. రాజు ధర్మలోపభయం చేత మట్టి పాత్రలతోనే కౌత్సునికి అర్ఘ్యపాద్యాది సత్కారం చేసి, సైన్యంతో పాటు కుబేరుని పట్టణానికి-అలకా నగరానికి- వెళ్ళదలచాడు. అంతే. తెల్లవారే లోపుగా కుబేర భవనం నుంచి కనకధారలు వర్షించి, రఘు మహారాజు కోశాగారం నిండిపోయింది. ఈ ముగ్గురి (రఘు, కౌత్స, కుబేరుల) ధార్మిక ప్రవృత్తులను కాళిదాసు "రఘువంశ మహాకావ్యం"లో ఉదాత్తంగా వర్ణించాడు.)

రఘు మహారాజు చరిత్రవల్ల ధనపతి గృహంనుంచి ధనం పొందిన వృత్తాంతం తెలుస్తుంది.

అంబరాత్ :- అంబరం అంటే ఆకాశం. అది విష్ణుపదమే. లక్ష్మీపతివల్ల ధనధారలు ప్రసరించే వృత్తాంతం కుచేలుని అటుకుల కిటుకువల్ల ప్రకటితం. కుచేలుడు రుక్మిణీ కృష్ణులను సమాశ్రయించాడు. తిరిగి వచ్చేవరకు తన గుడిసె ఉన్న చోట ధన కనక వస్తు వాహనాది సంపద్భరితమైన భవనం అతనికి గోచరించింది.

నిరవధికమైన ఐశ్వర్యం అంబరం నుంచే ఆవిర్భవించిందని (శ్లోక ప్రథమ చరణం) 'యుష్మత్' పద మహిమ ప్రకటిస్తున్నది.

అంబుధేః వా :- సముద్రం రత్నాకరం. లక్ష్మికి పుట్టిల్లు. తనకూ, తన భర్తకూ వాసగృహం. కాబట్టి, జాలరులు, వణిజులు సముద్రం నుంచి లభించిన ద్రవ్యం చేత సంపన్నులవుతుంటారు కదా!

అమృతోత్పాదనకోసం పాలకడలిని మథిస్తే, దాని నుంచి కల్పతరువు, కామధేనువు, చింతామణి, అమృతకలశాది ఐశ్వర్యాలు లభించాయి.

**నిర్యాంత్యధిక మధికం :-** అర్థార్థులు శ్రీ శ్రియఃపతులనిద్దరినీ ఆశ్రయిస్తే, వారు కోరుకున్న ధనం కంటే అధికమైన ధనం కుప్పలు కుప్పలుగా పొందుతారు.

జ్ఞాన వైరాగ్య భూషణులైన శ్రీ వేదాంత దేశికులను ఒక బ్రహ్మచారి ఆశ్రయించి తన వివాహానికి తగినంత ధనమిమ్మని ప్రార్థించాడు. ఇది భగవద్భాగవత నియమమని భావించిన ఆచార్యులు శ్రీదేవిని ఆశువుగా స్తుతించారు. ఈ శ్లోకంతో స్తుతిస్తుండగనే శ్రీదేవి ప్రసన్నయై కనకధారలను కురిపించిందని ఐతిహ్యం.

వాక్యార్థ హేతుక కావ్యలింగాలంకారం.

**17. శ్రేయస్కామాః కమలనిలయే! చిత్రమామ్నాయ వాచాం**
**చూడాపీడం తవ పదయుగంచేతసాధారయంతః ।**
**ఛత్రచ్ఛాయా సుభగశిరసశ్చామర స్మేర పార్శ్వాః**
**శ్లాఘాశబ్ద శ్రవణ ముదితాఃస్రగ్విణ స్సంచరంతి ॥**

**అర్థం:-** కమల నిలయే = కమలం నివాసంగా గల ఓ లక్ష్మీదేవీ! శ్రేయః+కామాః = తమ శ్రేయస్సును కోరుకొనే వారు; ఆమ్నాయ వాచాం = వేదాల యొక్క; చూడా+ ఆపీడం = శిరోభూషణమైన; తవ=నీ యొక్క; పద యుగం = పాద ద్వంద్వాన్ని; చేతసా= మనస్సు చేత; ధారయంతః = ధరిస్తున్న వారై; ఛత్ర చ్ఛాయా సుభగ శిరసః = గొడుగు నీడలో అందమైన తలలు కలవారుగా; చామర స్మేర పార్శ్వాః = చామరాలచే ప్రకాశించే ఇరుప్రక్కలు కలవారుగానూ; శ్లాఘా శబ్ద శ్రవణ ముదితాః = స్తోత్ర శబ్దాలను వినడం చేత సంతసించే వారుగానూ; స్రగ్విణః = పూల మాలికలను

ధరించే వారుగానూ; సంచరంతి = సంచరిస్తారు. చిత్రం = ఆశ్చర్యం.

**తా॥** పద్మాలయవైన ఓ లక్ష్మీదేవీ! ఉపనిషత్ప్రతిపాదితాలైన నీ చరణ యుగళిని మనస్సున ధరించి ధ్యానించే శ్రేయస్కాములు నీ కృపా కటాక్షం వల్ల రాజభోగాల ననుభవిస్తారు. ఉత్తమాధికారులైనందువల్ల ఛత్రచ్ఛాయలో వారి ఉత్తమాంగం శోభించగా, ఇరుప్రక్కల విం జామరాలచే వీచబడుతుంటారు. ప్రజలచే ప్రశంసితులవుతారు. పూలదండలచే అలంకరింపబడి వైభవంగా సంచరిస్తారు. ఇది చిత్రమే కదా!

**వ్యాఖ్య:- లక్ష్మీదేవిని ఉపాసించే వారు సకల భోగాలను అనుభవిస్తారని సుశ్లోకితం.** లక్ష్మీ కటాక్షం అర్థార్థుల మీద ప్రసరించే విషయాన్ని గతశ్లోకం వివరించింది. ఐశ్వర్యం ధనరూపమనీ, ఆధిపత్యరూపమనీ రెండు విధాలుగా ఉంటుంది కదా! సార్వభౌమత్వాది శ్రేయస్సును కోరుకొనే వారు శ్రేయస్కాములు. "శ్రియత ఇతిశ్రేయః " ఆశ్రయింప/ సేవింపబడేది; (శ్రిఞ్-సేవాయాం) అని వ్యుత్పత్త్యర్థం.

"పద్మేస్థితాం పద్మవర్ణాంత్వా మిహోపహ్వే యే శ్రియమ్" అని శ్రీ సూక్తం.

"సేవాపేక్షా తవచరణయోః శ్రేయసేకస్య నస్యాత్" అని మూడవ (3) శ్లోకం, లక్ష్మీ చరణ సేవాపరులకు శ్రేయస్సు కలుగుతుందని తెల్పింది.

ఈ శ్లోకం, "తృప్తాం, తర్పయంతీం"- శ్రీ సూక్త ప్రకారం, భగవత్సం శ్లేషంవల్ల కలిగిన ఆనందంచేత తృప్తిపొందిన లక్ష్మీ దేవి, ఇహపరభోగాలను అభిలషించి ధ్యానించే వారినీ తృప్తిపరుస్తుందని వివరిస్తుంది.

**కమలనిలయే :-** ఆర్ద్రత, సౌందర్యం, సౌకుమార్యం, సౌభాగ్యం గల లక్ష్మీదేవి తనకు తగిన శోభగల కమలమందే నివసిస్తుంది.

కం జలం అలతి భూషయతి ఇతి కమలం. జలాన్ని అలంకరించేది కాబట్టి, కమలమని పేరు. చేపలు కదలుతుంటే రేగిన చిరుకెరటాల తాకిడికి కదలాడే కమలం, బురద ఆధారమై, రాయంచలకు ప్రీతికరమైన ఆహారంగా ఉండే కాడపైన తేలుతుంటుంది. ఆకమలమే నిలయంగా కలది లక్ష్మీదేవి. ఇది చిత్రమే.

**"కమలేకమలేష సన్నిధత్సు**

**సకలేషు స్వవశేషు విష్టపేషు ।**

**సహజం జననీ జనస్య లోకే**

**జలజాతేషు విశేషవత్సలత్వమ్ ॥"** (అరవిందస్తబకం)

ఓ కమలాదేవీ! సకల లోకాలలో ఎన్నో స్థానాలున్నా నీకు కమలమే లభించిందా?

ఔనులే! తల్లులకు జల (డ) జాతాల (పువ్వుల/మంద బుద్ధిగల సంతానం) మీద వాత్సల్యం ఎక్కువ కదా! అని వేంకటాధ్వరి కమలనిలయగా లక్ష్మీదేవి ఉండే కారణాన్ని చమత్కరించాడు.

**ఆమ్నాయవాచాం చిత్రం చూడా పీడం** :–నిగమకాంత సిగలో అద్భుతమైన శేఖర పుష్పం–నగ–గా ప్రకాశించేది చరణ ద్వంద్వం. మంగళకరమైన లక్ష్మీదేవి పాదపద్మయుగం ఉపనిషత్ర్పతి పాదితమైనదని భావం.

**తవపద యుగం చేతసాధారయంతః** :– అధికార పదవులను పొందే కోరిక కలవారు/ శ్రేయస్కాములంటే మోక్షార్థులు కూడా ఆయా ఫలాపేక్షచే లక్ష్మీచరణ రాజీవాలను మనస్సున ధరించి ఉపాసన చేస్తారు.

"చిత్తంతు చేతో హృదయం"–(అమరం) "పద్మకోశ ప్రతీకాశం హృదయం" అని "యత్పుండరీకం పుర మధ్యసంస్థమ్" అని ఉపనిషద్వాక్య ప్రకారం, హృదయ కమలం శరీరమందు కంఠానికి దిగువ, నాభికి జేనెడుపైన ఉంటుంది.

"తస్మిన్ యదంత స్తదుపాసితవ్యమ్".(ఉపనిషత్) అన్నట్లు, శ్రుతి శిరోభూషణమైన దేవి పాదాలను హృదయ పద్మమందు ధరించి ధ్యానం చేస్తుంటే శఠారి వలె, శిరోధారణ యోగ్యత కలుగుతుంది. "యావన్న శిరసాధారయిష్యామి నమే శాంతిర్భవిష్యతి" (రా) శ్రీరాముని పాదాలను తలమీద ధరించనంతవరకు నాకు మనః శాంతి కలుగదు– అని భరతుడన్నాడు కదా!

మనస్సున ధరించి చింతన చేయడంవల్ల ధారణ యోగమూ సిద్ధిస్తుంది. ధరించిన సమయమందే ఛత్రచ్ఛాయలో శిరస్సు శోభించే సమ్మానమూ లభిస్తుందని అభివ్యక్తం.

**ఛత్రచ్ఛాయా సుభగశిరసః :-** దేవి పాదాలను శిరసా వహించిన వారి శిరస్సు గొడుగు నీడ ఆవరించడమూ రెండు ప్రక్కల పరిచారకులు నిల్చి చామరాలను వీచే సౌభాగ్యమూ కలిగి ఉంటుంది.

**శ్లాఘా శబ్ద శ్రవణముదితాః :-** శ్రవణ కీర్తనాదులచే భజించిన వారికి 'జయ, విజయీభవ' అని అనుచరులచే కీర్తింపబడే యోగ్యత కలుగుతుంది. "స్తోతవ్యత్వం దిశతి భవతీ దేహిభిస్తూయమానా" (3) జగజ్జనని తనను స్తుతించిన వారికి 'తత్క్రతున్యాయం'గా లోకులు తమను పొగడగా విని సంతోషపడే మహిమనూ ప్రసాదిస్తుంది.

**స్రగ్విణః సంచరంతి :-** ప్రభువులకు ప్రజలు పూలదండలు వేసి, వారిని రథ గజా రూఢులుగా ఊరేగించి సమ్మాన పత్రాలను చదివి, వినిపించి సమర్పించే లోక మర్యాదను వారు పొందేరీతిగా ప్రవర్తింపజేస్తుంది.

**"బ్రహ్మేఃద్యాశ్చాః సురాస్సర్వేమునయశ్చతపోధనాః ।**
**ఏధన్తే త్వత్పదచ్ఛాయా మాశ్రిత్యకమలేశ్వరి ॥"**

చతుర్ముఖ, పంచముఖ షణ్ముఖాది బర్హిర్ముఖులూ, మునులూ, తపోధనులూ అందరు దేవదేవ దివ్య మహిషియైన లక్ష్మీదేవి యొక్క పాద పద్మచ్ఛాయను ఆశ్రయించే కదా వృద్ధిని పొందుతుంటారు.

**"అస్మైన కించి దుచితం కృత మిత్యథాంబ ।**
**త్వం లజ్జసే కథయ కోఽ యముదారభావః ॥"**

అమ్మా! నిన్ను కొలిచిన వారికి వారు కోరిన ఐశ్వర్యాదులనెల్ల సమగ్రంగా ఇచ్చి కూడా "అయ్యో! వీరికి నేనేమి చేయలేకపోతినే" అని నీవు సిగ్గుపడుతుంటావు. ఇదెక్కడి ఔదార్యం తల్లీ! అని శ్రీ పరాశర భట్టరు (శ్రీగుణ రత్నకోశం-58) స్తుతించారు.

ఎవరి పాదాలు వారిగతికి కారణమవుతుంటాయి. "గతిరితి పాదయోః" అని ఉపనిషద్వాక్యం. మరి, లక్ష్మీదేవి పాదాలు మన ఉన్నతికీ, ఉత్తమగతికీ కారణం అవుతుండడం విచిత్రం కాదా!

**"యోయస్య పాదౌ యదువీర్య భార్యే !**

**తస్యైవ దృష్టౌ గతిదాయినౌతౌ ।**
**చిత్రం తదేతచ్చరణౌ తవేమౌ**
**గజేంద్ర యోగ్యాం దిశతో గతింనః ॥"**

(సౌందర్య స్తబకం)

ఎవని పాదాలు వానికే గతిని కల్పిస్తుండగా, నీ పాదాలేమో గజేంద్రునికి యోగ్యమైన గతిని మాకు కల్పిస్తుంటాయి. భళా! అని వేంకటాధ్వరి స్తుతించాడు.

ఏనుగులకు నీటిలో క్రీడించడం సరదాగా ఉంటుంది. కొలకులలో వికసించిన కమలాలను తొండాలతో నాశనం చేయడం వాటి స్వభావం. గజేంద్రుడు జలకాలాడ డానికి సరస్సులోకి దిగాడు. అంత్యదశలో ఒక కమలాన్ని ఆకరీంద్రుడు తన కరంతో పట్టుకొన్నాడు. 'కం' అంటే పరమాత్మను అలంకరించే లక్ష్మీదేవికి 'కమలా' అని పేరు. "కమలా శ్రీర్హరి ప్రియా" (అమరం). శ్రీదేవి యొక్క పాదకమల గ్రహణం చేసినందువల్ల – పాదాలను పట్టుకొన్నందువల్ల– శ్రియఃపతి పరుగు పరుగున వచ్చి గజేంద్రుణ్ని రక్షించాడు– అని వైచిత్రి. ఐశ్వర్యం కల్గడానికి హేతువు లక్ష్మీ పాద పద్మాలను ధరించడమే; కాబట్టి కావ్యలింగాలంకారం.

**18.** **ఊరీకర్తుం కుశలమఖిలం జేతుమాదీనరాతీన్**
**దూరీకర్తుం దురితనివహంత్యక్తు మాద్యామవిద్యామ్ ।**
**అంబ! స్తంబావధిక జననగ్రామ సీమాంత రేఖాం**
**ఆలంబంతే విమలమనసో విష్ణుకాంతే దయాంతే ॥**

**అర్థం:–** హే విష్ణుకాంతే = విష్ణువుకు ప్రియపత్నివైన; హే అంబ= ఓ తల్లీ; విమల మనసః = పరిశుద్ధమైన మనస్సు కలవారు; అఖిలం= సమస్తమైన; కుశలం=క్షేమాన్ని, ఊరీకర్తుం = (అంగీకరించడానికి) పొందడానికి; ఆదీన్= మొదటి; అరాతీన్= శత్రువులైన కామక్రోధాదులను; జేతుం = జయించడానికి; దురిత నివహం= పాపాల సమూహాన్ని; దూరీకర్తుం = దూరం చేసుకోవడానికి; ఆద్యాం= తొలిదైన; అవిద్యాం= అజ్ఞానాన్ని; త్యక్తుం=విడిచిపెట్టడానికి; స్తంబ–రేఖాం। స్తంబ+అవధిక = తృణ (కీటక) పర్యంతంగల; జనన గ్రామ= జన్మపరంపరలకు/ జనన మరణాలు అనే గ్రామాలకు;

సీమాంత రేఖాం=సరిహద్దు గీతయైన; తే= నీ యొక్క; దయాం= దయా గుణాన్ని; ఆలంబంతే = ఆధారంగా గ్రహిస్తున్నారు.

**తా॥** జననీ! విష్ణుపత్నివైన ఓ లక్ష్మీదేవీ! నిర్మలాంతః కరణులైన భక్తులు సకల విధమైన క్షేమాన్ని పొందడానికీ, జన్మ శత్రువులైన కామక్రోధాదులను జయించడానికీ, పాపరాశిని దూరం చేయడానికీ; అవిద్యను వదలి పెట్టడానికీ, జనన గ్రామాలకు ఎల్ల గీతగా ఉన్న నీ దయను ఆధారంగా పొందుతున్నారు.

**వ్యాఖ్య:- కైవల్యార్థులకు లక్ష్మీ కృపాకటాక్షం అత్యంతావశ్యకమని సుశ్లోకితం.**

శ్రీకాంతుడు విష్ణుమూర్తి. విష్ణుకాంత లక్ష్మీదేవి. సర్వత్ర వ్యాపించే శీలంగల విష్ణుమూర్తి యొక్క ఆనందాన్ని విస్తరింపజేసేది విష్ణుకాంత. 'కాంత' అంటే ప్రియురాలు.

"కంతనోతి ఇతి కాంతా", 'కం' అంటే సుఖం, ఆనందం. దీన్ని విస్తరింపజేసేది. "కస్య సుఖస్య అంతః నిశ్చయః / అవధిః యస్యాం సా=కాంతా." సుఖం యొక్క నిశ్చయంగానీ, అవధిగానీ ఏ దేవియందు ఆధారపడి ఉన్నదో ఆమె 'కాంత' అనబడుతుంది. ఆ విష్ణుకాంతయే అంబ.

"అంబ్యతే శబ్ద్యతే ఇతి అంబా". (అబి శబ్దే)

బాలురచేత పిలువబడే లక్ష్మీదేవి అంబ. జగత్కుటుంబిని కాబట్టి ఆమెను 'తల్లీ' అని లోకులు పిలుస్తారు.

విమల మనసః :- అవిద్య, అస్మిత, రాగం, ద్వేషం, అభినివేశం అనే ఈ క్లేశ పంచకాన్ని చిత్త మలినాలు అంటారు.

'అస్మిత' అంటే మమతాహంకారాలని భావం. కర్తృత్వాహంకారం, జ్ఞాతృత్వాహంకారం, భోక్తృత్వ అహంకారం, శేషత్వ అహంకారం అనబడే అభిమాన చతుష్టయాన్ని కలిగి ఉన్న మనస్సు సర్వానర్థాలకు మూలం కదా! కాబట్టి "మన ఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః"- మనుష్యుల కష్ట సుఖాలకు కారణం మనస్సు అన్నారు విజ్ఞులు. క్లేశ పంచకాన్ని పూర్తిగా తొలగించుకొన్న మహానుభావులే విమల మనస్కులు. యోగులు.

**ఊరీ కర్తుం కుశల మఖిలం :–** కుశల శబ్దానికి సామర్థ్యం, శుభం, పుణ్యం, బుద్ధి సూక్ష్మత, నేర్పు అని నానార్థాలున్నాయి. కుత్సితం అమంగళం శ్యతీతి కుశలం. (శో–తనూ కరణే) అశుభాన్ని చెరిపేది అని అర్థం.

"పర్యాప్తిక్షేమ పుణ్యేషు కుశలం శిక్షితే త్రిషు" (అమరం)

ఖిలం కానిది అఖిలం. మొక్క పోనిది అని అర్థం. సకల విధాలైన క్షేమాలను అంటే దేహయాత్ర, జీవయాత్రలకు కావలసిన సామర్థ్యాన్ని పొందడానికి లక్ష్మీకటాక్ష మావశ్యకం. లక్ష్మీదేవి యొక్క దయచేత సకలాభీష్ట సిద్ధి కలుగుతుందని భావం.

**జేతుమాదీ నరాతీన్ :–** ఆది శత్రువులు–ప్రథమ శత్రువులు అంటే, పుట్టినది మొదలు జీవుని వశపరచుకొని తన స్వరూపాన్ని తెలియనీయకుండా చేసి బాధించే బలమైన, అంతః శత్రువులైన కామక్రోధ లోభ మోహ మద మాత్సర్యాలు. వీటినే అరిషడ్వర్గమంటారు. వీటిని జయించడం చాలా కష్టం. యోగాభ్యాసం చేత శరీరమందు నిత్యం నివసించే అరిషడ్వర్గాన్ని జయించడానికి యత్నించి సాధించిన వారిని యోగ సిద్ధులంటారు.

**దూరీకర్తుం దురిత నివహం :–** సంచితం, ప్రారబ్ధం, ఆగామి అనే మూడు రకాలైన కర్మల ఫలమైన పాపాల సమూహం మోక్షఫలాన్ని పొందడానికి ప్రతిబంధకమే. దుష్కర్మలను ఆచరించడం వల్ల కలిగేది నరకప్రాప్తి. అలాగే పుణ్యకర్మలను ఆచరించడం వల్ల కలిగేది అనిత్యమైన స్వర్గాదిలోకాల అనుభవం. కాబట్టి, ముముక్షువు అంటే మోక్షఫలాన్ని కోరే వ్యక్తి పుణ్య పాపాలనబడే (రెండు) కర్మలను తొలగించుకొని పరిశుద్ధాత్ముడు కావాలి. పాపియందు జ్ఞానం నిలువదు.

"మోక్షే ధీర్జ్ఞానం–" (అమరం) జ్ఞానం అంటే మోక్షమందు బుద్ధి కలుగడం.

మోక్షప్రాప్తికి ప్రతిబంధకమైన పుణ్య పాపాలరాశిని దూరం చేసుకోవాలి. కాబట్టి, 'దురిత నివహం' అంటే పాపపుణ్యకర్మల సమూహమని అర్థం. కొన్ని పాపకర్మలు అనుభవిస్తే పోతాయి. ప్రాయశ్చిత్త కర్మల నాచరించి పాపాలను పోగొట్టడానికి యత్నించే సమయమందు కూడా మరికొన్ని పాపాలు సంభవించే అవకాశముంది. కాబట్టి పాపపుణ్యకర్మలు స్వరూపతః నశించవు. అవి మరొకచోట

చేరగోరే–సంక్రమించే– స్వభావం కలవి. లక్ష్మీ కటాక్ష వీక్షణం వల్లనే పాప పుణ్య కర్మల సముదాయం దూరమై పోతే, బ్రహ్మజ్ఞానం దగ్గరవుతుంది.

**త్యక్తుమాద్యామవిద్యాం :–** సృష్ట్యాదిలో అజ్ఞానం, మోహం, భోగేచ్ఛ, తమిస్రం, అభినివేశం అనే ఐదు విధాలుగా ఉండే 'అవిద్య' ఉత్పన్నమయింది.

**"తమో మోహో మహా మోహస్త మిస్రోహ్యంధ సంజ్ఞితః ।**

**అవిద్యాపంచ పర్వైషాప్రాదుర్భూతా మహాత్మనః॥"** అని విష్ణు పురాణ వాక్యం.

"అథా జ్ఞాన మవిద్యాఽహం మతిః స్త్రియామ్" (అమరం)

'అవిద్య' అంటే అజ్ఞానం. వస్తువును తెల్యనీయదు. అన్యథా జ్ఞానం అంటే, ఒక వస్తువును మరొక వస్తువుగా భ్రమింప జేస్తుంది. ఉదా:– త్రాడును పాముగా తలపింప జేస్తుంది. విపరీత జ్ఞానం అంటే, ఒక గుణాన్ని వేరొక గుణం కలదిగా గ్రహింపజేస్తుంది. ఉదా:– తెల్లని శంఖాన్ని పచ్చగా ఉన్నట్లు అనిపిస్తుంది. విద్యకు ముఖ్య విరోధి అవిద్య. అనేక జన్మ పరంపరల ద్వారా వస్తున్న ప్రకృతి సంబంధం చేత ఏర్పడిన ఈ మొదటి మోహం (అవిద్య) కర్మలయందు ఆసక్తిని కలిగించి, జీవులకు జనన మరణాది దుఃఖాలను అనుభవింపజేస్తుంది. విద్యచేతనే అవిద్యను త్యజించడం సాధ్యమవుతుంది. విద్య (ప్రకృతిం వికృతిం విద్యాం) అని లక్ష్మీదేవికి పేరున్నది. "కర్మా విద్యాది చక్రే"– కర్మ, అవిద్యాది చక్రం నుంచి బయట పడడానికి ముఖ్యంగా లక్ష్మీ కృపా కటాక్షం అపేక్షణీయం.

**స్తంభావధిక జనన గ్రామ సీమాంతరేఖాం :–** ఆలంబనంగా ఉన్న దయారేఖయే జనన గ్రామ సీమాంతరేఖ.

"ఏకోఽపిచ ప్రరోహైస్తు బహుభిః స్తంబ ఉచ్యతే"

'స్తంబ' శబ్దానికి గరుక అని అర్థం. అది ఒక మొక్కయే అయినా అనేక కణుపులతో వేళ్ళూని భూమిపైన పరుచుకొని పోతూ స్థిరంగా ఉంటుంది.

"అప్రకాండే స్తంబ గుల్మౌ" (అమరం) చెట్టుకున్నట్లు ఒక ప్రకాండం లేకుండా ఆకులతో పరుచుకొంటూ వ్యాపిస్తుంది. "తిష్ఠతి ఇతి స్తంబః"– (ష్ఠా గతి నివృత్తౌ) స్థిరంగా ఉండేది 'స్తంబం'.

(గరుక తిన్న గాడిద చెడుతుంది కాని గరుక చెడదు అని అంటారు కదా లోకులు)

బ్రహ్మాది స్తంబ పర్యంతం జీవరాశులయొక్క జన్మలు కర్మాధీనమైనవే కదా!

"బృందేఽపి గ్రామః" (అమరం) గ్రస్యతే, ఇతి గ్రామః-(గ్రసు-అదనే) అనుభవింపబడేది. 'గ్రామ' శబ్దానికి సమూహం, ఊరు, స్వరం అని నానార్థాలున్నాయి. ఇక్కడ ఇది శ్లిష్టపదం. 'జనన గ్రామం' అంటే జన్మల సమూహమనీ, పుట్టిన ఊరు అని అర్థం. "సీమ సీమే స్త్రియాముభౌ". సీమన్ లేదా సీమా (నకారాంతంగానూ, ఆకారాంతంగానూ ఉన్న ఈ రెండు) శబ్దాలకు పొలిమేర (సరిహద్దు) గుర్తు అని అర్థం.

'సీయతే బధ్యతే ఇతి సీమా'- ఇంత మేర అని గీయబడిన లేదా కట్టబడిన గుర్తు.

మనం జన్మించిన గ్రామమని అభిమానిస్తాం. కాని, వాస్తవంగా మన జన్మ పరంపరకు ఒక గ్రామమని నియతం లేదు కదా! ప్రకృతి మండలమంతా మన జనన గ్రామమే.

జనన మరణావస్థలు లక్ష్మీదేవి దయను పొందే వరకు ఉంటాయి, ఆ తర్వాత ఉండవు. కాబట్టి లక్ష్మీదేవి దయయే జననగ్రామ సీమాంతరేఖయని వర్ణింపబడింది.

మన జనన గ్రామమైన ప్రకృతి మండలం నుంచి బయటకు-శ్రీ వైకుంఠ నగరానికి - తీసుకొని పోవడానికే శ్రీదేవి ప్రార్థింపబడుతున్నది.

**ఆలంబంతే విమల మనసో విష్ణుకాంతే దయాంతే:-** ఈ శ్లోకంలో జిజ్ఞాసువులు దుఃఖ పరంపరకు కారణమైన ఈ ప్రకృతి సంబంధాన్ని పూర్తిగా తొలగించి, కైవల్యమనే మోక్షాన్ని తమకు ప్రసాదించుమని లక్ష్మీదేవిని ఆశ్రయిస్తారని స్తుతింపబడినది. జిజ్ఞాసువులు కైవల్యార్థులు "ముక్తిః కైవల్య నిర్వాణ శ్రేయో నిశ్రేయ సామృతం, మోక్షోఽపవర్గః" (అమరం) కైవల్యం మోక్షార్థకం. శరీరేంద్రియాలతో ఎడబాసిన ఆత్మ అద్వితీయమై ఉండడమే కైవల్యం. శ్రీ పరాశర మహర్షి చేత "యోగి నామమృతం స్థానం స్వాత్మసంతోష కారిణామ్". (వి.పు) అని ఆత్మానుభవం చేత

తృప్తిని పొందే యోగులకు మోక్షస్థానం ఉపదేశింపబడింది.

ప్రకృతి మండలం నుంచి - శరీరాన్ని వదలిన ఆత్మ-పరమ పదానికి పోయి 'నేను నేనుగా ఉంటే చాలు' అనుకొని అక్కడ పరిశుద్ధ జ్ఞాన, ఆనంద రూపమైన తన (ఆత్మ) స్వరూపాన్ని తృప్తిగా అనుభవించేది కైవల్యం. ఇది కూడా మోక్షమే. ఈ ముక్తాత్మకు శరీరం ఉండదు అక్కడ. భగవంతుని సన్నిధిలో లభించే శాశ్వతమైన బ్రహ్మానందం ఉండదు. కేవలం ఆత్మానందానుభవమే. పునర్జన్మ కూడా ఉండదు. కాబట్టి కైవల్యమనే మోక్షమూ నిత్యమే. శాశ్వతమైనదే.

"దాంతే దయాంతే విదన్" అన్నారు శ్రీ యామునాచార్యులవారు.

**"శ్రేయోనహ్యర వింద లోచన మనః కాంతా ప్రసాదాత్ ఋతే;**

**సంసృత్యక్షర వైష్ణవాధ్వసు నృణాం సంభావ్యతే కర్హిచిత్ ॥"** (చతుఃశ్లోకి)

విష్ణుకాంత యొక్క అనుగ్రహం లేకుంటే నరులకు ఐశ్వర్యంగానీ, ఆత్మానందం గానీ, భగవత్కైంకర్య రూపమైన బ్రహ్మానందంగానీ లభించదు కదా!

అందువల్ల, విమలమనస్కులైన యోగులు, కైవల్యార్థులు ఆత్మానందా నుభవమనే శ్రేయస్సును పొందడానికి లక్ష్మీదేవి యొక్క దయను ఆలంబనంగా స్వీకరిస్తారని శ్రీ వేదాంత దేశికులు శ్లేషాను ప్రాణితమైన రూపక చమత్కృతితో సుశ్లోకించారు.

**19.** **జాతా కాంక్షా జనని! యువయోరేక సేవాధికారే**
**మాయాలీఢం విభవ మఖిలంమన్య మానా స్తృణాయ ।**
**ప్రీత్యై విష్ణో స్తవచ కృతినః ప్రీతిమంతో భజంతే**
**వేలాభంగ ప్రశమన ఫలం వైదికం ధర్మ సేతుమ్ ॥**

**అర్థం:-** హే జనని = ఓ తల్లీ! యువయోః = దివ్యదంపతులైన మీ ఉభయులకు; ఏక సేవా+అధికారే = ముఖ్యమైన సేవచేసే అధికారమందు; జాత+ఆకాంక్షాః = ఆశ కలిగిన; కృతినః = ధన్యాత్ములు; మాయా+ ఆలీఢం = ప్రకృతిచే ఆవరింపబడిన; అఖిలం = సమస్తమైన; విభవం = ఐశ్వర్యాన్ని; తృణాయ=గడ్డిపోచగా; మన్యమానాః = తలచుతున్న వారై; తవ= నీ యొక్క; చ = మరియు; విష్ణోః = విష్ణువు యొక్క;

ప్రీత్యై = ప్రీతి కొరకు; వేలా భంగ ప్రశమనఫలం = చెలియలి కట్టను దాటే దోష శాంతియే ప్రయోజనంగా గల; వైదికం=వేదమయమైన; ధర్మ సేతుం = ధర్మమనే వారధిని; ప్రీతిమంతః = అత్యాదరం కలవారై; భజంతే = సేవిస్తుంటారు.

**తా॥** తల్లీ! ఓ లక్ష్మీదేవీ! దివ్యదంపతులైన మీ యిద్దరికి ఒకే విధంగా కైంకర్యం చేయడమందు కోరిక పుట్టిన భాగ్యశాలులు ప్రకృతికి సంబంధించిన సకలైశ్వర్య వైభవాన్ని తృణంగా భావిస్తూ, మీ ఉభయుల ముఖోల్లా సంకోసం స్వధర్మానుష్ఠాన వ్యవస్థ చెడక ఉండడమే ఫలంగా గల వేద విహిత ధర్మసేతువును సేవిస్తుంటారు.

**వ్యాఖ్య:- జ్ఞానులు లక్ష్మీ నారాయణుల ప్రీత్యర్థం వైదిక ధర్మాన్ని ఆచరిస్తారని సుశ్లోకితం.**

జ్ఞానులు మోక్షార్థులు – ముముక్షువులు.

**"ఆకారిణస్తు విజ్ఞాన మాకారజ్ఞాన పూర్వకం ।**

**తేనాకార శ్రియం జ్ఞాత్వా జ్ఞాతవ్యో భగవాన్ హరిః ॥"**

ఒక వస్తువును దాని ఆకారాన్ని బట్టి తెలుసుకొంటాం కదా! అలాగే, ఆకార భూతురాలైన లక్ష్మీదేవిని తెలునుకొని, ఆమె మూలంగా లక్ష్మీపతిని తెలుసుకోవలసియుంటుంది.

"గర్భ భూతా స్తపోధనాః" అన్నట్లు తపోధనులైనను జ్ఞానులు దివ్య దంపతులకు చంటి బిడ్డలవంటి వారు కాబట్టి, బిడ్డలు తల్లిని పాలిమ్మని మొరపెట్టుకొన్నట్లే, లక్ష్మీదేవిని పురస్కరించుకొని లక్ష్మీపతిని మోక్షం కోసం మహా విశ్వాసంతో ప్రార్థిస్తారు. అందువల్ల 'జనని'– ఓ తల్లీ! అని సంబుద్ధి.

**జాతా కాంక్షాః యువయోరేక సేవాధికారే :–** మోక్షార్థులు జ్ఞానమున్నప్పటికీ అకించనుడను, అనన్యగతుడను. "ఎన్నాన్ శెయ్‌గేన్" జ్ఞాన రహితుడనైన నేను దేన్ని అనుష్ఠించగలను? "పుగలొన్ఱిల్లా వడియేన్" వేరొక గతిలేని దాసుడను, అనీ –

"కళైవాయ్ తున్బంగళై యాతొాషి వాయ్ కళై కణ్ మత్తిలేన్"– రక్షించు, రక్షించకుపో!

నీ కంటె నాకు వేరొక రక్షకుడు లేదు– అని శరణ్యుడైన శ్రీమన్నారాయణుణ్ణి

ప్రపత్తి చేస్తారు. ప్రపత్తి చేసేవారిని ప్రపన్నులంటారు. ప్రపన్నులే మోక్ష ప్రాప్తికి అధికారులు. "మరణమానాల్ వైగుందం కొడుక్కుమ్ పిరాన్" మోక్షమంటే మహోపకారకుడైన భగవానుడు 'ఈ దేహాన్ని విడిచిన వెంటనే ప్రసాదించే పరమపదం' అని అర్థం.

**"శార్న్ద విరువల్ వినైగళుమ్ శరిత్తు మాయ**
**పృత్తళుత్తు, తీర్న్దు తన్బాల్ మనమ్వైక్క**
**తిరుత్తి వీడు తిరుత్తువాన్"** – (తి.వా.మొళి. 1-5-10)

భక్తి రూపమైన జ్ఞానం కలవారి పట్ల అధిక వ్యామోహంగల శ్రియఃపతి వారికి ఉన్న పుణ్య పాపాలను తొలగించి, అజ్ఞానంవల్ల కలిగిన విషయ సంగం నుంచి వారిని తప్పిస్తాడు. తనయందు మనస్సును దృఢంగా ఉంచే విధంగా చేసి పరమ పదానికి చేర్చుకొంటాడు. మోక్షస్థానాన్నీ చక్కదిద్దుతాడు, అని ఆళ్వార్ల శ్రీ సూక్తి. పరమ పదంలో ముక్తాత్మలకు నాల్గు స్థానాలున్నాయి.

**"మోక్షం సాలోక్య సారూప్యం ప్రార్థయేన కదాచన ।**
**ఇచ్ఛామ్యహం మహాబాహో! సాయుజ్యంతవసుకృత ॥"**

కొందరు వైకుంఠ లోకంలో నివసిస్తారు. కాబట్టి సాలోక్యమనే మోక్షమది. కొందరు వైకుంఠుని స్వరూపాన్ని పొందియుండే మోక్షాన్ని సారూప్యం అంటారు. వైకుంఠుని సమీపాన చేరియుంటే సామీప్యమంటారు. మోక్షార్థులు సాయుజ్యం అనే మోక్షాన్ని కోరుతారు. వేయిలోనే నూర్లు ఉన్నట్లు సాలోక్యాదులన్ని పరమపదంలోనే అంతర్భూతాలు.

'సాయుజ్యం' అంటే 'సయుక్' యొక్క భావం. బ్రహ్మమనే భోగ్యవస్తువు నందు బ్రహ్మమూ, ముక్త పురుషుడూ ఉభయులు భోక్తలై అన్వయించి ఉన్నందువల్ల ముక్త పురుషుడు 'సయుక్'– (తోడ కూడి అనుభవించేవాడు) అనబడుతాడు. ఈ భావాన్నే "సోఽ శ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా" అనే ఉపనిషద్వాక్యం చెబుతుంది. "మమ సాధర్మ్యమాగతాః". ముక్తాత్మలు నా యొక్క సాధర్మ్యాన్ని పొందుతారని గీతాచార్య సూక్తి.

శ్రీ శ్రియః పతులిద్దరికీ ఏక శేషిభావం చేత కైంకర్యం చేస్తున్న ఆత్మ, పరమాత్మతో సమరసాన్ని అనుభవించడం– "సామరస్యం హి సాయుజ్యమ్" అని శాకటాయనుని సూక్తి.

'అధికారం' అంటే ఫలం. సేవాధికారం శ్రియఃపతి దయవల్ల కలుగుతుంది. దివ్య దంపతులకు సమర్పించే కైంకర్య రూప ఫలమందు ఆశ పుట్టడమే ప్రజ(ల)కు వాస్తవమైన జన్మ కదా! శ్రీనివాసుని కరుణారూపిణియైన లక్ష్మీ కటాక్షం చేత మోక్షకాంక్ష కలిగినందువల్ల ఆమె జనని. జాతాకాంక్షుల జన్మ ధన్యమైనది.

**మాయాలీఢం విభవ మఖిలం మన్యమనాస్తృణాయ :–** ముముక్షువులు ప్రకృతి సంబంధం చేత కలిగిన అఖిలైశ్వర్య, స్వర్గ భోగాదులను ఆశించరు. మాయాలీఢ మైనందున ప్రాకృత సంపదల నన్నింటినీ ఖిల మైనవని భావిస్తారు. శునకం నాకిన, 'పురోడాశం' ను విసరి పారవేసిన రీతిగా, సంపదలను అనుభవించడానికి అపేక్షించరు.

"నాన్యత్కిమపితవ శేషత్వ విభవాత్ బహి
ర్భూతం నాథ! క్షణమపి సహే" (స్తోత్ర రత్నం. 57)

స్వామి! నీ దాస్య వైభవం కంటే వేరే వైభవాన్ని అదెంత గొప్పదైననూ క్షణమైనా సహించలేను–అని శ్రీయామునమునుల సూక్తి.

**"నిత్యమచ్యుత పదాంబుజ యుగ్మ**
**రుక్మవ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే!**

భగవచ్చరణారవింద యుగళమనే బంగార మందలి వ్యామోహం వల్ల వాటికంటే వేరైన వస్తువులను ఎల్లప్పుడు గరుక పోచగా భావించిన వారు భగవద్రామానుజ యతీంద్రులు. "పరమాత్మని యోరక్తః విరక్తోஉ పరమాత్మని"– పరమాత్మయందు రక్తి గల వ్యక్తి తదితర ద్రవ్యమందు విరక్తుడనే వాక్యార్థం స్మారితం.

**ప్రీత్యై విష్ణోస్తవచ కృతినః ప్రీతిమంతో భజన్తే :–** లక్ష్మీ నారాయణులిద్దరి ముఖోల్లాసం కోసమే భక్తులు సేవచేస్తుంటారు. "తనక్కేయాగ ఎనైక్కొళ్ళు మీదే"– నా ఆనందం కోసం కాక, మీ ఆనందం కోసమే నా కైంకర్యాన్ని స్వీకరించండి. స్వామి – అన్నారు నమ్మాళ్వార్లు.

"ప్రియోహి జ్ఞానినోఽత్యర్థం అహంస చ మమ ప్రియః"– అనే గీతాచార్య సూక్తి వల్ల జ్ఞానికీ, భగవానునికీ పరస్పర ప్రీతియుంటుందని విశదమవుతున్నది. భగవానుని పైన జ్ఞానికి గల వ్యామోహంకన్న జ్ఞానిపట్ల భగవానునికున్న వ్యామోహం మిన్న అని స్పష్టమవుతున్నది. కాబట్టి, 'కృతినః'– ప్రపన్నులు కృత కృత్యులు కదా!

"అస్య మమచ శేషం హి" అనే వచనానుసారంగా 'విష్ణోస్తవచ' అని వేర్వేరుగా నిర్దిష్టం.

**వేలాభంగ ప్రశమనఫలం వైదికం ధర్మ సేతుమ్ :**– ప్రపన్నులు వేదోక్తమైన స్వధర్మాన్ని శ్రద్ధతో అనుష్ఠిస్తారు. నిత్యనైమిత్తిక కర్మలను ఫలాపేక్ష లేకుండా ఆచరించడం కర్తవ్యం.

ధర్మమే సేతువు. శ్రుతులు, స్మృతులు భగవంతుని ఆజ్ఞా రూపాలు. వాటిని పాటించకుంటే భగవంతుని ఆగ్రహానికి గురి కావలసి వస్తుంది. ప్రత్యవాయదోషమూ కలుగుతుంది. "ధర్మేణ పాపమపనుదతి"– ధర్మాన్ని అనుష్ఠిస్తే పాతకం పటాపంచలవుతుంది. పెద్దలు భగవదాజ్ఞా రూపమైన వర్ణాశ్రమా చార ధర్మాన్ని యావజ్జీవం ఆచరిస్తుంటే, చిన్నవారు కూడా పెద్దవారి అనుష్ఠానాన్ని గమనించి, తప్పక పాటిస్తారు.

**"యద్యదా చరతి శ్రేష్ఠః తత్త దేవేతరోజనః ।**
**సయత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ॥"**

శ్రేష్ఠుడైన పురుషుని ప్రవర్తననే జనులు చూచి అనుసరిస్తారు. ఆయన నిల్పిన ప్రమాణాన్నే లోకులు పాటించి కాపాడుతారు. 'లోక సంగ్రహం' అంటే ఫలాభిసంధి రహితంగా కర్మలను ఆచరించడంవల్ల భగవంతునికి ప్రీతికలు గడమేకాక, లోకులకు హితం కూడా కలుగుతుంది. కాబట్టి, ప్రజలను వారి వారి హద్దులలో ఉంచి రక్షించడం వల్ల వైదిక ధర్మం 'సేతువు' అని వ్యవహరింపబడుతున్నది.

ధర్మాన్ని మనం కాపాడితే అది మనలను కాపాడుతుంది కదా! ఈ లోకం నుంచి పరలోకం చేరడానికి ధర్మమే సేతువు. 'సేతువు' అంటే ఆనకట్ట. (Dam) సేతువుకు వేలాభంగ ప్రశమనమే ఫలం. ప్రవాహం గట్టు మీరి పోకుండడమే

సేతుబంధన ప్రయోజనం కదా!

భగవదాజ్ఞను ఉల్లంఘించకుండా తద్వారా స్వరూప హాని కలుగకుండా, ముముక్షువులు మోక్షసంపాదకమైన వర్ణాశ్రమాచార ధర్మాన్ని, భగవత్ప్రీత్యర్థం అనుష్ఠించి కృతార్థులవుతారు.

**20. సేవే దేవి! త్రిదశ మహిళా మౌళిమాలార్చితంతే**
**సిద్ధిక్షేత్రం శమితవిపదాం సంపదాం పాద పద్మమ్ ।**
**యస్మిన్నీషన్న మిత శిరసో యాపయిత్వా శరీరం**
**వర్తిష్యంతే వితమసి పదే వాసుదేవస్య ధన్యాః ॥**

**అర్థం:-** హేదేవి = పట్టపురాణివైన ఓ లక్ష్మీదేవీ! త్రిదశ–అర్చితం। త్రిదశ మహిళా= దేవతా స్త్రీల యొక్క; మౌళి మాలా=శిరస్సులందు పూలమాలికలచేత; అర్చితం= పూజింపబడినట్టి; శమిత విపదాం = తొలగిన ఆపదలు గల; సంపదాం = సంపదలకు; సిద్ధి క్షేత్రం= ఉత్పత్తి స్థానమైన; తే= నీ యొక్క పాదపద్మం = చరణ పద్మాన్ని; సేవే= భజిస్తున్నాను. యస్మిన్ = ఏ పాదపద్మమందు; ఈషత్+నమితశిరసః = కొంచెం తలవంచి మ్రొక్కునట్టి; ధన్యాః = ధన్యజీవులు; శరీరం=దేహాన్ని; యాపయిత్వా= గడపి; వితమసి = సత్త్వమయమైన; వాసుదేవస్య= పరవాసుదేవుని యొక్క; పదే= స్థానమందు; వర్తిష్యంతే = నివసింతురో; (అట్టి పాదపద్మాలను ఆశ్రయిస్తున్నాను)

**తా॥** సమ్రాజ్ఞివైన ఓ లక్ష్మీదేవీ! నీ పాదకమలాన్ని దేవతా స్త్రీలు తలలపైన ధరించిన పూలమాలలచే పూజిస్తుంటారు. ఆ నీ పాద కమలం అపాయం లేని సంపదలకు పుట్టిల్లు. ఏ పాద పద్మమందు కొంచెం తలవంచిన వారు ధన్యాత్ములై దేహాంతమందు తేజోమయమైన శ్రీ వైకుంఠమందు నివసిస్తుంటారో అట్టి నీ పాద పద్మాన్ని శరణుపొందుతున్నాను.

**వ్యాఖ్య:- శ్రీదేవి సన్నిధిలో శరణాగతి చేసినవారికి పరమపదంలో స్థానం లభిస్తుంది.** భక్తుడు ఇష్ట దేవతను పారవశ్యాన స్తోత్రం చేస్తున్నప్పుడు ఆమె స్వరూపస్వభావాలు పలు విధాలుగా గోచరిస్తాయి. ఈ శ్లోకంలో 'దేవి' అని లక్ష్మి సంబోధింపబడింది. సంబోధించడమంటే అభిముఖంగా దేవత సాక్షాత్కరించిన స్థితిని సంభావించడమే.

"దేవీ కృతాభిషేకాయామ్" (అమరం). 'దేవి' అనడం వల్ల సర్వజగత్సామ్రాజ్ఞీత్వం వ్యక్తమవుతున్నది. "దేవ దేవ దివ్యమహిషీం" అని భగవద్రామానుజులవారు శ్రీదేవిని స్తుతించారు.

**త్రిదశ మహిళా మౌళి మాలార్చితం :-** ఎల్లప్పుడు ముప్పదేండ్ల వయస్సు గలవారు త్రిదశులు-దేవతలని అర్థం. 'మహపూజాయాం' అనే ధాతు నిష్పన్నమైన 'మహిళా' శబ్దానికి ఆదరణీయ-స్త్రీ-అని అర్థం.

సరస్వతి, పార్వతి, ఇంద్రాణి మొదలైన దేవతా స్త్రీలు లక్ష్మీదేవి పాద పద్మాలకు తమ తలలపైన అలంకరించుకొన్న పుష్పహారాల చేత అర్చన చేస్తారు.

'పుష్పమాలార్చితం' అనక 'మౌళిమాలార్చితం' అనబడింది. లక్ష్మీదేవి జగన్నియంత్రి. ఆమె కృపవల్ల కలిగిన తమ సౌభాగ్యానికి శిరస్సులను మంగళదేవత పాదాల మీద సమర్పించి అర్చించడం- నమస్కరించడం- కృతజ్ఞతా నివేదనమే కదా! అలాగా, అర్చించనివారు "తైర్దత్తాన ప్రదాయైభ్యోయో భుంక్తే స్తేన ఏవసః" అని శ్రీకృష్ణ భగవానుడు బోధించినట్లు, దొంగలేకదా! "దాసీ భూత సమస్త దేవ వనితాం"- (శ్రీ సూక్తం) అన్నట్లు, లక్ష్మీదేవికి దేవతా స్త్రీలందరు దాస్యం చేస్తుంటారు. శ్లోక ప్రథమ పాదం లక్ష్మీదేవి యొక్క పరత్వాన్ని సూచిస్తున్నది.

**సిద్ధి క్షేత్రం శమిత విపదాం సంపదాం పాదపద్మమ్ :-** లక్ష్మీచరణ పద్మసేవ అనిష్ట నివృత్తిని, ఇష్టప్రాప్తిని కలిగించి కాపాడే సామర్థ్యం కలది.

**"విపదోనైవ విపదః సంపదో నైవ సంపదః ।**
**విపద్వి స్మరణం విష్ణోః సంపత్ తస్యైవ సంస్మృతిః" ॥**

ఆపదలు ఆపదలూ కావు, సంపదలు సంపదలూ కానేకావు. విష్ణుమూర్తిని మరవడమే ఆపత్తు. ఆయనను ధ్యానించడమే సంపత్తు- అనే విషయం గమనీయం.

ఇతర సంపదలలో ఆపదలు కలిసి ఉంటాయి. లక్ష్మీపాద పద్మ సేవ వల్ల కలిగిన ఐశ్వర్యానికి తరుగు లేదు, ఉండదు. లక్ష్మీ పాదమే పద్మం. పద్మమనేది ఒక నిధి. అది అపాయం లేని ఐశ్వర్యానికి సిద్ధి క్షేత్రం, అంటే జన్మస్థలం- పుట్టుచోటు.

'పాదయుగ్మం' అనే పాఠం కంటె 'పాదపద్మం' అనే పాఠమే మెరుగైనది.

**యస్మిన్నీషన్నమిత శిరసః-ధన్యాః :-** లక్ష్మీ చరణ పద్మమందు కొద్దిగా తలవంచిన వారు ధన్యాత్ములు. పరవాసుదేవుని చరణ కమలాలయందు మాత్రం అష్టాంగ, ద్వాదశాంగ ప్రణామం లక్షణంగా చేయవలసియుంటుంది. "యథా తథావాఽపి సకృత్ కృతోఽఞ్జలిః". (ఆళ్వందార్ స్తోత్రం-28) ఏదో ఒక విధంగా ఒక్కసారి అంజలి ఘటిస్తే చాలు అకార వాచ్యుడైన విష్ణుమూర్తి కరిగిపోయి దయ మూర్తీ భవిస్తుందన్నారు శ్రీ యామునమునులు. పాంచరాత్ర శాస్త్ర ప్రకారంగా, తలమీద చేతులను జోడించే మస్తిష్క ప్రణామం, ఉరః స్థలాన చేతులను జోడించే సంపుట ప్రణామం మొదలైన అంజలి బంధాలు అనేక విధాలున్నాయి. "కృష్ణ ప్రణామీ నపునర్భవాయ". శ్రీకృష్ణ భగవానుని సన్నిధిలో చక్కగా వంగిన వ్యక్తికి పునర్జన్మ ఉండదని వేదాంతశాస్త్రం బోధిస్తున్నది.

లక్ష్మీదేవి పాద పద్మమందు మాత్రం భక్తితో కొంచెం తలవంచిన వ్యక్తులు ధన్యజీవులవుతారు. నిధిని సేవించేవారికి ధన్యత్వం సముచితమే. ఈషన్నమిత శిరస్కులకు వైకుంఠప్రాప్తి కలుగుతుందని శ్రీమద్వేదాన్త దేశికులు ఉపదేశిస్తున్నారు.

**యాపయిత్వా శరీరం :-** 'దేహయాత్రను-నిర్వర్తించి' అనడం వల్ల, లక్ష్మీ చరణ కమల-మందు కొద్దిగా శిరోనమనం చేసిన ఫలితంగా, ప్రారబ్ధ కర్మను అనుభవించిన ఈ శరీరమే చివరిదవుతుంది. మరొక జన్మ ఉండదు అని భావం. లక్ష్మీదేవి నామావళిని అనుసంధానం చేసిన వారు "నా వర్తంతే జన్మ చక్రే" సంసార చక్రంలో చిక్కి తిరుగలేరు- జన్మబంధం ఉండదని (శ్లో. 8) ఇంతకు ముందే తెల్పబడింది కదా! మరి ఈ ధన్యాత్ములెక్కడ ఉంటారు?

**వర్తిష్యంతే వితమసి పదే వాసుదేవస్య ధన్యాః :-** అప్రాకృతమైన పరమపదమందు శాశ్వతంగా ఉంటారు. 'తమః' శబ్దానికి 'ప్రకృతి' అని అర్థం. 'వితమః' అంటే ప్రకృతి సంబంధంలేని లేదా తమోగుణంలేని శుద్ధ సత్త్వరూపమై ప్రకాశించే 'పెంజీకటి కవ్వల వెలిగే' లోకమది. "తమసః పరస్తాత్". (పు.సూ)

తమః ప్రచురమైన ప్రదేశంలో తలవంగినవారు తమోరహితమైన తేజోమయ ప్రదేశమందు నిత్యవాసులై వర్తించగలరు. అట్టి లక్ష్మీ పాద పద్మయుగళిని

సేవిస్తున్నానన్నారు దేశికులవారు. "తే పాద పద్మం సేవే" అంటే శిరస్సుతో సేవిస్తున్నాను- "శరణం ప్రపద్యే" అని శరణాగతి చేస్తున్నానని అర్థం. "శ్రియం శీతాపాంగా మహమశరణోయామి శరణం" అని దేశికులు (న్యాసతిలకం-4) నారాయణుణ్ని విడిచి ఉండని లక్ష్మీదేవిని ప్రపత్తి చేశారు.

శ్రీమద్రామానుజ యతీంద్రులు కూడా "ఓమ్ భగవన్నారాయణాభి మతానురూప" మొదల్కొని 'అశరణ శరణ్యాం శరణ మహం ప్రపద్యే' అని శ్రీదేవినీ; గద్య చివర 'శ్రీమన్నారాయణాయ' అంటూ, విశిష్ట శరణాగతిని అనుష్ఠించారు కదా!

"మామేకాం దేవదేవస్య మహిషీం శరణం వ్రజ"-దేవ దేవ దివ్యమహిషినైన నన్ను శరణు పొందుమని 'లక్ష్మీతంత్ర' మందు చెప్పబడింది. "భగవతి యువాం దైవతం దంపతీనః". (శ్లో.10) దేవతాత్వం ఉభయ వృత్తిగా భావించారు కదా ఆచార్యులు.

ప్రథమశ్లోకంలోనూ పురుషకార శరణాగతిని చేశారు. ఈ శ్లోకమందు స్వాత్మ స్వరూపాన్ని సమర్పించడంతో పాటు రక్షాభర సమర్పణం కూడా ఉభయ సంప్రదానకమని భావిస్తూ, నిత్యానపాయినియైన శ్రీదేవిని గూర్చి ప్రపదన మనుష్ఠించారు దేశికులు.

**21.** **సానుప్రాస ప్రకటితదయైః సాంద్రవాత్సల్య దిగ్ధైః**
**అంబ! స్నిగ్ధైరమృతలహరీ లబ్ధ సబ్రహ్మచర్యైః ।**
**ఘర్మే తాపత్రయ విరచితే గాఢ తప్తం క్షణంమాం**
**ఆకించన్యగ్లపిత మనఘైరార్ద్రయేథాః కటాక్షైః ॥**

**అర్థం:-** హే అంబ= ఓ తల్లీ! స+అనుప్రాస ప్రకటితదయైః = పదే పదే ప్రకటింపబడిన దయతో కూడినట్టి; సాంద్ర వాత్సల్య దిగ్ధైః = నిబిడమైన వాత్సల్యంతో నిండుగా పూయబడినట్టి; స్నిగ్ధైః = స్నేహ పూర్ణమైనట్టి; అమృత లహరీ లబ్ధ సబ్రహ్మచర్యైః = అమృత తరంగాలతో సమానస్థితిని పొందినట్టి; అనఘైః = దోషం లేని; కటాక్షైః = కడగంటి చూపులచేత; తాపత్రయ విరచితే = మూడు రకాల తాపాలచే ఏర్పడిన; ఘర్మే= ఎండయందు; గాఢతప్తం = బాగా తపింపజేయబడినట్టి; ఆకించన్యగ్లపితం

= వేరే ఉపాయమేమీ లేనందువల్ల వాడిపోయినట్టి; మాం=నన్ను; క్షణం= ఒక్క క్షణకాలం; ఆర్ద్రయేథాః = చల్లపరచుము.

**తా॥** ఓ తల్లీ! మాటి మాటికి ప్రసరింపజేసే దయగలవి, అమిత వాత్సల్యంతో లిప్తమైనవి, స్నేహయుక్తమైనవి, సుధా వీచికలతో సమానమైనవి, పవిత్రమైనవియైన నీ కటాక్ష వీక్షణాలచే సంసార తాపత్రయంచే కల్పితమైన ఆతపమందు తప్తమై, ఆకించన్యం చేత పూర్తిగా వాడిపోయిన నన్ను క్షణకాలం తడిపి శీతలపరచుమమ్మా!

**వ్యాఖ్య:- తాపత్రయాన్ని శమింపజేయుమని జగదంబయైన లక్ష్మీదేవిని ప్రార్థించే శ్లోకమిది.**

శరణాగతి చేసిన నీకేమి కావాలి? అని లక్ష్మీదేవి అడిగితే, దేశికులు 'తాపత్రయం చేత తపించి పోతున్న నాపైన చల్లని నీ కటాక్షాలను ప్రసరింపజేయు' మని వేడుకొంటున్నారు.

అమ్బ :- లక్ష్మీదేవి జగత్కుటుంబిని. ఆమె విశ్వానికే తల్లి. "లోకమాతా మా రమా మంగళదేవతా"- (అమరం) అమ్మకు తన సంతానంలో అన్ని లక్షణంగా అమరియున్న వానిపైనకంటె ఆకించనుడైన వాని మీద అమిత వాత్సల్యముంటుంది. ఆమె వాని కోసంపడే ఆరాటం చెప్పనలవికానిది. అది అమ్మ చూపుల్లోనే వెల్లడి అవుతుంది. ఆ చూపులు బహుసంఖ్యలో ఉంటాయి, కాబట్టి 'కటాక్షైః' అని బహువచనం ప్రయుక్తం. అట్టి చూపులనే చక్కగా భావనచేస్తూ, భక్తుడు అభిలషిస్తుంటాడని 'అమ్బ' అని పిలవడంలోనే అభివ్యక్తమవుతున్నది.

**1. సానుప్రాస ప్రకటితదయైః :-** పరదుఃఖాన్ని పోగొట్ట గోరే గుణమే 'దయ'. 'అనుప్రాస' మంటే వర్ణావృత్తి. అక్షరాన్ని (లను) మళ్ళీ మళ్ళీ ఉచ్చరించడం. ఈ సమాస పదం కటాక్ష పదానికి విశేషణం. 'సానుప్రాసం' అంటే ఆవృత్తి సహితమైనదని అర్థం. 'నన్ను నీవు దయతో చూడవద్దు' అని బాలుడు అన్నప్పటికీ తల్లి యొక్క దయగల చూపులు 'పునః పునః' అందరికీ తెలిసే విధంగా ప్రకటింపబడుతాయి. తండ్రి యొక్క దయ గూఢంగా ఉంటుంది. కాని తల్లి యొక్క గాఢమైన దయ ఆమె చూపుల్లో బహిరంగమవుతుంది కదా! ఇక్కడ 'కవితార్కిక కేసరి' తల్లి చూపుల పౌనః

పున్య ప్రసారాన్ని అపేక్షిస్తున్నాడు.

**2. సాంద్ర వాత్సల్య దిగ్ధైః :-**

"దిగ్ధ లిప్తే" (అమరం). 'దిహ-ఉపచయే'. దిహ్యంతే సాంద్రవాత్సల్యేన ఇతిదిగ్ధాః. ఘనమైన వాత్సల్యం చేత పూయబడినవి; అని 'కటాక్షైః' అనే పదానికి రెండవ విశేషణం. "ఘనం నిరంతరం సాంద్రం" (అమరం) "అది-బంధనే". సహ అంద్యతే ఇతి సాంద్రం. కూడగట్టబడి యుండేది. దట్టమైనదని అర్థం.

తన దూడ శరీరమందలి ముఱికిని కనబడకుండా నాకి వేసే ఆవు యొక్క ప్రేమకు వాత్సల్యమని పేరు. దేవికి కూడా మన దోషాలను కనబడకుండా చేసే ప్రేమ ఉంటుందని వాత్సల్య శబ్దార్థం.

చందన కర్పూరాది శీతల ద్రవ్యంతో సదృశమైన వాత్సల్యంచేత దిగ్ధ-లిప్త-మైన దేవీ కటాక్షాలు అపేక్షితాలు.

**3. స్నిగ్ధైః :-** స్నిహ్యంతి ఇతి స్నిగ్ధాః. ("ష్ణిహ- ప్రీతౌ") పుత్ర మిత్రాదులందు చూపే ప్రేమను స్నేహమంటారు. "తేన మైత్రీ భవతుతే యది జీవితు మిచ్ఛసి"- రాపాడుతున్న రావణాసురునికి "నీవు బ్రతుక గోరితే రామునితో స్నేహం చేయు"మని హితోపదేశం చేసింది సీతాదేవి. ఆమె కటాక్షాన్ని తిరస్కరించిన ఆ రాక్షసుడు సర్వనాశనమయ్యాడు. సీతామాతృ కటాక్షపాత్రుడైన విభీషణుడు సశ్రీకుడయ్యాడు కదా! లక్ష్మీదేవి కటాక్షాలు స్నిగ్ధాలు; రమణీయాలు; రాగరంజితాలు.

**4. అమృత లహరీ లబ్ధ సబ్రహ్మచర్యైః :-** "ఏకబ్రహ్మ వ్రతాచారా మిథః సబ్రహ్మచారిణః" (అమరం) ఒక గురువు వద్ద ఒక వేదాన్ని అభ్యసించడానికి ఒక వ్రతాన్నే ఆచరించువారు పరస్పరం సబ్రహ్మచారులు. ఆత్మోజ్జీవన విద్యాభ్యాసమందు సమాన బ్రహ్మచర్యం కలవి దేవీకటాక్షాలు.

లక్ష్మీదేవికి అమృతం తోబుట్టువు. అమృతం, లక్ష్మీదేవి క్షీర సముద్రమందే పుట్టడంవల్ల సహజత్వం. అమృతానికి శైత్యం, మాధుర్యం ఉంది. ముదిమిని, మృత్యువును పోగొట్టే స్వభావముంది. అమృతలహరులు నిత్యం ప్రసరిస్తుంటాయి. లక్ష్మీదేవికి సహజత్వాన్ని బట్టి అమృతలహరులతో సమాన వ్రతం, నియమం,

స్వభావమూ ఉంది. కాబట్టి అమృత లహరులతో సమానమైనవి లక్ష్మీకటాక్షాలు.

**5. అనఘైః :–** కల్మషం లేనివి. లక్ష్మీ కటాక్షాలకు ఉపేక్షారూపమైన పాపం లేదు. దేవి కటాక్షాలు ఎప్పుడు కూడా కోపంచేత కలుషితాలు కావు. కాబట్టి పవిత్రమైనవని తాత్పర్యం.

**ఘర్మే, తాపత్రయ విరచితే :–** తాపం బాగా ఏర్పడేది గ్రీష్మర్తువునందే కదా! "ఘర్మో నిదాఘః స్వేదః స్యాత్". (అమరం) జిఘర్తి ఇతి ఘర్మః – (ఘృ–క్షరణ దీప్త్యోః ) ఎండ తీవ్రతచే పీడింపబడిన ఒడలు చెమర్చడం– చెమట కాఱడం–నైసర్గికం. "గ్రీష్మ ఊష్మకః, నిదాఘ ఉష్ణోపగమ ఉష్ణ ఊష్మా గమస్తపః" అని సంతాపాన్ని కలిగించే గ్రీష్మఋతువుకు ఇవి పర్యాయపదాలు. కాబట్టి "సమస్తాపః కామం మనసిజ నిదాఘ ప్రసరయోః"– అని మహాకవి సూక్తి. గ్రీష్మ తాపంవంటిదే మదనతాపమని అర్థం. ఇలా, గ్రీష్మ శబ్ద భావాన్ని వివరించేదే ఈ మాట!

సంసారమందు ఏర్పడే తాపం మూడు విధాలుగా ఉంటుంది.

1. ఆధ్యాత్మిక తాపం :– మానసిక బాధకు 'ఆధి' అని, శారీరక బాధకు 'వ్యాధి' అని పేరు. ఆధి, వ్యాధులచే పీడింపబడడం 'ఆధ్యాత్మికం'.

2. ఆధి భౌతికతాపం :– ప్రాణులచేత– మృగ సర్పాదులచే కలిగే భయం 'అధిభౌతికం'.

3. ఆధి దైవికతాపం :– అతివృష్టి, అనావృష్టి, భూకంపం మొదలైన ఉపద్రవాలు ఆధిదైవికం.

**ఘర్మే గాఢతప్తం మాం అకించన్యగ్లపితం అర్ద్రయేథాః కటాక్షైః :–** సంసారమనే గ్రీష్మమందలి తాప త్రయంచేత బాగా తపింపబడి, వేరేగతి లేమిచే గ్లానిని పొందిన నన్ను నీ కటాక్ష వీక్షణాలచే చల్లపరచుము. "తాపత్రయాతురైః స ఏవ జిజ్ఞాస్యః" (శ్రీ భాష్యం) తాపత్రయ పీడితులైన వారిచే ఆ భగవానుడే తెలుసుకోబడే వాడు, ప్రార్థించబడేవాడు కదా! "ఏష బ్రహ్మ ప్రవిష్టోఽస్మి గ్రీష్మే శీతమివహ్రదమ్". వేసవి తాపకాలమందు చల్లని నీటి మడుగులో ప్రవేశించినట్లే బ్రహ్మ (తత్త్వ)మందు ప్రవేశిస్తే సంసార తాపత్రయం తొలగిపోతుంది. శరీరమూ చల్లబడుతుంది.

"పానీయశాలం మరుభూషుతత్స్యాత్"–ఎడారి నేలలో ఒయాసిసు–

జలాశయంలాగా, తపించిన వ్యక్తికి ఆర్ద్రీకరణం ఆవశ్యకం. చుట్టూ దావాగ్ని వ్యాపించగా దాని నడుమ చిక్కి తపించే జీవిని వర్షంపడి రక్షించే విధంగా, తాపత్రయ పీడితుడై దారి తెలియక తపించి పోతున్న వ్యక్తిని అమృతాన్ని వర్షించేవీ, వాత్సల్య పూర్ణమైనవీ, దయాశీతలమైనవియైన లక్ష్మీకటాక్షాలే తడిపి, చల్లబరచి, రక్షించే సామర్థ్యం కలవి. కాబట్టి ఇందు ఉపమాలంకారం ధ్వనిస్తుంది.

లక్ష్మీ కటాక్షాలను ఐదు విశేషణ పదాలతో కీర్తించినందువల్ల శరణాగతికి శాస్త్రీయమైన "ఆనుకూల్యస్య సంకల్పః, ప్రాతికూల్యస్యవర్జనం", గోప్తృత్వ వరణం, మహా విశ్వాసం మొదలైన పంచాంగ పౌష్కల్యం ఆవిష్కరింపబడింది.

**22. సంపద్యంతే భవభయతమీ భానవస్త్వత్ప్రసాదాత్**
**భావాః సర్వే భగవతి హరౌభక్తి ముద్వేలయన్తః ।**
**యాచేకిం త్వామహ మిహయతః శీతలోదారశీలా,**
**భూయోభూయో దిశసి మహతాం మంగళానాం ప్రబంధాన్ ॥**

**అర్థం:-** హే భగవతి = పూజ్యురాలవైన ఓ లక్ష్మీదేవీ! త్వత్ ప్రసాదాత్ = నీ అనుగ్రహం వల్ల; సర్వే=సమస్తమైన; భావాః = చిత్త వృత్తులు, తలపులు; హరౌ= నారాయణునియందు; భక్తిం= భక్తిని (సేవానిరతిని); ఉద్వేలయంతః = వృద్ధి పరుస్తున్నవై; భవభయ తమీ భానవః = సంసార భీతి అనే చీకటి రాత్రికి సూర్యుల వంటివిగా; సంపద్యంతే= సంపన్నములవుతున్నవి. అహం=నేను; ఇహ=ఇచ్చట; త్వాం=నిన్ను; కిం= దేనిని; యాచే=యాచింతును?యతః = ఎందువల్ల, అంటే; శీతల+ఉదార శీలా= చల్లని, ఉదారమైన స్వభావం కల్గిన నీవు; మహతాం = గొప్పవైన; మంగళానాం = శుభాల యొక్క; ప్రబంధాన్ = (కార్య) పరంపరలను; భూయః భూయః= మళ్ళీ మళ్ళీ; దిశసి= ఇస్తున్నావు.

**తా॥** ఓ భగవతీ! మహాలక్ష్మీ! నీ అనుగ్రహంవల్ల (నా) మనోభావాలన్నీ భగవంతుని యందు భక్తిని పెంచుకొంటూ సంసార భయమనే చీకటిరాత్రికి సూర్యులవంటివై వెలుగుతున్నవి. ఇక నిన్ను నేను ఏమికోరుతాను? దేన్నీ కోరను. ఎందుకంటే, చల్లని, ఔదార్యాన్ని కలిగించే స్వభావం కల్గిన నీవు, గొప్ప శుభ (కార్య) పరంపరలను

ఉత్తరోత్తరాభివృద్ధిగా ఒసగుతున్నావు.

**వ్యాఖ్య:- భగవద్భక్తి, శుభపరంపరలు కలుగదానికి లక్ష్మీదేవి ప్రసన్నతయే కారణమని సుశ్లోకితం.**

ప్రపత్తిని అనుష్ఠించిన వ్యక్తికి-ప్రపన్నునికి కోరదగిన విషయమేదీ ఉండదు. అందుకు లక్ష్మీదేవి యొక్క అనుగ్రహమే కారణం.

**సంపద్యంతే-ఉద్వేలయంతః** :- సంసారంలో భయంలేని స్థానం లేదు. మొదట గర్భవాసమే దుర్భరం. "గర్భేషు నిర్భర నిపీడన భిన్న దేహః"- (శ్రీ వైకుంఠస్తవం 92) తల్లి కడుపులో ఒత్తిడిచేత అవయవాలు మెదుపబడుతుంటే కలిగే దుఃఖం దుర్భరం కదా! తల్లి తినే పదార్థాల గుణాలవల్ల గర్భస్థుని అంగాలయందు కలిగే బాధ మాటలకు అందనంత తీవ్రమైనది. ఎముకలు, నరాలు, మాంసం, రక్తం, మూత్ర పురీషాలతో నిండిన శరీరమూ భయానకమైనదే. "ఊనిదైచ్చువర్వైత్తు ఎన్బుతూణ్ నాట్టి ఉరోమమ్మేయ్న్డు ఒన్బదువాశల్" (పె.తి. 1-6-9) శరీరం జీవునికి ఒక పూరి గుడిశ. మాంసపిండం ఒక చుట్టుగోడ. ఎముకలు గుంజలు, రోమాలు పై కప్పు తొమ్మిది ఛిద్రాలు నవద్వారాలు. శరీరంలో జీవుని ఉనికి నరక తుల్యమన్నాదు తిరుమంగైమన్నన్- బ్రహ్మాండాలే బుద్బుదప్రాయాలుగా ఉంటే వాటిలో భోగైశ్వర్య స్థానాలుగా ఉండే బ్రహ్మ లోకాదుల సంగతి చెప్పేదేమి? భువనాలన్నీ నశిస్తూ తిరిగి జనిస్తూ ఉండేవే కదా! అందుకే, దేశికులు "కిమత్ర నభయా స్పదం భవతి"- (అభీతిస్తవం-13) అన్నారు. సంసార భయమే కటిక చీకటి (రాత్రి) లాంటిది. భయపడేవానికి వివేకముండదు. చీకట్లో ఏ వస్తువూ కనబడదు. "నన్మైతీమైగళ్ ఒన్డు మఱియేన్"- మంచి దేదో చెడ్డ దేదో తెలియనివాడను. అన్నారు శ్రీ విష్ణుచిత్తులు. (పెరియాళ్వార్ తిరుమొఴి. 5-1-3) భయం ఎత్తబడిన వజ్రాయుధంలాంటిది. "మహద్భయం వజ్రముద్యతం". (కఠోపనిషత్తు 2-3-2) పిడుగు పడే సమయం తెల్యకున్నా, అది ఎంత భయంకరమైనదో అందరికీ తెలిసిందే.

చీకటి తొలగిపోవడానికి సూర్యులవలె సంసారభయం నశించడానికి సద్భావాలు కలుగడం అత్యంతావశ్యకం. సూర్యులవలె సద్భావాలు ప్రకాశం కలవి.

వెలుతురులో పదార్థాలు గోచరిస్తాయి. భావాలలో-తలపులలో-వేదాంత జ్ఞానం-పరమ చైతన్యం ప్రకాశిస్తుంది. 'భానవః' అనే బహువచనం 'భావాః' అనే పదానికి విధేయ విశేషణం. ద్వాదశాదిత్యులని శాస్త్రం.

లక్ష్మీ దేవ్యనుగ్రహం వల్ల చిత్తవృత్తులు (భావాలు) సంసార భయమనే చీకటి (రాత్రి)ని పోగొట్టే సూర్యులుగా సంపన్నమవుతాయని రూపకోపమానాల సంకీర్ణ వైచిత్రి. "తమీ భానవః" అనేచోట "తమిాభాస్వతః" అనే పాఠాంతరం ఉంది. 'భాస్వతః' అనే పదం 'త్వత్ ప్రసాదాత్" అనే పదానికి విశేషణమవుతుంది. చీకటిని తొలగించే సూర్యునిలాంటి లక్ష్మీదేవి అనుగ్రహంవల్ల-అని అర్థం. లక్ష్మీదేవ్యనుగ్రహ సంకల్పమే సూర్యోదయమని భావం. "ధ్వాంతే గాఢాంధ తమసమ్"- తమస్సంటే గాఢాంధకారమే. 'తమస్సుకలది తమిా"- "రజనీయామినీ తమిా"- చీకటిరాత్రి (అమరం).

సర్వేభావాః :- ఆశయాలు, అభిప్రాయాలు అన్నీ. భావాలు అనేక విధాలు. "నీవే తల్లివి తండ్రివి, నీవే నా తోడు నీడ, నిజముగ సఖుడౌ । నీవే గురుడవు, దైవము; నీవే నా పతియు గతియు".

"పితాత్వం మాతాత్వం దయిత తనయస్త్వం ప్రియసుహృత్" అన్నట్లు పలు తలపులతో భగవానుని కీర్తించడమే 'స్తుతి' కదా! భగవానుడే సర్వవిధ బంధువు. కాబట్టి 'తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత !" (భ.గీ.12-62) అనే సూక్తి విస్మరించరానిది.

**హరౌ భక్తి ముద్వేలయంతః** :- "హరతి ఇతి హరిః" దుఃఖాన్నీ, పాపాలనూ హరించేవాడు । ప్రపంచాన్ని తన వశంలో ఉంచుకొనేవాడు హరి. "ఉపహరతి ఇతి హరిః" – జగత్తును లక్ష్మీదేవికి కానుకగా ఇచ్చినవాడు హరి.

హరిపత్నికి-శ్రీదేవికి – 'హరిణీ' అని పేరు. హరిం నయతి చేతనాన్ ఇతి హరిణీ. చేతనులు హరిని పొందునట్లు చేసేది హరిణి.

లక్ష్మీ ప్రసాదంవల్ల భావాలు హరియందు భక్తిని పెంచుకొంటున్నాయి. 'ఉద్వేలయంతః' అంటే ఉత్తరంగితాలవడం; కెరటాలు చెలియలికట్ట పైకి

చెంగలిస్తుంటాయి. అలాగే భావాలు హరిభక్తియందు మించుతున్నాయి. సాధన భక్తి, సాధ్యభక్తి యని భక్తి రెండు విధాలు. 'ప్రపత్తి'నే సాధ్యభక్తి అంటారు. భక్తిని పెంచు కోవడమంటే ప్రపత్తిని అనుష్ఠించడమన్నమాట.

'భగవతి' అనే పదం లక్ష్మీదేవికి సంబోధనగా చెప్పబడింది. దాన్ని సప్తమీ విభక్తి ఏకవచనంగా 'హరౌ' అనే పదానికి విశేషణంగానూ అన్వయించవచ్చు. లక్ష్మి సహధర్మచారిణి కాబట్టి "విదితః సహిధర్మజ్ఞః శరణాగత వత్సలః" అని మూర్తీభవించిన ధర్మమైన ధర్మజ్ఞుడూ శరణాగతవత్సలుడూ అయిన తన పతియందే (హరియందే) భక్తిని కలిగియుండే విధంగా ప్రోత్సహిస్తుంది.

**కింత్వామహ మిహయాచే :–** నీ పాదభక్తిని యాచించడంలో దోషం లేదు, ఉండదు. కాని ఇప్పుడు దాన్ని యాచించే అవకాశం లేదు. సంపన్నుడు ఇతరులను యాచింపడు కదా! భక్తి ప్రార్థన కూడా చేయవలసిన అవసరం లేదు. స్వయంగా భావాలు భక్తి ప్రపత్తులుగా సిద్ధించాయి, కాబట్టి ప్రార్థనీయమైనదేదీలేదు. జీవించడానికి ధనాది సంపదను కూడా నిన్ను వేడుకోలేను. ఎందుకంటే, నేను యాచించకముందే నీ దయవల్ల అన్నీ నాకు లభించాయి అన్నారు దేశికులు.

వాస్తవంగా ప్రపన్నుడు భక్తి రూప జ్ఞానాన్ని, వైరాగ్యాన్ని యాచించడం తప్ప మరొకటిని యాచించడు. లక్ష్మి కృపా కటాక్షం వల్ల దేశికులు జ్ఞాన వైరాగ్య భూషణులయ్యారు. "యానిశా సర్వభూతానాంతస్యాం జాగర్తి సంయమీ"– (భ.గీ.2–69) సర్వప్రాణులకు రాత్రియైన సమయంలో స్థిత ప్రజ్ఞుడైన యోగి మేల్కొని యుంటాడు" అన్నట్లు, దేవ్యనుగ్రహంవల్ల పదార్థాలు, ఆశయాలు అన్నీ సంసార భయరూప తమస్సును నిరసించే సూర్యులుగా సంభవిస్తున్నాయి. అటువంటి దశలో దేశికులకు "సంసార ఏష భగవన్! అపవర్గఏవ".

ఈ సంసారమే మోక్షస్థానంగా ఉంది. దీనికి మూలకారణం శ్రీదేవి కృపా కటాక్షమే. లక్ష్మికి వశుడై ఉన్నందువల్లనే హరి (దుఃఖహరణశీలుడైన) హరి అని పేర్కొనబడుతున్నాడు. లక్ష్మి మాత్రం 'శీతలోదారశీల'–దయా శీతలం, ఉదారం అంటే సర్వసంపదలనిచ్చే స్వభావం కలది.

**ఐశ్వర్యమక్షరగతిం పరమంపదంవా**

**కస్మైచి దంజలిభరం వహతే వితీర్య ।**

**అస్మైన కించి దుచితం కృతం ఇత్యథాంబ !**

**త్వం లజ్జసే కథయకోయ ముదారభావః ॥** (శ్రీ గుణ.రత్నకోశం-58)

తల్లీ! నీవెంతటి ఔదార్యవంతురాలవమ్మా! ఎవడో అజ్ఞాతభక్తుడు వచ్చి అంజలి ఘటించడమే భారమని మోస్తున్నాడు. అంటే, ఇష్టం లేకున్నా తప్పనిసరిగా రెండు చేతులను జోడించాడు. అతనికి (లక్ష్మీదేవి) ఐశ్వర్యమైతేనేమి, కైవల్యమైతే నేమి, పరమపదమైతే నేమి ఉదారంగా ఇచ్చేసికూడా "అయ్యో! అంజలి ఘటించిన వ్యక్తికి తగినట్లు నేను ఏమీ ఇవ్వలేక పోయినానే" అని నీవు సిగ్గుపడుతున్నావు. ఇదెక్కడి ఉదారభావమమ్మా! అంతులేనిది కదా! అని శ్రీ పరాశరభట్టరు స్తుతించారు.

"ఆర్ద్రాం, పుష్కరిణీం" అని శీతల గుణాన్ని, "దేవజుష్టాం, ఉదారాం" అని ఉదారభావాన్ని వేదం-శ్రీ సూక్తం- కూడా ప్రకటిస్తున్నది.

**భూయో భూయోదిశసి మహతాం మంగళానాం ప్రబంధాన్ :-** 'మహతాం' అంటే 'మహాపురుషులకు' అని అర్థం కాదు. ఈ పదం 'మంగళానాం' అనే పదానికి విశేషణం- "అప్రార్థితో నగోపాయేత్". ప్రార్థింపబడని వ్యక్తి రక్షింప వలదు- అనే నిషేధాన్ని కూడా పరిగణించక, లక్ష్మీ దేవి యాచించని వానికి కూడ బ్రతుకడానికి గొప్ప సంపదలనొసగుతున్నది.

"లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహం" ఆపదలను తొలగించి సర్వ సంపదలనిచ్చే శ్రీరాముని విషయమై 'సకృదేవ ప్రపన్నాయ'- ఒక్కసారి మాత్రమే ప్రపత్తి చేస్తే చాలు- నని ఆయన చెప్పినప్పటికీ మళ్ళీ మళ్ళీ ప్రణతులర్పిస్తుంటాం. లక్ష్మీదేవి మాత్రం తానే మళ్ళీ మళ్ళీ మంగళ పరంపరలను సమకూర్చుతూ ఉంటుంది.

"కృత స్వస్త్యయనం మాత్రా" (రా.బా. 22స. 2) తల్లి కౌసల్య శ్రీరామునికి అనేక మంగళాశాసనాలను చేసింది కదా!

లోకమాత కాబట్టి ఎన్నిటినో, ఎంతో ఇచ్చినా ఆమెకు తృప్తి లేదు, అని

'మంగళానాం ప్రబంధాన్' అనే బహువచనం వల్ల విశదమవుతున్నది.

దేశికులకు కోరవలసిన అవసరమే లేదు; ఎందుకంటే, దైనందిన జీవితంలో ఏనాటికా నాడు శుభపరంపరలను ఉత్తరోత్తరాభివృద్ధిగా అనుభవింపజేస్తున్నది లక్ష్మీ కటాక్షం. విహితకర్మాచరణం, పరనింద–పరద్రవ్యాపహరణాది నిషిద్ధ కర్మలనుంచి వైముఖ్యం, దివ్యదేశ నివాసలాభం, భగవత్కైంకర్య నిష్ఠ, వేదాంత శాస్త్ర ప్రవచనం, పూర్వాచార్యుల శ్రీ సూక్తుల పరిశీలనం, శ్రీ శ్రియఃపతుల మహిమను ప్రకటించే సద్గ్రంథ రచనం, ఆధి వ్యాధుల ప్రతిబంధం లేకుండా వర్ణాశ్రమాచార నిర్వహణం ఇత్యాది శుభపరంపరలు కలుగుతునే ఉన్నవి. చరమదశలో అంతిమ స్మరణం, సుషుమ్నా ప్రవేశం, అర్చిరాదిగమనం, విరజానదీతరణం, అమానవ స్పర్శనం, భగవత్ప్రాప్తియే అంతంగా గల శుభపరంపరలను కూడా ఆయా అవసరాలలో శ్రీదేవియే సమకూర్చగలదు. వీటికన్నిటికీ లక్ష్మీదేవ్యనుగ్రహమే మూలకారణం కదా! ఇంతకు మించిన పురుషార్థం వేరే ఏముంది? కాబట్టి, తమకు ప్రార్థించదగినదేదీ లేదని దేశికులు విన్నవించారు.

**23. మాతాదేవి! త్వమసి, భగవాన్వాసుదేవః పితామే ।**
**జాతఃసోహం జనని! యువయోరేక లక్ష్యం దయాయాః ।**
**దత్తోయుష్మత్పరి జనతయా దేశికైరప్యతస్త్వం**
**కింతే భూయః ప్రియమితికిల స్మేరవక్త్రా విభాసి ॥**

**అర్థం:–** హేదేవి=ఓ శ్రీదేవీ! మేనాకు; త్వం=నీవు; మాతా=తల్లివి; అసి=అవుతున్నావు. భగవాన్= షాడ్గుణ్య మూర్తియైన; వాసుదేవః= శ్రీమన్నారాయణుడు; పితా=తండ్రి; సః = అట్టి; అహం=నేను; యువయోః = మీ ఇద్దరి యొక్క; దయాయాః=దయకు; ఏకలక్ష్యం= ఒకే లక్ష్యంగా; జాతః=అయినాను. హే జననీ= ఓ తల్లీ! దేశికైః,అపి = ఆచార్యుల చేత కూడా; యుష్మత్ పరిజనతయా= మీ సేవకునిగా; దత్తః = సమర్పింపబడినాను. అతః = అందువల్ల; తే=నీకు; భూయః= మళ్ళీ; కిం= ఏమి; ప్రియం = ప్రియమైనది; ఇతి=అని; త్వం= నీవు; స్మేరవక్త్రా = మందహాసంతో కూడిన ముఖం కలదానవై; విభాసికిల= ప్రకాశిస్తున్నావు కదా!

**తా॥** దేవీ! నీవు నాకు తల్లివి. షాడ్గుణ్య పూర్ణుడైన వాసుదేవుడు నా తండ్రి. మీకు కల్గిన పుత్రుడను నేను. మీ ఇద్దరి దయకు పాత్రుడను. మీ సేవకునిగానూ ఆచార్యులచేత సమర్పింపబడిన వాడను. అందువల్ల నీవు నన్ను జూచి 'ఇంతకంటె నీకేమి కావాలి' అని మందహాస సుందరవదనవై ప్రకాశిస్తున్నావు కదా!

**వ్యాఖ్య:- లక్ష్మీదేవి ముఖంలో వికసించిన చిరునగవు వ్యక్తపరచే భావాన్ని దేశికులు ప్రకటించే శ్లోకం.**

తనకు లక్ష్మీ కటాక్షంవల్ల మంగళపరం పరలు సంభవిస్తున్నప్పుడు ఇంక కోరదగినదేదీ లేదని విజ్ఞప్తి చేశారు దేశికులు. లక్ష్మీదేవి చిన్నగా నవ్వింది. ఆ చిఱునగవుకు అభిప్రాయం ఇదే అయి ఉంటుందని దేవితోనే మనవి చేస్తున్నారు.

ఓ దేవీ! నీవు నాకు తల్లివి. "మాతృదేవోభవ" అని శ్రుతి పలుకుతుంది కదా! తల్లి నేరుగా దేవత కాకపోయినా "నీవు తల్లిని దేవతగా భావించేవాడవుకమ్ము" అని వేదవాణి శాసిస్తున్నది. లోకమాతయైన లక్ష్మీదేవిని 'అస్మన్మాతరం' అన్నారు భగవద్రామానుజులు.

**భగవాన్ వాసుదేవః పితా :-** 'వసతీతి= వాసుః' అంతట ఉండే వాడని అర్థం. 'దీవ్యతే ఇతి = దేవః' ప్రకాశించేవాడని వ్యుత్పత్త్యర్థం. వాసుశ్చా సౌ దేవశ్చ= వాసుదేవః. అని ఈ సమాసపదానికి విగ్రహవాక్యమిది. మరొకటి వసుభిః-పుణ్యైః దీవ్యతే ఇతి=వసుదేవః. వస్తువులచే అంటే పుణ్యకర్మలచే ప్రకాశించేవాడు వసుదేవుడు.

వసుదేవస్య అపత్యంపుమాన్ = వాసుదేవః వసుదేవుని సంతాన పురుషుడు= వాసుదేవుడు. (ఇది అపత్యార్థకతద్ధిత వృత్తి).

**"సత్త్వం విశుద్ధం వసుదే వశబ్దితం**
**యదీయతే తత్ర పుమానపావృతః ।**
**సత్త్వేచ తస్మిన్ భగవాన్ వాసుదేవో**
**హ్యధోక్షజో మే మనసా విధీయతే ॥"** (భాగ.4-3-23)

వసుదేవ శబ్దం చేత పరిశుద్ధమైన అంతఃకరణమందలి సత్త్వగుణం చెప్పబడింది. సత్త్వగుణ శోభితమైన హృదయమని అర్థం. అట్టి సాత్త్విక హృదయమందు

